



# తెగిన తీగలు

డా. ప్రమీలా కుమారి

ప్రచురణ నెం. 6.

హక్కులు అమరసాహితివి

మూల్యం: రూ. 5-00

క్రోధి భాద్రపదమ్

ముఖ చిత్రం:

శ్రీ మడిపడగ బలరామాచార్య

ముద్రణ:

స్వారాజ్య ప్రింటింగ్ వర్క్స్,
10, పద్మానగర్, సికింద్రాబాద్-25

వ్యవస్థాపకులు:
శ్రీ అడపా వెంకటస్వామినాయుడు



సంపాదకులు—.

అడపా శివాజీనాయుడు

# మా మాట

అభ్యుదయ కవులు, ప్రఖ్యాత రచయితలచే రచించబడిన కావ్యాలు, నవలలు, నాటకము వెలువరించాము. అవి యావదాంధ్ర పత్రికలచే, పాఠకులచే అశేష ప్రశంసా పరంపరల్ని అందుకున్నవి.

షష్ఠమ కుసుమంగా రచయిత్రి డి. ప్రమీలాకుమారి రచన 'తెగిన తీగలు' ఆంధ్ర పాఠకలోకానికి సమర్పిస్తున్నాము.

క్రమంగా మరికొన్ని ఉత్తమ కావ్యాలు, నవలలు, నాటకములు, నాటికలు వెలువరించబోతున్నాము.

ఎప్పటిలాగే ఆంధ్ర భారతికి సాహిత్యసేవ చేయుటకు సహృదయ పాఠకుల అండ దండలుండగలవని ఆశిస్తున్నాము.

అమర సాహితి
హైదరాబాదు.

— సంపాదకులు.
9–9–1964.

# ఏమని వ్రాయాలి?

పై ప్రశ్నను స్వయంగా వేసుకుంటే జవాబు దొరకదు. కానీ, తప్పదు. ఏదో వ్రాయాలి. ఏమి వ్రాయాలో ఆలోచించుకోకుండానే, నా ప్రథమ ప్రయత్నం "తెగిన తీగలు" గురించి కొంత వ్రాయాలని కలం చేతపట్టి ఉపక్రమిస్తున్నాను.

ప్రాచీన-పాశ్చాత్య నాగరికతల మధ్య నలిగిపోతున్న సాంఘిక వ్యవస్థ మనది. నేను వ్రాసిన ఈ నవలలో—అటువంట సంఘంలోని సదుపాయాలనీ, వైభవాన్ని చిత్రించాలనుకోలేదు. సమాజంలోని పూర్తి మంచినిగానీ, చెడునుగానీ చిత్రించాలంటే అది అనంతం, అసాధ్యం! కాబట్టి ఎత్తిచూపించాలనుకున్న కొన్ని లోపాల్ని మాత్రమే తీసుకుని, వాటిని నా కథలోని పాత్రల ద్వారా చెప్పించాను. క్లుప్తంగా చెప్పినా విషయ వివరణలో సఫలీకృతురాలినయ్యాననే భావిస్తున్నాను.

ఈ నవలలోని కథావస్తువు ఆంధ్రప్రభ వార పత్రిక పాఠకులందరికీ సుపరిచితమే. ప్రత్యేకంగా కథ గురించి ఏమీ చెప్పనవసరం లేకపోయినా, కథకు ఆలంబనగా నిల్చిన పాత్రల గురించి కొంత చెప్పదల్చుకున్నాను.

ముఖ్య పాత్రలు భారవీ-ఛాయా-నీలాసుందరులు ముగ్గురూ మూడు రకాల వ్యక్తిత్వాలు గల వ్యక్తులు. చేయవలసిందేమిటో, చేస్తున్నదేమిటో తెలుసుకోలేక, భావుకత్వపు మాయలో మునిగిపోయి, ఒకరి జీవితాన్ని బాగు పర్చుతున్నాననుకొని తన జీవితాన్నే నాశనం చేసుకున్న వ్యక్తి నీలాసుందరి! అటువంటి నీలాసుందరులు నేటి ఆధునిక సమాజంలో కొల్లలు!

ఎదుర్కొన్న సమస్యను విప్పుకోలేక — విపరీత మానసిక సంఘర్షణకు లోనై-తన వేదనాగ్నిలోని వేడిమిని కొంత నీలకుపంచి

యిచ్చి, చివరికేమి చేయాలో తెలియక సంధిగ్ధంలో యిరికిపోయి మూగ పోయిన వ్యక్తి భారవి!

మూడవ వ్యక్తి; ఛాయ! స్త్రీలోని సహజ గుణాలకి ప్రతినిధి ఛాయాసుందరి! భర్తకూ, చెల్లెలికీ అన్యాయం చేయలేకా—తన జంట జీవితంలో ఇంకొకరు పాలు పంచుకుంటూవుంటే భరించలేకా బాధపడి-చివరికి తెగించి భర్తను గెల్చుకున్న స్త్రీ మూర్తి!

ముగ్గురూ ఆధునిక మానసిక బలహీనతకులోనై—గమ్యాన్ని తేల్చుకోలేక—కొంతవరకూ జీవన సాగరంలో వూపిరాడక కొట్టుమిట్టాడిన వ్యక్తులు! నేను చిత్రించిన ఈ పాత్రల రూపచిత్రణ ద్వారా యేకొద్ది మందికయినా గ్రహింపు కలిగితే సంతోషమే.

ఇకపోతే — మిగిలిన విషయాలన్నీ నేటి సాంఘిక వాతావరణంలో సర్వసాధారణమైనవే. అటు పూర్తిగా అజ్ఞానాంధకారంలో వుండక, ఇటు సంపూర్ణసంస్కారాన్నీ సాధించలేక అయోమయంలో పడి పిచ్చిమొక్కలాగావున్న మన సమాజాన్ని విమర్శించ బూనుకుంటే కష్టమయిన పనే! సామాన్య విషయాల్నే వ్రాసిన నేను ఏ వ్యవస్థనీ ప్రత్యేకంగా కించపర్చలేదనే సంతృప్తి పొందుతున్నాను.

చివరి మాటగా నా నవలకు క్రోధి ఉగాది నవలా పోటీలలో ప్రథమ బహుమతినిచ్చి ఆదరించిన ఆంధ్రప్రభ సచిత్ర వార పత్రిక సంపాదకులకూ, పుస్తక రూపంగా ప్రచురించి ప్రోత్సహిస్తున్న అమర సాహితి సంపాదకులు శ్రీ అడపా శివాజి నాయుడుగారికీ, సహృదయాభిమానులైన పాఠకులకూ నా హృదయ పూర్వక ధన్యవాదాల్ని తెల్పుకుంటూ ఇంతటితో ముగిస్తున్నాను.

సోంపేట
శ్రీకాకుళం జిల్లా.

డి. ప్రమీలా కుమారి
*9-9-1964.*

# అంకితం

నన్ను అన్నివిధాలా ప్రోత్సహించి,
నాలోని కళను వెలికి తెచ్చిన
పూజ్యులైన నాన్నగారికి,

ప్రియ పుత్రిక

ప్రమీల

# ఆశీస్సులు

## అమరసాహితికి

ప్రపంచము, క్షణక్షణానికి మారిపోతూ ఉంది. ఖండఖండాంతరాలు దగ్గర పడుతున్నాయి; హిమాలయాలు కరిగిపోతున్నాయి; గ్రహాలు అందుబాటులోనికి వస్తున్నాయి. భావాలూ, వస్తువులూ, వాటి విలువలూ అద్భుతంగా మారుతున్నాయి.

ఈ మార్పుల ప్రభావము, సహజంగా, యువకులమీద ఎక్కువగా పడుతుంది. దానిని నిరూపించగలవారూ, దానివల్ల కలిగిన సమస్యలను నిర్వచించగలవారూ, అవకాశాన్నిబట్టి వాటిని పరిష్కరించగలవారూ యువకులే.

ఆ బాధ్యతను, శక్తి వంచనలేకుండ, నిర్వహించడానికి అమర సాహితివారు పూనుకోవడం సంతోషకారణం. ఈ మధ్య ఆ యువకుల ఊహలూ ఉత్సాహమూ కనులార చూడగలిగాను. వీరికి ఆంధ్ర మహా జనుల ప్రోత్సాహం, సర్వతోముఖంగా, కలుగుతుందని ఆశిస్తున్నాను.

వీరి ఉదార సంకల్పాలూ అనేక గ్రంథాల రూపంగా వెలువడి, ఆంధ్రుల అభ్యుదయానికి ఉపకరించి, ఆంధ్ర సరస్వతి నలంకరించాలని మనసార కోరుతున్నాను

హైదరాబాదు
8–9–64

తాపీ ధర్మారావు.

ఆంధ్రప్రభ సచిత్ర వార పత్రిక

క్రోధి ఉగాది నవలా పోటీలలో

ప్రధమ బహుమతి పొంది

సీరియల్‌గా వెలువడిన నవల

అందమైన ఆ డాబాయింట్లో, హాలు మధ్యగా సోఫాలో కూర్చొని, తలవంచుకుని తీవ్రంగా ఆలోచిస్తూంది నీల. ఆమె పక్కగా కూర్చొని అక్క ముఖం వంక మాటి మాటికీ చూస్తూంది చెల్లెలు విజయ సుందరి. వాళ్లిద్దరి ఎదుట నున్న టేబిలుపైన పుస్తకాలు కొన్ని చిందర వందరగా పడివున్నాయి. ఆ టేబిలుకు రెండవ వైపు వున్న సోఫాపై ఒక యువకుడు కూర్చొని ఇంటికప్పు వంకా, గోడమీది చిత్రాల వంకా చూస్తూన్నాడు. మొత్తానికి ఏదో క్లిష్ట సమస్యను ఛేదించ బూనుకున్నట్లుగా ముగ్గురూ మౌనముద్రాంకితులైనారు. గడియారం టక్కు టిక్కు చప్పుడు తప్పి వేరేమీ శబ్దమూ లేదు.

ఒక పావు గంట పోయాక నీలా సుందరి తల ఎత్తి చిరునవ్వు నవ్వుతూ గాఢంగా నిట్టూర్చింది. తక్కిన ఇద్దరు వ్యక్తుల వదనాల్లో కూడా హాసం వుదయించింది. అందరిలోనూ ఒక్కసారి చలనం కల్గినట్లయింది.

"ఆన్సరు వచ్చింది మాష్టారూ. పాడులెక్క ఎంత విసిగించి చంపిందండీ!" అన్నది నీల తన చేతిలోని పుస్తకం ఆ యువకుని ఎదురుగా టేబిలు మీద పెడుతూ.

మాష్టారనబడే శ్రీనివాసరావు ఆ పుస్తకాన్ని చేతి లోనికి తీసుకుని పెన్ను అందుకుంటూ నవ్వాడు.

"నాకు తెలుసు. నీకు ఆన్సరు రాకపోవడ మేమిటి ? ఆఁ".

ఆ లెక్కను దిద్దుతూ అన్నాడతను: "ఈ రాత్రి వైజాగు వెళుతున్నాను. రెండు రోజుల దాకా రానేమో! ప్రస్తుతం నేను హోం వర్కు ఏదీ ఇవ్వడం లేదు. మీ కేది ఇష్టమయితే అది చెయ్యండి."

"ఇప్పుడెలా వుందండీ మీ అక్కగారికి ?" అనడిగింది విజయ.

"కొంచెం బావుందనే తెలిసింది. కొద్ది రోజుల్లో డిశ్చార్జి చేసేస్తారని కూడా విన్నాను."

"ఎవరో వచ్చినట్టున్నారు. వెళ్ళిచూడు, విజ్జీ!" అన్నది నీల తలెత్తి వీధి గేటు వంక చూస్తూ. విజయ లేచి కర్టెను తొలగించింది.

"టెలిగ్రాం." అన్నాడు మెసెంజరు.

గుండెఝల్లు మన్నది. దిగ్గున లేచింది నీల. కళ్ళమ్మట నీళ్ళు తిరుగుతూండగా వణికే చేతులతో సంతకం చేసి తీసుకున్నది.

"అమ్మను చూసి వచ్చి ఇంకా వారం రోజులయినా కాలేదే. భగవాన్ ! ఏమయింది ?"

—"సెండ్ చిల్డ్రెన్, నెక్స్ట్ ట్రెయిన్,"

—"భారవి"

మనసు కొంచెం స్థిమితపడింది. "ప్రమాద పరిస్థితి అయితే నాన్నవిని కూడా రమ్మని వ్రాసేద్దురుగా?" అనుకొని స్థిమితపడింది.

"అమ్మా! ఏమిటదీ!" అంటూ లోపలి నుండి కేక వేశారు రాఘవయ్యగారు. నీల తడబడుతూ లోపలికి వెళ్లి టెలిగ్రాం అందిచ్చింది.

అది చదువుతూనే ఆయన ముఖం వివర్ణమయి పోయింది. "ఎలా ? ఏం చేయాలి ?" అంటూ కుర్చీనుండి లేచి హాల్లోకి వచ్చారాయన.

"మాష్టారూ, విన్నారుగా ? ఏం చెయ్యమంటారు ? పిల్లల్నెవరితో పంపించను ? నేను అశక్తుడ్నయి పోయాను అన్నిటికీ." ఆయన కంఠం వణికింది.

"మీరేమీ గాభరా పడకండి. నేను ఈ రాత్రి వెళుతున్నానుగా? నావెంట పిల్లల్ని తీసికెళ్ళగలను."

"ఇప్పుడు బయలుదేరలేరా?"

"ఇప్పుడా? రాత్రికి అయితే నాకు కన్వీనియంట్ గా వుంటుందనుకుంటున్నాను."

"సరే. చూద్దాం. ఏం చెయ్యమంటావమ్మా?" అంటూ ఆయన నీలాసుందరి వంక తిరిగారు.

తండ్రి ఆత్రుత చూస్తున్న నీలాసుందరికి మనసులోని దిగులు అధికమయింది. "బాబాయిని అడిగిచూడు నాన్నా! అంతగా ఎవరూ లేకపోతే దేవయ్య తీసికెళ్ళగలడు."

ఈ మాట విజయకు నచ్చింది. మాష్టారితో ప్రయాణ మంటే ఆమెకు మొగమాటంగా వుంది. ఆ ఇబ్బంది తీరి పోయింది.

"ఆఁ- ఆ ఆలోచన బావుంది" అంటూ తమ్ముణ్ణి పిలవనంపడానికి బయటకు వెళ్ళారు రాఘవయ్యగారు.

"అయితే ఇప్పుడు వెళిపోతున్నారన్నమాట" అన్నాడు శ్రీనివాసరావు లేచి నించుంటూ.

దుఃఖంతో మాట పెగలని సుందరి తల వూపింది.

"వైజాగులో కలుసుకుందాం మళ్ళీ. వస్తాను" అంటూ లేచి అలవాటు ప్రకారం షర్టుజేబులు ఒకసారి తడుముకొని వెళ్ళిపోయాడు శ్రీనివాసరావు. వెళుతూ వుండి అతను తన కళ్ళల్లోకి చూడ్డానికి ప్రయత్నించడం గమనించింది నీల. కానీ ఇప్పుడటువంటి విషయాలు పట్టించుకునే స్థితిలో లేదు ఆమె మనస్సు. ఆమె తాలూకు సర్వ ధ్యానమూ, హాస్పటల్లో బెడ్ పైన నీరసంగా పడివుండే తల్లిచుట్టూ తిరుగుతూంది. కీడును శంకించే మనసుని మాటిమాటికీ అదుపులో పెట్టుకుంటూ, లోపలకు నడిచి, తడబడే చేతులతో బాగులో రెండు బట్టల్ని కూరింది. అటూ యిటూ తిరగబోయి కాళ్ళాడక ఒక చోట కూలబడి పోయింది.

"బట్టలు మార్చుకోవా అక్కా?" అన్నది విజయ భయం భయంగా నీలవంక చూస్తూ.

ఉలిక్కిపడింది నీల. "ఏమంటున్నావు? బట్టలా? లేదు, లేదు. నువ్వు మార్చుకో. నేనిప్పుడు మార్చుకోలేను." అని

చెబుతూ హాల్లోకి వెళ్ళింది. ఆఖరి తమ్ముణ్ణి ఎదురుగా కూర్చోబెట్టుకొని బ్రతిమాలుతున్నట్లుగా చెబుతున్నాడు తండ్రి.

"ఒక్క నిమిషం కూడా ఆలస్యం చెయ్యకు నాయనా! టైము దాటిపోతుంది."

"ఇదిగో. ఇప్పుడే ఇంట్లో చెప్పి వస్తాను" అంటూ లేచాడు రామానందం. "నువ్వు సిద్ధంగా వున్నావా అమ్మా?"

"నాదేమీ ఆలస్యం లేదు, బాబాయ్" అని జవాబిచ్చిం సుందరి.

ఆ తరువాత, స్టేషన్లో కూర్చున్నా, రైల్లో కూర్చున్నా ప్రపంచమంతా దుఃఖమయంగా కన్పించ సాగింది నీలకు. చీకటి ఆలముకుంటూ వుండగా, ఇంకా స్టేషను రాదేం? రాత్రయి పోతే మళ్లీ అమ్మను చూడ్డానికి పర్మిషను ఇవ్వరు. అన్న ఆత్రుత క్షణిక్షణానికీ ఆమేలో అధికమయి పోయింది. ఆఖరికి దేవుడు ఆమె మొర ఆలకించనేలేదు. రాత్రి 9 గంటలకు ట్రయిను వైజాగు స్టేషన్లో ఆగింది.

ఆత్రుతగా, స్టేషను కెవరయినా వచ్చేరేమోనని చూస్తున్న నీల "దిగక్కా!" అన్న విజయ మాట విన్పించగానే మెల్లగా దిగింది.

పెట్టెలన్నీ వెతుకుతున్న ప్రకాశ్‌నూ, భారవినీ చూసి రామానందం కేక వేశాడు. "ఏమండోయ్! ఇక్కడ!"

ఆ కేక వాళ్లకు విన్పించనే లేదు. సుందరి పిలువ బోయి తమాయించుకుంటూ, "వెళ్లి పిల్చుకురావే. ఈ జనంలో మనం ఎక్కడ కన్పిస్తాం?" అన్నది విజయతో.

ఇంతలో వాళ్లు గుర్తుపట్టి దగ్గరకు రానే వచ్చారు. భారవి, రామానందం కేసి చూసి నవ్వుతూ, "మీరు కూడా వచ్చారన్నమాట. పిల్లల్నిద్దర్నీ అక్కడ ఎక్కించేస్తారని అనుకున్నాము." అన్నాడు.

"లేదు. మా అన్నయ్య వెళ్లమన్నాడు లెండి. రేపుదయం నేను వెంటనే వెళ్లిపోవాలి కూడాను. " మొగమాటంగా నవ్వి ప్రకాశ్ వంక చూసి, "బాగున్నారా ?" అన్నాడు రామానందం.

ఊఁ." అన్నాడు ప్రకాశ్ ముభావంగా సుందరి చేతిలో బాగును భారవి అందుకున్నాడు.

గబగబ నడుస్తూనే, "ఎలా వుంది బావా, అమ్మకి ?" అన్నది సుందరి ఆత్రం ధ్వనించే స్వరంతో

ఆమె కళ్ళల్లోకి ఒక్కసారి చూసి, "చూద్దువుగానిలే రేపు. అక్కడ తెలుస్తుంది పద" అన్నాడు భారవి.

ఈ మాటతో ఆమెలోని ఆరాటం అధికమయింది. పొంగివచ్చే దుఃఖాన్నాపుకుంటూ టాక్సీలో కూర్చుంది.

ఆ మహా పట్టణంలో వీళ్లు బసచేసినది హాస్పిటలుకు ఆనతి దూరంలో వున్న రెండస్థుల మేడలో రెండు గదులు. వీళ్లలాంటివాళ్లే అసంఖ్యాకంగా వచ్చి ఆమేడలోని ప్రతీ గదినీ ఆక్రమించుకుంటూరారు. రోగులు దినదినప్రవర్ధమానంగా పెరుగుతున్న ఈ రోజుల్లో ఆ మేడలోని ఒక్కగదీ ఏనాడూ ఖాళీగా ఉండదు.

ఆ నిశ్శబ్ద నిశీథిలో, భయంకరంగా నిద్రపోయే ఆ మేడ ఎదుట చీకటిని చీల్చుకుంటూవచ్చి ఆగింది టాక్సీ. టాక్సీ

రావడాన్ని కిటికీలోంచి చూస్తున్నా భారతివచ్చి, తలుపుతెరచి, లోపల అడుగు పెడుతున్న నీలాసుందరినీ, విజయనూ రెండు చేతులతో దగ్గరకు లాక్కుంది. గదిలో ఒక మూలగా నిర్వేదంగా పడుకునివుంది ఛాయ. మరుక్షణంలో అక్కచెల్లెళ్లు నలుగురూ ఒకరినొకరు పెనవేసుకుని కుమిలికుమిలి రోదించారు.

కూతుళ్లు నలుగురూ గుండెలు పగిలేటట్లు ఏడ్చినా అంతటి దుఃఖానికీ కారణమయిన ఒక వ్యక్తికి మాత్రం ఆ రోదన ధ్వని విన్పించనేలేదు.

ఆమె—నిశ్శబ్ధంగావుండే హాస్పిటల్లోని ఒక వార్డులో బెడ్ పైన అచేతనావస్థలో పడివుంది.

## 2

కుమార్తె లిద్దరూ జట్కాఎక్కి వెళ్లిపోగానే ఇల్లంతా కళావిహీన మయిపోయినట్లనిపించింది రాఘవయ్యగారికి. దిగులుగా కుర్చీలో కూర్చుని చుట్ట వెగిలించుకున్నాడు. గడచిన రోజులన్నీ తల్చుకుంటూ, "ఎంతలో ఎటువంటి మార్పు!" అనిపించిందాయనకు.

నిత్యమూ వచ్చిపోయే అతిథులలో, పిల్లల సందడితో, ఒక పెళ్లి పందిరిలాగా కళకళలాడే గృహంలో ఈ నాడు నిశ్శబ్ధందోగాడుతూంది. ఎంత భయంకరంగా, దిగులుగా వుందీ ఇల్లు! తానేనాడయినా ఇంట్లో ఇలా తీరిగ్గా కూర్చుడా ?

భార్య మంచానపడిన దగ్గర్నుండీ ఎవరో శపించినట్లు తన జవసత్వాలన్నీ వుడిగిపోయాయి. అదేదో తెలియని జబ్బ

ప్రవేశించింది. దగ్గు, నీరసం! నిరాటంకంగా, లాభసాటిగా సాగే బియ్యం వ్యాపారాన్ని కట్టివెయ్యడం ఇష్టంలేక ఆ బాధ్యతను పూర్తిగా తమ్ముళ్లపైన విడిచి పెట్టేశాడు.

అసలు రాఘవయ్యగారి వృత్తి ప్లీడరీ! ఒక వైపు కోర్టులో కేసులు గెలుస్తూనే, ఇంకోవైపు తమ్ముళ్ళిద్దర్నీ వ్యాపారంలో పెట్టి తానుయాజమాన్యం వహిస్తూ వచ్చాడు. ఇప్పుడు కోర్టుకి వెళ్లి వాదించే శక్తికూడా ఆయనలో మాత్రమూలేదు. ఆఖరికి తన విజ్ఞానం, వివేకం ఇలా మూల పడి వుండాల్సిన అగత్యం కలిగింది. ఈ ఆలోచన రాగానే చుట్టకొనను దులుపుతూ ఆయన విరాగిలా నవ్వుకున్నారు.

ఇప్పటికి మూడునెలలయింది భార్యను హాస్పిటల్లో అడ్మిట్ చేసి. పెద్దల్లుడు సెలవు మీద అప్పుడప్పుడు వచ్చి పోతున్నాడు. చిన్నల్లుడికి ఆవూరే ట్రాన్సఫరయింది కాబట్టి ఫరవాలేక పోయింది. డబ్బిస్తే ఎవరుమాత్రం చెయ్యరు! ముగ్గురిలో ఒక్క కొడుకయినా బ్రతికివుంటే......అసలు భార్యకీ జబ్బేరాక పోనేమో!

'దానిమనుగడ ఇంకెన్నాళ్లు? ఏమిటి అటుపైన తన గతి! పిల్లలిద్దర్నీ ఎలా గట్టెక్కిస్తాడు తను?'

రాఘవయ్యగారు ఇంకా ఆలోచనల్లోనే వున్నారు. ధబ్ ధబ్ మని చెప్పులచప్పుడుతో పాటు—

"ఒరే రాఘవా!" అంటూ బిగ్గరగా చనువుగా పిలుస్తూ లోపలకు వచ్చాడు—ఆరడుగుల విగ్రహం, పట్టై నామాలూ, పంచెకట్టూ, బట్టతలా! వచ్చినవాడు అప్పారావు. అతనూ రాఘవయ్యా పెత్తండ్రీ పినతండ్రి బిడ్డలు.

రాఘవయ్యగారి ముఖం చాటంతయింది. కుర్చీ చూపిస్తూ "నువ్వెప్పుడొచ్చావు, కూర్చో. కూర్చో." అన్నారు.

"ఏదీ ? నేనొచ్చి రెండురోజులయింది. వాళ్లు కదలనిస్తేగా ?"

"ఎవరు ?" అన్నారు రాఘవయ్యగారు. వివరాలు చెప్పాడు అప్పారావు. పక్కవూరిలో కూతురికి సంబంధం అయింది. సెటిల్ చేసుకోడానికి వచ్చాడు.

"అదిసరే. ఏమిటి మరదలికి? బావులేదని విన్నాను. పిల్లలేరీ ?" అన్నాడు అప్పారావు లోపలికి తొంగిచూస్తూ.

"ఇంకెక్కడి మరదలు ? ఆ ఆశ ఏమీ లేదు. మూడు నెల్లయింది ఆసుపత్రిలోవేసి. మూడు వేలు ఖర్చు పెట్టాను. డబ్బంతా నీళ్ళలా ఖర్చయి పోతూంది కానీ నయమయ్యే సూచనలు లేవు. పిల్లలంతా అక్కడే వున్నారు !" ఒక వేదాంతిలా పెద్ద దుఃఖమేమీ సూచించకుండానే చెప్పారాయన.

అప్పారావు విచారాన్ని కనబరుస్తూ అన్నాడు :

"ఉత్తమ ఇల్లాలురా ! ఇటువంటి కష్టం రావలసింది కాదు. నువ్వు ఇక్కడుండి పోయావేం ?"

"నేను వెళ్ళడమే ! !" తన సహజమయిన కంగారుతో అదో ప్రమాద విషయంగా సూచిస్తూ కళ్ళు పెద్దవి చేశారు రాఘవయ్యగారు. "జాతకరీత్యా నాకు మారక దశ యిది. ఇప్పుడు వెళ్ళానో నేను కూడా గంగలో కలవక తప్పదు. అక్కడికి వెళ్ళి ఆ పరిస్థితుల తాకిడికి తట్టుకోగల మనస్థైర్యం

నాకు లేదు. ఇంకా నా సంరక్షణకి ఎవరూ లేరు. ఏం చేద్దా మాఅని చూస్తున్నాను నేను. ఏదో ఈ బండి నెమ్మదిగా పోవలసిందేగానీ......."

"అదేం మాటరా? అంత ఇదిగా ఉన్నప్పుడు జాత కాన్ని నమ్ముకొని యిక్కడుండి పోతావా?"

"ఛ. ఛ. ఏమ్మాటన్నావు? చేజేతులా పీకల మీదికి తెచ్చుకోమన్నావా ఏమిటి" అంటూ పెద్ద గొంతుకతో విసు గుదల వ్యక్త పరిచారు రాఘవయ్యగారు. దానితో అప్పా రావు మరి ఆ వూసెత్త లేదు. సంభాషణ మళ్ళిస్తూ, "పిల్లలకే మయినా సంబంధాలు చూశావా?" అన్నాడు.

"ఆఁ—ఏవో వస్తున్నాయిలే. ఆమధ్య సుందరికి చేయా అనుకున్నాము. సమ్మంధం కూడా స్థిరమయింది. అయితేనేం? లాభంలేక పోయింది."

"అదేం?"

"ఆ అత్తగారి బాధ పడలేక పెద్దకోడలు బావిలో చనిపోయిందని తెలిసింది. ఏదో జబ్బొచ్చి అకస్మాత్తుగా పోయిందని వాళ్ళు మాకు చెప్పారనుకో. అయినా చూస్తూ చూస్తూ పిల్ల గొంతు కోయలేము కదా? అంత డబ్బూ పోసి పెళ్ళి చేసేటప్పుడు వెనకా ముందూ చూసుకోవాలి. దానికీ ఇప్పటి నుండీ పెళ్ళి యిష్టంలేదు కూడాను. మెట్రిక్ కి కదు తున్నది. మనవాడేలే—శ్రీనివాసరావని ఒకబ్బాయి ట్యూషన్ చెప్తున్నాడు. టీచరుగా పని చేస్తున్నాడులే...."

ఆ పైన ఏవో పిచ్చాపాటీ మాట్లాడుకున్నారు. సూర్యు డస్తమిస్తూండగా అప్పారావు లేచి వెళ్ళిపోయాడు.

రాఘవయ్యగారు అరుగు మీదికి తొంగిచూసి "ఒరేయ్! ఆ కిటికీమీద చుట్ట ఉంటుంది. ఇలా అందియ్యి." అంటూ నౌకర్ను కేక వేశారు.

* * *

## 3

తెల్లటి పైట చెంగును కప్పుకొని బుజాల మీదుగా లాక్కుంటూ బాల్కనీ లోనికి వచ్చి, రోడ్డువైపు చూపు సారించింది నీల. కార్తీక మాసపు చలి గజగజ వణికిస్తున్నది. వేళ్లు కొంకర్లు పోయి స్పర్శ తెలీడం లేదు. ముక్కు కొన జివ్వుమంటున్నది. "ఇంకా నాలుగ్గంటలు కాలేదు కాబోలు." అనుకుంటూ లోపలికి వచ్చి టైము చూసింది. పావు తక్కువ నాలుగు! బల్ల క్రింద ఉన్న బాగులోని బ్రష్ తీస్తుండగా ఆ చప్పుడుకి మెలకువ వచ్చింది భారతికి. కళ్ళు తెరిచి, "అప్పుడే లేచావేమిటే? రాత్రంతా నిద్రలేదు కూడాను." అన్నది.

"నాలుగయిందక్కా! తెలివొచ్చేసింది. మరి నిద్ర పట్టదు. అని చెబుతూ మెట్లు దిగి కిందికి వచ్చింది. కింద వరండాలో నిద్ర పోతున్నాడు వంటవాడు చింతామణి.

"చింతామణీ!" అని మెల్లగా పిల్చింది నీల. చింతామణి నిద్రపోయాడంటే వాడి మీదినుండి హౌరా మెయిలు వెళ్ళిపోయినా వాడికి మెలకువ రాదు.

మళ్ళీ పిలిచినా లేవలేదు వాడు. గదుల్లో పడుకున్న వారికి నిద్రాభంగం అవుతుందన్న సందేహంతో ఇక వాణ్ణి లేపకుండానే కొళాయి దగ్గరకు వెళ్ళి దంతధావనం ముగించి మేడ మీదకు వెళ్ళి పోయింది.

తూర్పు దిశను ఉదయ రేఖలు తోచే సరికి ఆ భవంతిలో అన్ని గదుల వాళ్లూలేచి కాలకృత్యాలు ప్రారంభించారు. దబదబ మని కొళాయి లోంచి నీళ్ళు పడుతున్న చప్పుడూ, మగవాళ్ళు కాండ్రిస్తూ పళ్ళు తోముకునే కఠోర శబ్దమూ, బిందెలు ఒకదాని కొకటి ఒరుసుకునే ధ్వనీ విన్పడుతున్నాయి.

నీల ఆలోచనల్లోంచి తేరుకొని పొయ్యి వెలిగించింది. తల్లికోసం హార్లిక్సు తయారు చేసి ఫ్లాస్కులో పోసేప్పటికి వంటవాడు వచ్చాడు, తడి ముఖాన్ని తుడుచుకుంటూ.

"నేను అమ్మ దగ్గరకు వెళుతున్నానక్కా!" ఫ్లాస్కు అందుకుని చెప్పులు వేసుకుంటూ అన్నది.

"ఒక్కదానివీ పోతావా?"

"ఫరవాలేదు." మెల్లగా మెట్లు దిగి వచ్చి హాస్పిటలు వైపుగా పోయే ఎత్తైన రోడ్డుమీద చకచక నడక సాగించింది.

ప్రాతఃకాలపు చలిగాలికి పైట చెంగు అందంగా రెప రెప లాడుతుంది. నడుస్తూన్న నీలకు తమ స్వగృహంలోని తల్లి జ్ఞాపకం వచ్చింది. మర్నాడు అమ్మను తీసుకుని విశాఖ పట్నం వెళ్లి పోతారనగా—ఆ వేళ రాత్రి ఏడు గంటలవుతుంది సెలిగ్రాంలు అందుకొని, అంతకు నాలుగు రోజుల క్రితం వచ్చిన భారతీ, ఛాయా ఎవరో బంధువుల యింటికి వెళ్ళారు. ఇంటి చాకిరీతో అలిసి పోయి వుంది తను. కాళ్ళు లాగు తున్నాయి. నడుం పోటు పెడుతున్నది. తలంతా భారంగా వున్నది. పనంతా పూర్తిచేసుకొని అమ్మ దగ్గరకు వెళ్లి మంచం మీద కూలబడింది తను. బాధకు తాళలేక నిశ్శబ్దంగా రోదించింది.

అమ్మ నీరసంగా తల యిటుతిప్పి, "అమ్మా ఏడుస్తు న్నావా ?" అని అడిగింది.

తనకు దుఃఖం ఆగలేదు. తల్లి మోకాళ్ల మీద తల ఆనించి భోరున ఏడుస్తూ, "ఉదయం నుండీ ఒక్కలాగే పనితో చితికి పోతున్నాను. నాకు చాలా కష్టంగా వుందమ్మా. ఎవరూ సాయం చెయ్యటం లేదు." అంటూ వెక్కి వెక్కి ఏడ్చింది.

కాసేపు అమ్మ వూరుకుంది. తరువాత దగ్గరకు పిలిచి, ఎండి పోయిన తన రెండు చేతులనూ నీరసంగా కళ్లు తుడిచింది. బలంలేని చేతులను కిందికి వాల్చేసి ముఖం అటు తిప్పుకొని ఏడవసాగింది.

నీల గబగబ కన్నీరు తుడుచుకొని మనసు దిటవుపరచు కుంటూ, "ఏడవకమ్మా ! మళ్ళీ కడుపు నొప్పి వస్తుంది, నిజా నికి నాకు పెద్ద కష్టం ఏమీ లేదు. కొంచెం తలనొప్పి." అంది తల్లిని వారిస్తూ.

అమ్మ సంబాళించుకుంటూ, "నీ కష్టం నాకు తెలీదా. అమ్మా ! నా దగ్గరెందుకు దాస్తావు ? అక్క లిద్దరికి ఈ ఇంటి బాధ్యత ఏం తెలుస్తూంది ? వాళ్ల సంసారం ఏదో వాళ్ళది. నీ లాగా వాళ్ళు చెయ్య గలరా, తల్లీ ! వాళ్ళను ఆనడానికి వీలు లేదు." అంటూ బలం లేక కొంచెం ఆగింది.

తను తల వంచుకుని కూర్చుందే కానీ కళ్ళ నీళ్ళు ధారాపాతంగా కారుతూనే ఉన్నాయి.

తల్లికి కళ్ల నీళ్ళు నిండుకున్నాయి. "నేను....మళ్ళీ.... తిరిగి వస్తాననే ఆశ...లే....దు..." అంటూ వుండగానే నీల

తల్లిని వారిస్తూ, "వద్దమ్మా! అలా అనకు...." అంటూ నిస్సత్తువగా అక్కడి నుండి లేవబోయింది.

"కాదమ్మా! ఈ పొట్టలోని కురుపు, గుండెల్లోనికిపోతే ఊపిరి తిత్తులను తిని వేస్తుంది. నేను మరి బ్రతకను. బ్రతికుంటానా మీ యిద్దరికే మంచిది. లేదూ........"

తల్లి మాటలు విని నీల బావురుమంది. లక్ష్మమ్మ ఎటో చూస్తూ చేతులు పైకెత్తి జోడించింది. "భగవాన్! నీవయినా నన్ను కాపాడు. తల్లిలేని పిల్లల్నెంతో మందిని చేరదీసి పెంచాను. ఆ ఫలితం అయినా నాపిల్లల యందు చూపించు అయ్యో! నా పుణ్యాం, నా సత్యం ఎక్కడికి పోయాయి ?" అంటూ తల బాదుకుంది. ఆ సమయంలో తల్లిని వారించడానికూడా తనకు శక్తి లేక పోయింది.

కాస్సేపయాక తల్లి కూతురి వంక చూస్తూ, "ఊరుకో అమ్మా! దేవుడు మన పాలిట వున్నాడులే. నా కొచ్చిన భయం ఏమీ లేదు. నాకు బాగయి పోతుంది. నీవు మాత్రం చదువులో అశ్రద్ధ చెయ్యకు. బాగా చదువు." అన్నది. తాను ఏడుస్తూనే తల వూపింది.

"విజ్జూని బాగా చదివించు. దానికేమీ లోకజ్ఞానంలేదు. అది ఉత్త అమాయకురాలు. నీ చేర్పులో దాన్ని చూసుకో. మీ రిద్దరూ దెబ్బలాడు కోకండి. సఖ్యంగా ఉండండి." ఆ పైన మరేమీ చెప్పలేక పోయింది. దుఃఖం కన్పించకుండా ఉండటానికి అటు ముఖం తిప్పుకుంది.

కాసేపటికి ఇటుతిరిగి, "లే. బట్టలు మార్చుకో. వాళ్లందరి ఎదుట నీవిలా ఉంటే బావుండదు. ముఖం కడుక్కో.

వెళ్ళు." అన్నది. తాను నెమ్మదిగా లేచి అక్కడినుండి వెళ్లిపోయింది.

ఆ మర్నాడే ప్రయాణం! అమ్మకు ముఖం కడిగించీ అతి జాగ్రత్తగా ఆమెను పొదివి పట్టుకొని చీర కట్టింది.

"అమ్మా నీలా! ఇల్లు జాగ్రత్త. నేను మళ్ళీ త్వరగా వచ్చేస్తాలే. నువ్వు బెంగ పెట్టుకోకు." అన్నది లక్ష్మమ్మ. ఛాయ అక్కడే కూర్చుని తల్లి మాటలు వింటూ కళ్ళనీళ్ళునింపు కుంటున్నది. ఇంతలో భారతి కూడా వచ్చి దుఃఖించసాగింది.

లక్ష్మమ్మ పెద్ద కూతురినుద్దేశించి, "మీ ఇద్దరికీ ఇప్పటి దాకా ఏలోటూ లేకుండా జరిపించాను. పెళ్ళిళ్ళూ చేశాను. ఏదో ఒక విధంగా మీ ఇద్దరి ముచ్చటా తీరింది. ఇక—వీళ్ళిద్దరికీ ఏ సరదాలూ తీరలేదు. ఇంటి బాధ్యతంతా నీల మీద పెట్టి చదువులోనూ, వంటలోనూ ఇరికించాను. నా సేవలో ఇన్నాళ్లూ సతమత మయిపోయి, ఆ మధ్య జ్వరంకూడా తెచ్చుకుంది నీల. పాపిష్టి జన్మ అమ్మా నాది! వీళ్ళకు కష్టం కలిగించడానికే ఉన్నాను." అని విలపిస్తూనే నీలనూ, విజయనూ దగ్గరకు పిలచింది. పక్కన కూర్చోబెట్టుకొని తల నిమురుతూ, మాటలాడలేక కన్నీరు కారుస్తూ వుండిపోయింది.

ఇంతలో టైమయిందని వీధి వాకిట్లోంచి కేకవేశారు. భారతీ, నీలా తల్లిని మెల్లగా పొదివి పట్టుకొని వీధి వాకిలి వరకూ తీసికెళ్ళారు.

అంతే-అమె జట్కా ఎక్కడం కూడా తాను చూడలేదు. ఒక్క వూపున ఇంట్లోకి వచ్చిపడి అటుఇటు దొర్లి ఏడవసాగింది.

—భో మని కారు హారన్ విన్పించింది. ఉలిక్కి పడి పక్కకు తప్పుకొంది నీల. తాను హాస్పిటల్‌లో ప్రవేశించిం దన్నమాట! పైట తడిసిపోయి ఉంది కన్నీటితో. "ఎవరు చూశారో ఏమో." అనుకోగానే లజ్జ కలిగిందామెకు. కళ్ళు తుడుచుకొని నడక వేగాన్ని హెచ్చిస్తూ తల్లి ఉన్న వార్డులో అడుగు పెట్టింది.

వార్డులోపల వెచ్చగా ఉంది. పేషెంట్లు కొందరు ఇంకా నిద్రలేవ లేదు. ఇంకొందరు నిద్ర లేచి నీరసంగా లోతుకు పోయిన కండ్లతో తమ వాళ్ల కోసం కాబోలు ఆశగా నిరీక్షి స్తున్నారు. నైట్ డ్యూటీ నర్సు వసుంధర ఇంకా వార్డులోనే ఉంది.

నీలను చూడగానే ఆమె చిరునవ్వు నవ్వింది స్నేహ పూర్వకంగా. "మీరెప్పుడు వచ్చారు?"

నీల శుష్కహాసం చేసి, "రాత్రి వచ్చాను. నైట్ డ్యూటీ యామీది?" అన్నది.

వసుంధర కనుబొమలు చిట్లించి నవ్వుతూనేఅంది. "అవునండీ. నిద్రముంచుకు వస్తోంది. వేగం వెళ్ళి పడుకోవాలి."

నీల తల్లి మంచం దగ్గరకు వెళ్లి స్టూలు మీద కూర్చుంది. లక్ష్మమ్మకు అసలు నిద్ర అనేది ఉండదు. ఆమె జబ్బు అటు వంటిది. ఎంత భరింపరాని బాధ అయినా సహించటమే తప్ప చుట్టూ ఉన్న వాళ్ళను కంగారు పెట్టడం మాత్రం అవిడ విష యంలో ఏనాడూ జరగలేదు.

ఆమెకు బాధ తెలీకుండా నిద్ర పట్టడంకోసం, రోజూ రాత్రి స్టాఫ్ నర్సు వచ్చి ఒక మార్ఫియా ఇంజక్షను చేసి వెళ్లి

పోతూ ఉంటుంది. ఆ ఇంజక్షను ప్రభావం ఇంకా వదల్లేదా మెకు మత్తుగా పడి ఉంది. మధ్యమధ్య కనురెప్పలు తెరుస్తూ, మళ్ళీ మూసుకుంటూంది. జుత్తు చిందర వందరగా ముఖం మీద పడు తూంది. ఎప్పుడూ చిరునవ్వు చిందులాడే పెదవులు బాగా ఎండి పోయి, చలికి పగుళ్ళుబారాయి. ఒంటిలోని రక్తం అంతా గడ్డకట్టినట్లే లెక్క. ఇంజక్షన్ ఇవ్వటానికి కూడా వీలు లేని కండిషన్‌లో ఉంది శరీరం, దేహాన్ని ముట్టుకుంటే మెత్తగా వెల్వెట్ లాగా తగులు తున్నది స్పర్శ. మెడ సన్నగా ఉండి, బలం లేనిదిగా ఉంది.

ఎప్పుడూ కళకళ్ళాడుతూ మందహాసంతో గృహాన్ని వెలిగించే ఆమెకూ, ఈమెకూ ఎంత తేడా! ఆ స్థితిలో ఉన్న తల్లిని చూస్తుంటే నీల కళ్ళవెంట జలజల అశ్రువులు ప్రవహించాయి.

తల్లి నుదుటి మీద పడుతున్న జుత్తును పైకి సర్దుతూ, ఆమె దేహాన్ని ఆప్యాయంగా నిమురుతూ, మెళ్ళోని మంగళ సూత్రాలను తల్లి శరీరానికి గుచ్చుకోకుండా ఉండేటట్లు సర్దుతూ అలాగే కూర్చుంది నీల.

పక్కగా నేల మీద పడక పరుచుకొని నిద్రపోతున్నారు. ముసలి మామ్మా, ఆయా మరియమ్మా. ఐదు నిముషాల వ్యవధిలో ఇద్దరూ నిద్ర లేచారు.

"మీరొచ్చారా అమ్మా! అబ్బ! రాత్రంతా ఒక్కలాగే బాధ పడ్డారండి. రెండు రోజుల నుండి ఎవ్వారం చూడలేక పోతున్నాము. మీ కెలా తెలిసింది?" అన్నది ఆయా నిద్ర గొంతుకతో.

"వైరిచ్చారు." కళ్ళు తుడుచుకొని జవాబిచ్చింది నీల.

మామ్మ ఆవలిస్తూనే, నువ్వెప్పుడొచ్చావు తల్లీ! అమ్మామ్మ మరి కదిలి వెళ్ళకు. ఇక........" అని ఆవలించడం పూర్తి చేసి, "మీ తల్లి మీది కాదే అమ్మామ్మ! మొన్ననే ఖండితంగా చెప్పాడు డాక్టరు. డిస్చార్జి చేసేస్తా మన్నారు. అప్పుడందరూ కాళ్ళ వేళ్ళా పడితే సరే-అనేశాడట. ఆ దేవుడికెంత కనికరం లేక పోయిందే!" అంది.

ఈ విషయాలన్నీ రాత్రే తెలుసుకొని వున్నది నీల. ఇక ప్రయత్నించీ లాభం లేదని సర్జన్లంతా మొదట చెప్పినదే. అయినా ఆశ! తమ ప్రాణాలయినా ధారపోసి ఆ మాతృ మూర్తిని దక్కించుకుందామనే వెర్రిఆశ! "తాము తల్లి లేని పిల్లలా!" అ పైన ఆలోచించటానికి భయం వేసింది నీలకు, పెల్లుబికే దుఃఖప్రవాహాన్ని అణచుకుంటూ, రుద్ధ కంఠంతో "నువ్వు వెళ్ళు మామ్మా. మళ్ళీ పది గంటలకు వద్దువుగాని. నే నిక్కడె ఉంటాలే." అన్నది.

ఆవిడ కావటానికి దూరపు బంధువే అయినా వీళ్ళకు సన్నిహితురాలూ, శ్రేయోభిలాషి! లక్ష్మమ్మనే ఆశ్రయించు కొని ఉన్నది.

మామ్మ వెళ్ళిపోయిన కాస్సేపటికి లక్ష్మమ్మకు కొంచెం తెలివి వచ్చింది. మూసుకుపోతున్న కను రెప్పలు భారంగా తెరచి, నాలికతో పెదాల తడుపుకోడానికి ప్రయత్నించింది. నీల ఆతృతగా కప్పులో కొంచెం హార్లిక్సు పోసి మెల్లిగా తల్లి నోటిలో పోసింది.

కాసేపు తదేకంగా తల్లి ముఖం వంక చూసి ఆమె ముఖం మీదికి వంగుతూ! "అమ్మా !" అని పిలిచింది.

కాసేపు బలాన్ని కూడదీసుకొని, "వూ—" అన్నది తల్లి. మళ్ళీ నిస్సత్తువగా కళ్ళు మూసుకున్నది. ఈ విధంగా అనేక పర్యాయాలు ప్రయత్నించిన తరువాత ఆమెకు కొంచెం చైతన్యం వచ్చింది.

నీల వంక చూస్తు "అమ్మా.... నువ్వు...." అన్నది.

"సుందరినమ్మా. రాత్రే వచ్చాను." అన్నది. నీల జాగ్రత్తగా మాట్లాడుతున్నట్లు. తల్లి ముఖంలో ఆనందం కన్పించింది.

ఒక్క అరగంట గడిచాక తల్లికి మెల్లగా ముఖం కడిగించ, హార్లిక్సు తాగించింది. జుత్తును బాగా సర్ది ముఖాన్ని తుడిచి—ఇంకెప్పుడూ విడిచి పోలేనట్లుగా తల్లిమీద ఒక చెయ్యి వేసి తృప్తిగా ఆమె ముఖంలోకి చూస్తూ కూర్చుంది.

ఎండ ఎక్కువవుతున్న కొలదీ వార్డులోని హడావుడి కూడా హెచ్చింది. డాక్టర్లూ, నర్సులూ, వచ్చేపోయే వాళ్లతో జన సంచారం మొదలయింది. కన్న కన్నాల జాబిరీ లోంచి పచ్చటి పచ్చిక బయలును చూస్తూకూర్చుంది నీల. దూరంగా భారవి ఎత్తైన విగ్రహం కన్పించింది. చేతిలో టిఫిన్ బాక్సు, బుల్లిఫ్లాస్కు ! చూస్తూండగానే దగ్గర కొచ్చాడు భారవి. ఇరువురూ చిరునవ్వుతో పలకరించు కున్నారు.

"టిఫిన్ తీసుకోకుండా వచ్చావటగా ?" అన్నాడు భారవి. పక్కనే ఉన్న లాకర్ మీద టిఫిన్ బాక్సును పెడుతూ.

"ఎవరు చెప్పారు నీకు ?"

"వదిన చెప్పిందిలే. టిఫిను తీసుకో. అప్పుడే తొమ్మి దయింది.

"ఇప్పుడెవరు తినగలరు ? అందులోనూ ఇక్కడా ? నేను తినలేను బాబూ." అన్నది నీల,

"ఏం ? సిగ్గా ?"

"పోదూ. సిగ్గూ లేదు. ఏమీ లేదు. ఇంకో గంట పోతే ఏకంగా భోజనం చేసేస్తాను."

"చేద్దువుగానిలే. ముందు తింటావా ? తినిపించ మంన్నావా ?"

ఈ మాటకు నీల మనస్సు ఉలిక్కి పడింది. భారవి ముఖంలోకి ఒకసారి చూచి, దృష్టిని మరల్చుకుంటూ, కటు వుగా అంది. ఏ మయినా సరే నేనిప్పుడు తినలేను."

భారవి ఇంకేం మాట్లాడలేదు! ఒక్క నిట్టూర్పు విడిచి లక్ష్మమ్మ దగ్గరగా వెళ్లాడు.

"అత్తా........ ! అని పిల్చాడు నెమ్మదిగా.

లక్ష్మమ్మ కళ్ళు తెరిచింది. స్టూలును దగ్గరగా లాక్కుంటూ: "ఎలా వుందత్తా నొప్పి ?" అనడిగాడు.

ప్రతి రోజూ అతడు రాగానే వేసే ప్రశ్న ఇదే. దానికి వచ్చే సమాధానం కూడా అతనికి తెలుసు. అయినా తప్పకుండా నోటివెంట ఆ ప్రశ్న రాక మానదు.

చిన్న గొంతుకతో. "అలాగేఉంది నాన్నా !" అన్నది లక్ష్మమ్మ.

ఆమెకు పొట్టలో లేచిన కురుపు లంగ్స్ దాకా వ్యాపించింది. ఒక లంగ్ పూర్తిగా చేడిపోయింది.

డాక్టర్ రాజమణి చెప్పిన మాటలు గుర్తుకు వచ్చాయతనికి—"ఇక ఎన్నాళ్లు వెయిట్ చేస్తారు ? ఆవిడకు ఏది తినాలని ఉంటే అన్నీ యిప్పుడే ఇచ్చేయటం మంచిది. ఇప్పుడూరుకొని ఆ పైన మీరు విచారించి లాభంలేదు. అమె వంటి మీద నగలు కూడా తీసివేసి కొంత రిలీఫ్ కల్పించండి.

బరువుగా నిట్టూర్చాడు భారవి. "అత్తా! ఏదైనా తింటావా ? చెప్పు తెస్తాను." అన్నాడు. ఏదీ వద్దన్నట్లు ఆమె సైగ చేస్తూ దగ్గరకు రమ్మని పిల్చింది.

"ఒక్క ఉత్తరం...ఆయనకు రాయినాన్నా....చూడాలని ఉంది...." అని చెప్పింది మెల్లగా,

తల వూపాడు భారవి. ఇప్పుడే వ్రాస్తాను."

—నర్సు వచ్చింది. లక్ష్మమ్మ వీపు మీద ఎర్రగా లేచిన బెడ్ సోర్ కు మందువ్రాసి దూది పెట్టి వెళ్ళి పోయింది.

ద్రాక్ష పళ్ళూ. పళ్ళరసం తీసుకొని ఛాయా. మామ్మా కలిసి వచ్చారు. ఛాయ భారవి వంక చిలిపిగా చూసి నవ్వుతూ "దొంగలా జారు కున్నారే, నాకు చెప్పకుండా ! వెంట పడతానని భయం వేసిందా ?" అన్నది.

"అబ్బె ఆ భయం లేదు." అన్నాడు భారవి.

ఏదో అసహజత గోచరించింది నీలకు ఆ సంభాషణలో లేచి నిలబడుతూ, "ఇక వెళ్లొస్తాను." అన్నది నీల.

భారవి కూడా లేస్తూ. ఉండు నేనుకూడా వస్తాను. ఉత్తరం రాయాలి." అన్నాడు.

ఛాయ భర్తను వారించింది. "ఉండండి మీరు. నాతో చెప్పకుండా ఇక్కడకు వచ్చేశారు. నేను రాగానే వెళ్ళి పోతా నంటున్నారు. కాసేపుంటే ఇద్దరం కలిసి వెళ్లి పోదాం."

"ఇప్పుడేం తొందరొచ్చిందిలే బావా! ఉత్తరం రాయ మని అక్కకు చెబుతాలే. మీరు నెమ్మదిగా రావచ్చు." అని నెమ్మదిగా చెప్పి, కొంగులు బుజాల నిండుగా కప్పుకొని అక్కడి నుండి వెళ్ళి పోయింది నీల.

భారవి మళ్ళీ స్టూలు మీద కూల బడ్డాడు.

## 4

వీలునామా వ్రాయడం పూర్తిచేసి, టేబిలుమీద పెట్టి పెద్ద కూతురు వ్రాసిన ఉత్తరాన్ని ఇంకోసారి చదువుకున్నారు రాఘవయ్యగారు.

—"సర్జన్లు చెబుతున్నదంతా మీకు ప్రతీరోజూ ఉత్త రాల ద్వారా తెలియపరుస్తూనే వున్నాము. అమ్మ మనకు దక్కదన్న విషయం ధ్రువమయిపోయింది. మిమ్మల్ని చూడా లని వుందంటున్నది. మీతో ఏదో మాట్లాడవలసి వున్నదట. అయినా ఈ అవసానసమయంలో మేమంతా ఇక్కడ. మీ రక్కడ వుండటం భావ్యం కాదు. ఈ ఉత్తరం చూచిన

వెంటనే బయలుదేరుతారని ఆశిస్తున్నాము. మీ రాకకు ఎదురు చూస్తాము." ఇవి ఆఖరి ముక్కలుగా వ్రాసింది భారతి. పై వుత్తరం ఆయన మనస్సును కొంచెం కదిలించినా దాని కంత ప్రాధాన్యం లేకపోయింది. "దానికెలాగా నయమవ్వదు. ఇంకా కొద్దిరోజులు పోయాక వెళ్ళవచ్చు. నాకీ మారక దశ వుండగా నే నెక్కడికి కదిలి వెళ్లగలను?" అనుకున్నారాయన.

"దానిదంతా పిచ్చి. అదలా మంచం మీద వుండటం చూసి ఆస్తంతా నే నెవరికి వ్రాసేస్తానో అని దాని భయం. పిల్లలు కూడా బహుశా దానికోసమే ఎదురు చూస్తూ వుండ వచ్చు. అంతా పోరు! ఆస్తిని అందరకూ ధారపోస్తున్నానని పోరు! హాస్పిటల్లో తొందరగా జాయిను చెయ్యలేదని పోరు! నరసమ్మతో కొంచెం చనువుగా వున్నానని పోరు! ఏది చేసినా ఇంటికేమయినా తక్కువ చేశానా ఏమయినా? అంతా దాని భ్రమ గాని—" రాఘవయ్యగారి ఆలోచనలు ఈ విధంగా సాగేయి.

"వీలునామా పూర్తిచేసి పంపిస్తే వాళ్ళకు ఆత్రుత తీరి పోతుంది. నేను వీలుచూసుకుని వస్తానని వ్రాసేస్తాను. ఇంత డబ్బూ ఖర్చయింది. కానీ ఫలితం దక్కకుండా పోతూంది" అని విచారించారు కాసేపు.

కొద్దిగా ఆలోచించి కలం, కాగితం తీసుకున్నారు. సంబోధన లేకుండా అందరికీ కలిపి వ్రాస్తున్నట్లుగా మొదలు పెట్టారు.

"—ఆశీర్వచనములు!

ఉత్తరం అందినది. విషయములు తెలిసిన తరువాత మనసుకి శాంతి అన్నది కరువయినది. నేను ఎటువంటి స్థితిలో వున్నానో ఆ భగవంతునికే తెలుసు. కదలడానికి వీలులేని పరిస్థితిలో వున్నాను. జాతకరీత్యా మారకదశ వుండటం వలన ఏ క్షణంలో ఎలా వుంటానో చెప్పలేను. గ్రహస్థితి బాగుపడగానే వీలువెంట రాగలను. ఇక రెండవ సంగతి! మీరంతా ఆస్తి విషయమై మనసులో సందేహాలు పెట్టుకోవద్దు. నా ఆస్తి మీకు కాక ఇంకెవరికిస్తాను? ఇందులో వీలునామా వ్రాసి పంపిస్తున్నాను. మీరందరూ ఇష్టపడిన తరువాత రిజిష్టరు చేయిస్తాను. ఈ విషయం మీ తల్లికి తెలియపర్చవలసింది. డబ్బు అవసరమయితే వ్రాయండి.

రాఘవయ్య—"

ఉత్తరాన్ని పూర్తిచేసి, అంతా ఒకసారి చదువుకొని సంతృప్తిపడ్డారు. కాగితాలన్నీ కవరులో పెట్టి అంటించారు. చుట్ట ముట్టించి ఆలోచనలో పడ్డారు.

ఒంటరి తనం కొంచెం కష్టంగావుంది. అన్నీ అందిచడానికీ, కబుర్లాడటానికీ, దేనికయినా ఇంటి మనిషంటూ ఎవరూలేరు. ఇటుపైన ఎవరు చేస్తారు? తన అర్జంటు పనులకు అన్నీ సిద్ధంచేసి ఇవ్వడం బాధాకరంగా వుందని మరదళ్ళిద్దరూ సణుక్కోడం కూడా ఆయన చెవిలో పడింది రెండుసార్లు. హోటలు భోజనం అంటే అసలేపడదు. ఎవరినయినా ఒక వంటావిడను చూసుకోవాలి. తన కన్ని విధాలా పనికి వచ్చేటట్లుండాలి. ఇక ఎవరినీ బ్రతిమాలుకోవలసిన అవసరం తనకువుండదు. తన సౌఖ్యంకూడా జరిగిపోతుంది.

రాఘవయ్యగారు ఈ ఆలోచనను వెంటనే అమల్లో పెట్టదల్చారు. భార్యతో గడిపిన జీవితం, ప్రస్తుతస్థితి, మున్ముందు ఎలా ఉండబోయేదీ అంతా అతని కళ్ళముందర తిరుగు తున్నట్టుంది. ఊహలన్నీ కళ్ళఎదుట చిత్రాల్లా ఆడుతూండగా చుట్టపొగ వదులుతూ కళ్ళుమూసుకున్నా రాయన.

## 5

బల్లమీద భారవి, ప్రకాశ్ కూర్చున్నారు, స్టౌ మీది నుండి కాఫీగిన్నె దింపాడు 'చింతామణి. కాఫీ కలుపుతూంది నీల. ఛాయ పళ్ళరసం పిండుతూంది. భారతి చేతిలో ఉత్తరం! అక్కడున్న వ్యక్తులందరి ముఖాల్లోనూ ఉదాసీనత బాగా వ్యక్త మవుతూంది.

భారవి నవ్వు తెచ్చుకుంటూ, "ఇకనువ్వు ఎంత నిందించినా లాభంలేదు వదినా! ఆయన స్వభావం మనకు తెలియనిదేముంది? కానీ ఇంతగా విచక్షణలేని మనిషంటే.... ........?" అన్నాడు.

భారతికి రోషావేశాలతో ముఖం ఎఱ్ఱగా కందిపోయి కళ్ళనీళ్ళుతిరుగు తున్నాయి. జీరపోయిన కంఠంతో, "కానీ... చూడు రవీ! ఇదేమిటి? అమ్మ కలవరిస్తోందని వ్రాస్తే వీలు నామా పంపుతారా ఈ మనిషి? కొంచెమయినా వివేకం అన్నది తనలో వుందంటావా? ఒక వైపు అమ్మ అలాంటి స్థితిలో వుందని మనం ఏడుస్తుంటే మన కీ సమయంలో ఆస్తి కావలసి వచ్చిందా?" అంటూ కళ్ళనీళ్ళు నింపుకుంది.

ప్రకాశ్ ఒదార్పుగా భార్యను మందలిస్తూ, "నువ్వెం దుకు బాధపడతావూ? తన భార్యను చూడాలని తనకు

లేనప్పుడు, అందుకు మనం విచారించడం అనవసరం. ఆ వీలు నామాను తిప్పిపంపేస్తే సరిపోతుంది. కదా ? వూరుకో !" అన్నాడు.

భారతి కళ్ళవెంట నిప్పులు కురిపించింది. "ఊరుకొని వీలునామా తిప్పి పంపుతాననుకుంటున్నారా ఇంకా ? చూడండి. దాన్నిప్పుడే కాల్చివెయ్యనిదే నాకు శాంతి వుండదు." అంటూ చేతిలోవున్న వీలునామాను స్టౌ కంటించి పడేసింది. ఆ మంటలో ఆ కాగితాలు కాలిమసి అయిపోడానికి నిమిషం పట్టలేదు.

"ఇప్పుడే ఘాటుగా ఒక ఉత్తరం వ్రాసేస్తాను. మీరు బయటకు వెళ్ళినప్పుడు కవర్లు కొని తీసుకురండి. ఛీ! ఎంత వ్రాసినా తనకు సిగ్గంటూ ఒకటి వస్తుందా ? అసలు అమ్మ ఈ స్థితికి రావడానికి కారణం ఎవరు ? పీకలమీదికి వచ్చేవరకూ ...ఛ...తన పరిస్థితి చెప్పుకుంటూ డొక్కొక్కసారి బ్రతిమాలుతూ ఏడ్చేదట కూడాను. "నీదంతా వేషాలు పోవే"— అంటూ హేళనగా కొట్టి పారేసేవారట. ఏదో మన పిచ్చిగానీ, అమ్మ లేకపోయినా తన కేమయినా విచార ముంటుందనుకున్నారా? ఏంచేస్తే బుద్ధి వస్తుందీమనిషికి ?" భారతి ఉద్రేకంగా ఈమాట లనేసి, వరండాలోకి వెళ్ళిపోయి, కళ్ళు తుడుచుకోసాగింది.

రాఘవయ్యగారి దగ్గరనుండి వచ్చిన ఉత్తరం, వీలు నామా ఆ గదిలోని మనుషుల తీరును ఒక్క క్షణంలో మార్చి వేసి, వాతావరణాన్ని విషమం గావించింది.

కాఫీని కప్పుల్లో పోసి, అందరి దగ్గరా పెట్టేసి, తానూ ఓ కప్పు పుచ్చుకుంది నీల.

కాఫీ త్రాగడం ముగించి ప్రకాశ్ లేచాడు.

"అలా వెళదాం వస్తారా?"

భారవి కూడా లేస్తూ, "ఎక్కడికి ?" అన్నాడు.

"సర్జన్ అయ్యంగార్ దగ్గరికి !"

"పదండి !"

"అట్టే ఆలస్యం చెయ్యక పన్నెండు లోపుగా వచ్చేయండి. ఒక్కోసారి ఒంటి గంట అవుతోంది మీరు భోజనానికి వచ్చేసరికి" అంది ఛాయ వెళుతున్న భర్తను చూసి.

"నా కోసం చూడ్డం ఎందుకూ? ఆకలయితే భోజనం చేసేయ్!" అంటూ గుమ్మం దాటి వెళ్ళిపోయాడు భారతి.

"చూశావా, నీలా ! ఎలా అంటున్నారో మీ బావ ? బొత్తిగా వేళాకోళం, వెటకారం ఎక్కువయిపోతూంది ఈ మనిషికి ?" అంటూ చెల్లెలితో చెప్పుకుంది ఛాయాసుందరి.

నీల నిశ్శబ్దంగా నవ్వుకుంది. ఈ నూతన దంపతుల కలహాలు ఆమెకు వింతగా నవ్వుపుట్టిస్తుంటాయి. మేనత్త కొడుకు కాబట్టి భారవి చనువుగా నోరు జారుస్తాడు. ఛాయకు కోపం వచ్చేస్తుంది వేగంగా —

పది గంటలు కాగానే తల్లి కోసం పళ్ళ రసం, మామ్మ కోసం కారియర్ చింతామణిచేత పట్టించుకొని హాస్పిటలుకు వెళ్ళిపోయింది నీల. బయటకు వెళ్ళిన వాళ్ళల్లో ప్రకాశ్ పదకొండుకే తిరిగి వచ్చాడు— "నాకు వడ్డించెయ్" అంటూ.

ప్లేటులో అన్నం పెడుతూ, "భారవి ఏడి ?" అని అడిగింది భారతి. వరండాలోని ఛాయ చెవులు రిక్కించుకుంది.

"తను వచ్చేసరికి చాలా సేపవుతుందన్నాడు. ఏదో ఆఫీసులో పని వుందట." అంటూ లుంగీ కట్టుకొని భోజనాని కుపక్రమించాడు ప్రకాశ్.

"సర్జన్ ఏమన్నాడు? అమ్మ ఏం చేస్తోంది?" అంటూ ఒక్కొక్కటి భర్తను అడిగి తెలుసుకుంటూంది భారతి.

భర్త రానందుకు ఒంట్లో జ్వాల పుట్టింది ఛాయకు. ముఖం కందగడ్డ చేసుకుని రెండోగదిలోనికి వెళ్లి పరుపుమీద వాలి, కన్నీటితో తలగడను తడపసాగింది. చాలా రోజుల్నుండీ భర్త ధోరణి తన కంతుపట్టడంలేదు. అంది మంచిగానో, చెడు గానో తెలియదుగానీ, మాటాడితే వెటకారం, సరసంగా వుండ వలసినచోట విరసం, వేళకు భోజనానికి రాకపోవడం!

"ఏమిటిదంతా భగవాన్! ఏమయినా పెడదార్లు.... ఛ. ఛ." అంటూ తన మనసుకి తానే ధైర్యం చెప్పుకుంది. ఆమెకు ఎంత ఆలోచించినా భారపని డతను శంకించడానికి మనసొప్పడంలేదు. తనకు తెలిసినంతమటుకు ఈయనకే దురలవాట్లూ లేవు. మరేమిటిది?" అంటూ తలను వేడెక్కించుకో సాగింది?" ఆ ఆలోచనల్లోనే నిద్ర పట్టేసిందామెకు.

భోజనానికి పిలవడానికి వచ్చిన భారతి, చెంపల మీద కన్నీటి చారికలతో నిద్రపోతున్నా చెల్లెల్ని చూసింది, రెండు మూడురోజుల్నుండీ ఇలాగే చాటుగా ఏడుస్తోంది ఛాయ. ఎందుకని అడిగితే ఏమీలేదంటుంది. మళ్ళా పైకి బాగానే మాట్లాడుకుంటారు భార్యా భర్తలు. లోపల ఏం కీచులాట లున్నాయో, ఏమో! ఎంత ప్రణయ కలహాలయితే మాత్రం

ఇంతగా ఏడిపిస్తారా ఎవరయినా? ఆఖరికి భారతి. చెల్లెల్ని లేపకుండానే వెళ్ళిపోయింది.

ఒంటి గంటయినా చలికాలపు ఎండ కాబట్టి అంత తీక్షణంగా లేదు. తల్లితో కాసేపు సంతోషాన్ని కలిగించే కబుర్లాడి, నర్సులు పాడమని బ్రతిమాలితే ఏవో రెండుపాటలు పాడి, విజయతో కలిసి హాస్పిటలు రోడ్డుమీదికి వచ్చింది నీల.

"చెబితే వినకుండా ఇంతసేపు కూర్చొన్నావు ఆకలెయ్యడంలేదుటే నీకు?" అన్నది నీల చెల్లెలి వంక చూసి.

"అమ్మ దగ్గర కూర్చుంటే కదలాలనిపించడం లేదక్కా! ఈ ఒక్కరోజే కదా వుంటాను! హాఫ్ ఇయర్లీ పరీక్షలు ఇంకెన్నాళ్లో లేవు."

"మాష్టారితో కలిసి వెళతావా? పరీక్షలు కాగానే వచ్చెయి. ఏమయినా అంతగా అయితే వైరిస్తాములే." అంది నీల.

"మాష్టారితో కలిసి వెళ్ళడం నాకిష్టం లేదక్కా." అంటూ నసిగింది విజయ.

"ఏం? ఎందుకనీ?" అంటూ నీల నవ్వింది.

"అంతా తెలిసేగా నవ్వుతున్నావు? వాళ్ళింట్లో అందరూ ఎలా వున్నారో చూశావు కదా?"

"ఎలా వున్నారు?"

"ఛో. ఏది చెప్పినా అంతే. నువ్వు చూడ్డంలేదూ? వాళ్ళమ్మ చూడు. ఆవిడ పీపు సరిగ్గా వైజాగు ప్లాట్ ఫారమంత వుంది.

"ఆవిడ వీపు నీకేం చేసిందేం ?"

"మొన్న ఆ కొళాయి దగ్గర చూసి వుంటే నువ్విలా అనవు. చెప్తాను విను. కొళాయి దగ్గర అందరి ఎదుటా స్నానం చేస్తుంది ఆవిడ. తక్కిన వాళ్ళందరూ తిట్టుకుంటూనే ఉన్నారు. నీళ్లు పట్టుకోనివ్వటం లేదని. కొందరయితే చేతులెత్తి దండం పెడుతూ మొహంమీదే అనేశారు కూడాను. ఆఖరి కూతుళ్ళిద్దరూ డబ్బాలతో నీళ్ళెత్తి ఆవిడ వీపు మీద కుమ్మరించడం ! ఎన్ని డబ్బాల నీళ్లయితే ఆ వీపు తడుస్తుంది ? అసలిక్కడికి వచ్చాక అతను మన మాష్టారని చెప్పుకునేందుకు సిగ్గు వేస్తూంది."

నీల నవ్వాపుకుంటూ. "అయితే ఇన్నాళ్ళ నుండీ నువ్విక్కడ చేస్తున్న నిర్వాకం ఇదా ?" అన్నది.

"బావుంది. నాకిదే పనా ఏమిటి ? మన గది కిటికీ దగ్గర కూర్చుంటే కింద జరిగే ఫార్సంతా కన్పించింది. అయినా ఆ చెల్లెళ్ల వేషాలు చూశావు కదూ ? ఎలా ఉన్నారో ! అలా వుండద్దని మాష్టారయినా మందలించరెందుకో !"

"మాష్టారెలా చెబుతారే ఆడ పిల్లలకు తల్లి ఉండగా ?" అని నీల అనేసిందే కానీ. లోలోపల "నిజమే" అనుకుంది.

శ్రీనివాసరావు కుటుంబాన్ని తను వచ్చిన దగ్గరనుండీ చూస్తున్నది. అతని తల్లికి తన స్థూల దేహాన్ని మోయటానికే టైమంతా సరిపోతుంది. భోజనం చేయటానికి పీటమీద కూడా వంగి కూర్చోలేనంత వెడల్పాంటి శరీరమామెది. ఆవిడ ఒక్కర్తే టేబిల్ మీల్స్ పాటిస్తుంది. పిల్లల మీద ఆప్యాయతా

వండి వడ్డించాలనే ఆత్రుతా ఆమెలో ఏ కోశానా కన్పించవు. అసలా కుటుంబంలో ఒకరి కొకరికి సమ్మంధం వున్నట్టు తోచదు.

మాతృ పుత్రికా వాత్సల్యం. సోదర సోదరీ పవిత్ర బాంధవ్యం ఎక్కడా కన్పించవా వ్యక్తుల మధ్య. బిలబిలమంటూ ఆ కూతుళ్ళంతా తల్లితో సహా ఎప్పుడూ బయట వరండాలో నించుని రోడ్డుమీద వచ్చేపోయే వాళ్లను పరిశీలించటంతో కాలం గడిచి పోతుంది. సినిమాల్లోని ఎక్స్ట్రా తీరులా వుంటుంది వాళ్ల వేషధారణ.

ఎదురుగా ఉండే డాబా యింట్లో ఎవరో కాలేజీ స్టూడెంట్లు వుంటున్నారు. కాలేజీలో నుండి రాగానే డాబా మీద ఆ మూక వేసే ఈల పాటలూ. వెకిలి సంభాషణలూ, దానికి ఈ అక్క చెల్లెళ్ళు నవ్వుకుంటూ వ్యాఖ్యానించుకొని అటువైపు చూపులు విసరడం—అదో ఫార్సు! ఇదంతా చూసికూడా తల్లి అదేమని మందలించదు. అంతా చూశాక బిడ్డల ప్రవర్తనకు తల్లేకదా ముఖ్య కారణం అనుకుంది నీల.

"బాగుందే నీలా, మీ మాష్టారింట్లో పద్ధతి." అన్నది భారతి ఒకరోజున.

"ఎవరెలా పోతే మనకేంలే అక్కా! బాగా చదువు చెబుతారు. అదేకదా కావలసింది!" అని జవాబిచ్చింది నీల.

"ఎలాగయినా కొంచెం దూరంగా వుండాలి ఇలాంటి మనుషులకు! అన్నది భారతి."

శ్రీనివాసు గురించి కూడా తాను కొన్ని చెడు విష యాలు వినకపోలేదు. అయినప్పటికీ అతని అభ్యర్థనను స్వీక

రించి, "కొంతగడు విమ్వండి." అని తప్పించుకుంది తాత్కాలి కంగా—

ఆ వేళ—తన ఆస్తుల వివరాలూ, తనకు ఎవరెవరు పిల్లని స్తామంటున్నారో—వాటి గురించి తనతండ్రితో చెబుతున్నా డతను. తాను లెక్కలు చేసుకుంటూ మౌనంగా విన్నది. ఆ మర్నాడు ఎవరూ లేని సమయంలో తన చేతికి ఒక కవరిచ్చి, అన్యథా భావించకండి. అది చదివి మీ అభిప్రాయాన్ని తెలిపితే సంతోషిస్తాను. మీ నాన్నగారికి మాత్రం చూపరు కదూ ?" అన్నాడు. తనకు చిరుకోపం వచ్చినా ఆశ్చర్యంతో పాటు, ఆఖరి మాటకు నవ్వుకూడా వచ్చింది.

ఆ నాటి సాయంత్రం స్నేహితురాలూ, ఆరవప్రాణమూ అయిన అనూరాధ రాగానే డాబామీదకి తీసికెళ్ళింది నీల.

"నీలూ ! అలా నవ్వుతున్నా వెందుకు ?"

"ఒక రహస్యం ఉంది అనూ." అంటూ కవరును అనూ రాధ చేతికిచ్చింది.

"ఏమిటిది ?" అన్నది అనూరాధ.

"మా మాష్టారిచ్చారు. చదవమని నీకిస్తున్నాను."

సంశయాకుల మయిన మనసుతోనే కవరువిప్పి ఉత్త రాన్ని చదివింది అనూరాధ.

చదవడం పూర్తిచేసి, అయోమయంగా నీల ముఖం లోకి చూస్తూ, "ఏమిటిది నీలూ ! పెళ్ళి చేసుకోమంటాడా ?" అన్నది.

"అదొక్కటేనా ?"

"లేకపోతే విషం తాగేసి......"

ఈ మాటకు గట్టిగా నవ్వేసింది నీల. చచ్చిపోతానంటాడు కదూ! అదిసరే. ఏమిటి నీ అభిప్రాయం ?"

"అతను నీ అభిప్రాయం అడిగితే నువ్వు నన్నడుగుతున్నావా ? ఇది పూర్తిగా నీసమస్య." అన్నది అనూరాధ.

నీల నిట్టూర్చింది. "ఇంకా నీ, నా అనే భేదం పోలేదు అనూ, నీ భిన్న దృష్టినెలా కరిగించడమో నాకర్థం కావటం లేదు. చివరికి మన స్నేహలతను అదొక వేరు పురుగులా తినేస్తుందేమోనని అనుమానం కలుగుతూ ఉంటుంది."

మనసులో అనురాగం పొంగిరాగా, "ఛ. అలా అనకు." అని మిత్రురాలిని వారించింది అనూరాధ. "అమ్మ ఏమీ పసికట్టలేదా ?"

"లేదు. అమ్మను ఏనాడూ మోసం చెయ్యను అనూ. నేనొక నిర్ణయానికి వచ్చాక అమ్మకు తప్పకుండా చెబుతాను."

"అతన్ని గురించి వినికిడిని విన్నావు కదా ?"

"ఊఁ........"

"మరి....... ?"

అనూరాధ వడిలో తలపెట్టుకొని పడుకుంది నీల. సాయంసంధ్యలో నీలపు ఆకాశం కింద పిట్టల్ని చూస్తూ అంది. "మంచి వాళ్ళ నెవరూ బాగుపర్చ నవసరంలేదు రాధా, బాగుపరిచే సమస్య తెగిన గాలి పటంలా తిరిగే వాళ్ల విషయంలోనే

[3]

వర్తిస్తుంది, ఏవో కారణాల వల్ల తను జులాయిలా తిరిగాడే అనుకో. అయితే అతని కుటుంబంలోని వ్యక్తులందరూ అలాంటి వాళ్ళే అయి ఉంటారంటావా? వాళ్ళు మంచి వాళ్లు కాకూడదా? అలాంటి ఇంటికి కోడలి నయితే అతన్ని పూర్తిగా మార్చి వేయ గలననే ఆత్మ విశ్వాసం నాకు కలుగుతూ ఉంది. అతని కళ్ళలో కూడా ఏదో పశ్చాత్తాపాన్నీ, నాపై ఆరాధననీ చూస్తున్నాను."

అనూరాధ మాట్లాడలేదు. నీల నుదుటిపై నాట్యమాడే నీలి ముంగురుల చిక్కును విడదీస్తూ ఊరుకుంది. కాసేపు పోయాక, "నీ ఆత్మ విశ్వాసం ఒక్కటే పనికి రాదు, నీలూ. అతనంత సులభంగా మారతాడంటావా? నీ ఆలోచనబాగు లేదని నేననను. కానీ, తొందరపడి నిర్ణయించుకోకు." అంది.

"నీ ప్రోత్సాహం నాకుంటే చాలు, రాధా! ఒకటి చెబుతాను విను. ఒక వ్యక్తికి తాను ఆశించినది లభించనప్పుడే కదా, ఆ లభించని వస్తువుకోసం ప్రాకులాడేది? అనుభవించడానికి ఐశ్వర్యం వున్నప్పుడు మనిషి దొంగ ఎలా అవుతాడు? తన అవసరాలు గడుపుకోడానికి చాలినంత ఆదాయం దొరక్కపోవడమే కదా దొంగ, దొంగగా తయారవ్వడానికి కారణం? అలాగే ఇదీఅనుకో కూడదూ?"

అనూరాధ నవ్వుతూ, "తనకి కావలసిన ప్రేమ నీ ద్వారా లభించుతున్నప్పుడు అతనింకొక దారి పట్టడంటావు? అదేగా నీ మదన?" అన్నది.

నీల తల వూపింది.

"నీ కళ్ళల్లో ఆ శక్తిలేదనను. నీ సౌందర్యానికీ, ప్రేమకూ అతను బంధితుడు కావచ్చును. కానీ నిండుజీవితం! ఆలోచించు."

"ఆలోచిస్తాను. ఇప్పుడప్పుడే తొందరపడను. కొంత టెస్ట్ చేద్దాం. ఆపై నేకదా అన్నీ ?"

"సరేకానీ. హద్దుమీరకు నీలూ! నీకునేను చెప్పేదే ముంది !" అన్నది అనూరాధ.

ఆ రోజుతో అది ముగిసి పోయింది. ఆ తరువాత తల్లికి ముంచుకురావడం, ఆ గొడవల్లో మునిగిపోయి ఇంకో విషయం పట్టించుకోక పోవడం జరిగింది.

కానీ, ఇక్కడికి వచ్చి అతని ఇంట్లోని వ్యక్తుల సంస్కారం, మనస్తత్వాలూ చూస్తూంటే తనలోని భావాలన్నీ తారుమారు అవుతున్నాయి. ఇటువంటి సంస్కారంలేని ఇంట్లో తాను యిమడ గలదా? తన స్థానానికెంత వరకూ గౌరవం లభిస్తుంది? తన భావుకత్వానికి ఎలా సరిపోతుందా యిల్లు?

కారువచ్చి పక్కన ఆగగానే నీల ఆలోచనల్లోంచి తేరుకుని తలెత్తి చూసింది.

కారులోంచి భారవి దిగి, కారాలోవున్న వ్యక్తి దగ్గర వీడ్కోలు తీసుకున్నాడు. కారు వెళ్ళిపోయింది.

"ఎవరిదా కారు బావా ?" అడిగింది నీల.

"నాస్నేహితుడొకడీ హాస్పిటల్లోనే డాక్టరుగా పని చేస్తున్నాడు—మాధవనాయర్ అని, వాళ్ళింటికి వెళ్ళి

వస్తున్నాను." అనిచెప్పి ఆమెవంక తిరిగి, "కారుడాప్ ఇచ్చినా అంతేనా నీలా ? పరధ్యానంగా నడుస్తున్నావా ?" అన్నాడు భారవి.

"లేదులే. నువ్వే డ్రైవ్ చేస్తే జాగ్రత్తగా నడిచేవాళ్ళ కయినా డాప్ ఇస్తావు. అయితే ఇప్పటిదాకా ఇంటికి వెళ్ళ లేదా ? భోజనం చేశావా ? చేసినట్టులేవులే. ముఖంవాడి పోయివుంది, అదుగో." అంది నీల మందహాసం చేసి.

"ఇల్లా ? ఇల్లేమిటి ? సంసారం ఏమిటి ? భోజనం ఏమిటి ? అంతా మిథ్య !"

"ఓహో ! బి. ఎ. లో ఫిలాసఫీ మెయిన్‌గా తీసు కున్నావా ? వేదాంతం చెప్తున్నావు."

"అవ్వా. నిజంగా వేదాంతి నయిపోయాను. ఇంకో రెండు రోజులు పోతే సన్యాసం పుచ్చుకుంటాను కూడా."

"ఛ. వూరుకో, అవేం వేళాకోళం ? మా అక్క దగ్గర అనగలవు. బాధ పడుతుంది."

"నేను సన్యాసం పుచ్చుకున్నా మీ అక్కకేమీ బాధ కలగదులే. నువ్వలా విచారించకర్లేదు."

"ఆకలెక్కువయి మాటలలా వస్తున్నాయి. ముందు ఇంటికి పద" అన్నది నీల.

ఏనాడూ లేనిది సిగరెట్ వాసన ఘాటుగా వస్తూంది భారవి దగ్గర. తనకు తెలిసినంతమట్టుకు మర్యాదకు ఫ్రెండ్స్ దగ్గర రెండు కాల్చడం తప్పిస్తే, ఇంకెప్పుడూ అలవాటు లేదని చెబుతుంది ఛాయ. ఇప్పు డిదేమిటి ?

ముగ్గురూ మౌనంగా మేడ కాంపౌండులోనికి ప్రవేశించారు. బూట్లు విప్పేసి, డ్రెస్ అయినా మార్చుకోకుండా బల్లమీద జేరబడ్డాడు భారవి. అక్కడికో పావుగంట క్రితమే నిద్ర లేచి, భర్త రాకకు ఆత్రుతగా ఎదురుచూస్తుంది ఛాయ. మూడేళ్ళ బాబును పక్కలో వేసుకొని నిద్రపోతూంది భారతి.

"అన్నం పెట్టేయ్!" కాళ్ళూ చేతులూ కడుక్కు వచ్చింది నీల. అందరికోసం వరసాగ్గా కంచాలు అమర్చింది ఛాయ.

"నేను తినను. మీరంతా భోజనం చేసేయండి" అన్నాడు భారవి. ఆ మాట చాలా సాధారణంగా వుంది. ఛాయ దిగ్గున తలెత్తి, "ఏం?" అన్నది.

"నా భోజనం అయిపోయింది."

"ఎక్కడ?"

"ఎక్కడో లెద్దూ! తిననని చెప్తున్నాగా!"

ఇక బ్రతిమాలి లాభంలేదని తెలిసింది ఛాయకు. నిరాశగా నిట్టూర్చి, తన కంచం కూడా తీసేసి, చెల్లెళ్ళకు వడ్డించ సాగింది ముభావంగా.

"ఛా. ఛా. అదేమిటి బావా! గొప్పలు చెప్పుకోకు మరి. మాకు తెలుసులే. రా ముందు!" నీల చనువును స్ఫురింప జేస్తూ పిల్చింది. భారవి కదల్లేదు.

"సర్లే. నువ్వొక్కడివీ మానేస్తే సరా? మేము కూడా వుపవాసం చేస్తాము. కొంత పుణ్యం! మాకెవరికీ వడ్డించొద్దక్కా!"

"అదేమిటీ చిన్నపిల్లల్లాగా? నేను తినకుండా వుండటం మీరెవరయినా చూశారా? తిన్నానని చెప్తే వినాలి!"

"సరే. నిన్నెవరూ బలవంతం చెయ్యడం లేదుగా? మమ్మల్ని ఒప్పించడానికి నువ్వేం ప్రయత్నించక్కర్లేదు!"

"అయితే మీరు తినడానికేం?"

"ఎవరిష్టం వాళ్ళదీ!"

భారవి కాసేపు తదేకంగా ఆమెవంక చూసి, దిగి వచ్చి, కంచం ఎదుట కూర్చుంటూ, "నువ్వు చాలా అల్లరి చేస్తున్నావు, నీలా! నీతో వేగడం కష్టంగా వుంది" అన్నాడు. అతని వాడిపోయిన పెదాలమీద హాసం లాస్యంచేస్తూ వున్నది.

నీల నవ్వేసి అన్నం కలుపుకోసాగింది. ఛాయ మనస్సులోని మేఘచ్ఛాయ మాత్రం తొలగిపోనేలేదు.

## 6

విశాఖపట్నం వచ్చిందగ్గర్నుండీ నీలను ఒంటరిగా కలుసుకోవడమే పడలేదు శ్రీనివాస్‌కు. సాయంత్రం హాస్పిటల్లో విజయ కన్పించిందొకనాడు.

విజయను చేరుకుని, "మీ అక్క ఎక్కడుంది?" అన్నాడు.

"మా అమ్మ దగ్గరుందండీ."

"మీ అమ్మగారి కెలా వుంది?"

విజయ బేలగా అంది, "అలాగే వుంది మాస్టారూ."

చూడ్డానికి రమ్మని పిలుస్తుందేమోనని చూశాడు గానీ, విజయ అలాంటి పనేమీ చెయ్యలేదు. చివరికి అతనే సాహసించి,

"పద. నీతో కూడా వస్తాను. మీ అమ్మగార్ని చూస్తాను" అన్నాడు.

"రండి!" అంటూ మాష్టార్ని వెంటబెట్టుకొని తల్లి వార్డులో ప్రవేశించింది విజయ.

తల్లి తలకు నూనె రాసి, గోళ్ళతో దువ్వుతున్న నీల, దూరంగా శ్రీనివాసరావును చూచి గబగబ చేతులు తుడుచుకుంది. "అమ్మా! మా ప్రైవేటు మాష్టారు వస్తున్నారు." తల్లి చెవిలో చెప్పింది.

దగ్గరకు వచ్చిన శ్రీనివాసరావు లక్ష్మమ్మను చూచి, "నమస్కారమండీ!" అన్నాడు.

"కూర్చో నాయనా!" లక్ష్మమ్మ గొంతుక నూతిలోంచి వినపడుతున్నట్టుంది.

స్టూలుమీద కూర్చుని, నీలవంక ఒకసారి చూచి, తిరిగీ చూపును మరల్చుకున్నాడు శ్రీనివాసరావు.

"పిల్లలు... చెప్తుంటారు... చదువు బాగా...చెబుతారని...పాసు చేయించే..."

శ్రీనివాసరావు వినయంగా లక్ష్మమ్మను వారించాడు. "మీరు మాట్లాడకండి. పాసు చేయించే బాధ్యత నాదీ. మీరు బెంగ పెట్టుకోవద్దు" అంటూ నీలవంక తిరిగి, "విజయకు పరీక్షలు ప్రారంభమవుతాయిగా! ఇక్కడే వుంటుందా?" అన్నాడు.

"మీరు రేపు వెళ్ళిపోతున్నారట కదా! విజయను మీతో కూడా తీసికెళ్ళి మా యింటిదగ్గర దిగబెట్టే పూచీ మీ మీదే పెడుతున్నాం" అన్నది నీల మెల్లిగా.

"తప్పకుండా! నువ్విక్కడే వుంటావనుకుంటాను."

"ఊఁ—ఇలాంటప్పుడు అమ్మను వదిలి రావడం కష్టం!"

"నిజమే. సరే. చెప్పినదేదీ మర్చిపోలేదు కదా!"

ఆ మాటలో ద్వంద్వార్థం స్ఫురించి తలెత్తి చూసింది నీల. శ్రీనివాసరావు కళ్ళల్లో ఏదో మెరుపు కన్పిస్తోంది. ఆదొక ఆశతో కూడిన తళుకు. చటుక్కున చూపును మరల్చుకొని, "ఎలా మర్చిపోతాను? అక్కడికి వచ్చాక అంతా అప్పజెబుతాను లెండి." అంది.

ఆ మాటతో శ్రీనివాసరావుకు కొండంత బలం వచ్చింది. లేచినుంచుని, "వస్తానండీ." అని లక్ష్మమ్మతో చెప్పి, షర్టు జేబులు తడుముకుంటూ వెళ్ళిపోయాడు. అతను వెళ్ళిపోయినా చాలా సేపటి దాకా—తలనూనే, సెంటుల ఘుమఘుమలు ఆ వార్డులో వదలనేలేదు. కానీ, ఆ వాసన భరించడం కష్టంగా వుంది నీలకు. రుమాలును గాలిలో విదిలించి విసుక్కుంది. ఇంతలో తల్లి పిల్చినట్లయి ముందుకు వంగింది.

"బాగా చదువుతావా, అమ్మా!" అన్నది లక్ష్మమ్మ.

నీల మనసులో తల్లిపై ప్రేమ పొంగింది.

"తప్పకుండానమ్మా! క్లాసు తెచ్చుకుంటాను చూడు."

"నా పుణ్యమే మిమ్మల్ని కాపాడుతుందిలే తల్లీ...... పెళ్ళిచేయలేక పోయాను." లక్ష్మమ్మ కళ్ళవెంట వేడికన్నీరు పారింది.

తల్లి కంటినీరు తుడిచి, భాష్పాలు రాలుస్తూ, "నువ్వేడవకమ్మా! నాకు పెళ్ళికితొందర లేదు. చదువు కుంటాను. నీచేతుల్తోనే మా అభివృద్ధిని పెంపొందిస్తావు." అన్నది నీల. గుండెంతా కరగి నీరవుతూంది ఆమెకు.

"అమ్మా! ఒకటడుగుతాను. అంగీకరిస్తావా?" అన్నది. తల్లి చేతిని తన ఒడిలో వుంచుకొని.

"అడగమ్మా!"

"నాకు పెళ్ళి చేసుకోవాలని లేదమ్మా! పెద్ద చదువులు చదివి, నా కాళ్ళమీద నేను నిలబడాలనుంది. వివాహం మీద కోర్కెనాలో ఏమాత్రమూ కలగడం లేదు. నువ్వు దీవించి ధైర్యమిస్తే కొండంత బలం వస్తుంది నాకు."

జలజల ప్రవహించే కన్నీటి ధారను తుడవడానికి చేతులెత్త బోయింది లక్ష్మమ్మ. కానీ, బలం చాల్లేదు. నీల, తల్లి చేతుల్తోనే కన్నీరు తుడుచుకుంది.

జీవితంలోని ఒడిదుడుకుల గురించీ, కష్ట నష్టాల గురించీ ఎంతో చెప్పాలనివుంది లక్ష్మమ్మకు—కానీ శక్తిలేదు. మొట్ట మొదట తాము చూసిన సంబంధం వాళ్ళు పెళ్ళి చూపులకు వచ్చినప్పుడు, పెళ్ళి వద్దని నీల ఎంతగా ఏడ్చి అల్లరి పెట్టిందో స్ఫురణకు వచ్చిందామెకు. నిర్లక్ష్యంగా ఉద్యోగం చేసుకునే

లేడీడాక్టర్లను చూస్తూంది. ఎవరి సంపాదనతో వాళ్లు సుఖంగా బ్రతుకుతున్నారు. ఇష్టమున్నప్పుడు తనే పెళ్ళి చేసుకుటుంది.

లోతుకుపోయి, జీవంలేని తల్లి కళ్ళల్లో ఉబికే వాత్సల్య ప్రవాహాన్ని చూచింది నీల.

"నీయిష్టం తల్లీ! దేనిలోనయినా వృద్ధిలోకి రావడమే నాకిష్టం. బాగా చదువుకో. విజ్జుని మాత్రం ఒక కంటచూడు."

తల్లి ఆశీర్వచనం లభించింది. ఈ మాటలతో నీలకు ఎందుకో ఆపుకోలేని దుఃఖం వచ్చింది. "అమ్మా!" అంటూ వెక్కి వెక్కి ఏడ్చింది.

లక్ష్మమ్మకు కూతుర్ని వారించడానికిగ్గానీ, ఓదార్చడానిగ్గానీ కోరికవున్నా శక్తిలేదు. మాటలులేని ఆమె మనసులో ఎన్నో వూహాలు తిరగసాగాయి. తన సంసారాన్ని పూర్తిగా అనుభవించకముందే, కన్న బిడ్డలయందు తన బాధ్యత నెరవేరకముందే తాను వెళ్లిపోతూంది. పెద్ద కూతుళ్లిద్దరూ పిల్లలకు అండగా వుంటారని ఒకవైపు ధైర్యం! ఉంటారో లేదోనని ఒకవైపు సంశయం! కానీ భర్తమీద ఆమెకు నమ్మకం కలగడం లేదు. పెళ్లయిననాటి నుండీ ఈనాటివరకూ—ఒక్కనాడయినా ఆమె సుఖపడి ఎరుగదు. రాఘవయ్యగారి ఐశ్వర్యంలోని ఒక్క దమ్మిడీకూడా ఆమెనేనాడూ ఆనందపర్చలేదు. అనుదినమూ జరిగే పోట్లాటలతో, భర్తనుండి ఎదురయ్యే శూలాలవంటి మాటల్తో ఆమె మనసంతా చితికిపోయింది. తెచ్చిన సంపాదన సోదరులకూ, పరులకూ, ధారపొయ్యడం, పరస్త్రీ సాంగత్యం, ఇవన్నీ చూస్తూనే సహించింది. తను ఇలా పడివుండగా కూడా రెండు మాటలు చెబుదామంటే రావడంలేదు ఆయన!

లక్ష్మమ్మ గాఢంగా నిట్టూర్చింది. నరాలన్నీ జివ్వు మన్నాయి. ఒకమాట అనాలంటే విశ్వప్రయత్నం అవుతూంది. కూతుళ్ల దైన్యవదనాలూ, తన దగ్గర వాళ్లు నటించే ధైర్యం. తన పై వాళ్లు పెట్టుకున్న ఆశలూ చూస్తుంటే–'భగవాన్ నన్నీలోకంలో ఎందుకు సృష్టించావు! సృష్టించినవాడివి నాకిన్ని బంధాలు తగిల్చి, మధ్యలో తెంచివేసి తీసుకెళ్ళిపోవడం న్యాయమా?' అని ఆమె హృదయం ఆక్రోశించింది. తన జీవన రధం ఇంకెన్నాళ్లో నడవదు. ఆమె ఆలోచనలు కాసేపు ఈ లోకంలోనూ, ఇంకో క్షణంలో పరంలోకంలోనూ తిరుగు తున్నాయి.

తన జీవితంలోని మూడువంతుల భాగాన్ని గడిపిన స్వగృహం జ్ఞాపకం వచ్చింది. తాను ఆ యింటిలో ఏవిధంగానూ సుఖపడలేకపోయింది. అత్తపోరును అనుభవించింది. కడుపు కోతను భరించింది. భర్త తాలూకు తిరస్కృతిని సహించింది. చివరికి పిల్లలవలన సుఖపడదామనుకుంది. కాని, చివరికి ఆ ఆశాలతనుకూడా నిర్దాక్షిణ్యంగా తెంచివేస్తున్నాడు భగవంతుడు. ఇన్ని కష్టాలు అనుభవించినా, ఇంకా ఆ గృహంలో గడపాలనీ, పిల్లల ముద్దుముచ్చట్లు చూడాలనీ, ఇంకా ఏదో ఏదో—'రాలిపోతున్న బ్రతుక్కి ఇంకా ఎందుకీ ఆశలు!' అన్నీ తల్చుకుంటూ వుంటే ఆమెకు కంటినీరు ధారాపాతంగా ప్రవహించసాగింది.

తను లేకపోయాక ఈ పసివాళ్లిద్దర్నీ ఎవరు చూస్తారు? ఆయనేం ఇక్కట్లు పెడతారో! అమ్మా అని ఏడ్చే ఈ పిల్లల్ని ఓదార్చడానికి తానెక్కడుంటుంది? అతి గారాబంగా పెరిగిన

పిల్లల నికమైన ఎవరు గారం చేస్తారు? వీళ్ల కష్ట సుఖాలను నెవరు చూస్తారు? ఎంత ఏడుస్తారో! ఏమని శోకిస్తారో!

అందరిలాగే తను కూడా జీవించి, బ్రతుకును కొన సాగించాలని ఆమె మనసు కొట్టుకులాడింది. తన గృహంలో గృహిణిగా మెలగాలని ఆశతో గింజుకుంది. తీరని కోరిక! ముగిసి పోతున్న బ్రతుక్కి బ్రతకాలని గాఢవాంఛ!

దుఃఖం శాంతించాక, నీల తలెత్తి తల్లి కళ్లను చూసింది. తల్లి కన్నీటిని తుడిచి మౌనంగానే ఓదార్చింది!

# 7

జట్కా దిగి లోపలకు వచ్చిన విజయను చూసి, "ఒక్క దానివేనా వచ్చావు?" అన్నారు రాఘవయ్యగారు ఆశ్చర్యంగా.

"లేదండీ. నేను తీసుకొచ్చాను. పరీక్షలు కదామరి?" శ్రీనివాసరావు లోపలికి వచ్చాడు.

"సరి. సరి. మంచిపని చేశారు. రండి మాష్టారూ! కూర్చోండి." ఆహ్వానించారు రాఘవయ్యగారు.

"ఆవిడను చూశాను. చాలా సారోఫుల్‌గా వుంది కండిషన్. పిల్లలంతా చాలా బెంగగా వున్నట్టున్నారు. మీరొకసారి వెళ్ల కూడదూ?"

"ఏమన్నారు?" అన్నారు రాఘవయ్యగారు. "నాకా? కదల లేకపోతుంటేనా! వెళతానులెండి, ఒక వారం రోజుల్లోగా వీలుచూసుకొని."

"ఆమె స్థితి ఎలావుంటుదో వారంలోగా!"

'ఇతనెక్కడో నక్షత్రకుడిలాగా తయారయ్యాడు' అని లోలోపల విసుక్కున్నాడు రాఘవయ్యగారు. కాసేపు మాటలాడి వెళిపోయాడు శ్రీనివాసరావు.

భారతి ఇచ్చిన ఉత్తరాన్నిచ్చింది విజయ. దాన్ని చదువుకోగానే రాఘవయ్యగారి కనుబొమలు ముడిపడ్డాయి. 'ఉఁహూఁ — తిరస్కారమా?' అనుకున్నారు.

కూతురి కేసిచూసి, "నేను వెళ్లలేదని అందరూ కోపంగా వున్నారా నా మీద?" అని అడిగారు.

"ఏమో! నాకు తెలియదు, నాన్నా! రోజంతా అమ్మా దగ్గరే వుండే దాన్ని."

"ఎలావుంది మీ అమ్మకు?"

జవాబుగా ఏడవటం తప్పిస్తే ఒకంతట సమాధానం ఇవ్వలేదు విజయ. కాళ్లు రెండూ పొంగిపోయాయి. వీపు మీద కురుపు లేచింది." అంత కంటే ఎక్కువ చెప్పలేక పోయింది.

"సరే. నువ్వు చిన్నాన్న గారింట్లో అన్నం తింటూ వుండు. మరి వై రెందు కిచ్చారు. అంత గాభరాగా?"

తండ్రి ఇంత ప్రశాంతంగా అడగడం విచిత్రంగా తోచింది విజయకు.

"పరీక్షలని వచ్చేశాను గాని నేనుకూడా అక్కడే వుండి పోయేదాన్ని. అమ్మను చూస్తే అలా వుంది."

సిగ్గు పడినట్లు మరి మాట్లాడలేదు రాఘవయ్యగారు. కూతురు వ్రాసిన ఉత్తరం ఆయనలో కోపాన్ని రగిల్చింది. మెత్తని మాటలతోనే తండ్రిచేసిన పనిని విమర్శిస్తూ. తీక్షణంగా వ్రాసింది భారతి.

ఎంతైనా వాతావరణం ఒకసారి కుదుట పడాలంటే తను ఒకసారి వెళ్ళిరావాలి! అలా వచ్చేప్పుడు ఒక వంటావిడను కుదుర్చుకోవచ్చు. వయసులో వున్నదాన్ని—కొంచెం ఎర్రగా వున్నదాన్ని-వితంతువును! "పోయే వాళ్ళతో మనమూ పోలేము." 'జాతస్స మరణం ధ్రువం అన్నారు. దానికి వ్రాసి పెట్టివుంది. పుణ్య స్త్రీ గానే వెళ్ళి పోతూంది. అంత మట్టుకు అదృష్టవంతురాలే! పోతే పిల్లల బాధ్యత తనకు మిగిలి పోతుంది. ఇద్దరికీ మూడు ముళ్ళు పడిపోతే సరి!

ఆ మర్నాడు మధ్యాహ్నం విజయవచ్చి, "నాక్కూడా కారియరు తెప్పించు నాన్నా!" అన్నది.

"ఏం ?"

విజయ మెల్లిగా అంది. "ఏం లేదు. నేను మనింట్లోనే తింటాను."

"సరే. నీ ఇష్టం." అన్నారు రాఘవయ్యగారు.

ఆ వేళ రాత్రి కూర్చుని నీలకు ఒక ఉత్తరం రాసింది విజయ—"ఇంట్లో ఒక్కర్తెనూ వుండలేక పోతున్నాను. ఇల్లంతా రావురు మంటూంది. అమ్మను తీసుకొని మీరంతా వచ్చేస్తే బాగుండేది, తోటలోని పూల మొక్కలన్నీ వాడి పోయాయి. ఇల్లంతా దుమ్ము పట్టపోతోంది. నాకు చాలా

బెంగగా వుంది. ఇక్కడికీ వచ్చిన మర్నాడు స్కూలుకు పోవటానికి తొందరగా తయారయ్యాను నేను. పిన్నిచేతి వంట బాగున్నా సయించడంలేదు. నాకు తొందరగా భోజనం అమర్చటానికి చాటుగా బాబాయి మీద విసుక్కుంటూంది. ఈ రోజునుండీ నా కోసం కూడా కారియర్ తెప్పించమని నాన్నగారితో చెప్పాను. మీరంతా వేగం వచ్చేయండి. నాన్నగారు మామూలుగానే వున్నారు. బావగార్లకు నా నమస్కారా లందజెయ్యి. బాబుకు ముద్దులు. జవాబు వేగం వ్రాయి. లేకపోతే బెంగగా వుంటుంది. అమ్మకు నా హృదయపూర్వక నమస్కారాలు. మాటి. మాటికీ అమ్మే జ్ఞాపకం వస్తూంది. తన శరీరంలో ఎలా వుందో వ్రాయడం మరచిపోకు. జవాబుకెదురు చూస్తాను.

నీ చెల్లి
విజయ

ఉత్తరం పూర్తిచేసి టేబిల్ లైటు వెలిగించి, చదువుకోటానికుపక్రమించింది. గోడ మీద ఎదురుగా నీల చిత్రించిన ప్రకృతి చిత్రాలు, కణ్వాశ్రమంలోని శకుంతలా మూగ పోయినట్లు కనిపించాయి.

"విజయా! పడుకున్నావా?" అని కేక వేశారు రాఘవయ్యగారు.

"లేదునాన్నా! చదువు కుంటున్నాను."

"ఒకసారిలా రా!"

పుస్తకం పక్కన పెట్టి లేచింది విజయ.

.

.

"హోటలు భోజనం ఎలా వుంది నీకు?

"బాగానే వుంది."

"ఇంట్లో తిన్నట్టు లేదు కదూ?"

"ఊఁ—"

"ఇల్లంతా బూజు పట్టినట్టుంది. ఏం?"

"............"

"చూడు. మనకి మంచి భోజన సదుపాయం, ఇంటిని చక్క దిద్దే సౌకర్యం కావాలి. ఇంటినిలా వుంచుతానా? ఒక వంట మనిషిని తెస్తానుండు. మీకు కష్టం లేకుండా చేస్తారు."

"చింతామణి వున్నాడుగా నాన్నా వంటకి? మరెవరో ఎందుకు?" అన్నది విజయ అమాయకంగా.

"ఛ ఛ. వాడి మొహం. వాడిచేత నేం పని చాతనవుతుందే! మొద్దు వెధవ. ఏదో వంటవండి పడేస్తాడు గానీ— మరి పై పనులన్నీ మీరు చూసుకుంటే చదువెలా సాగుతుంది? అందుకూ—ఒక ఆడమనిషి వుండాలి. సరే, నీకేం తెలుస్తుందిలే. వెళ్లు చదువుకో."

నిజంగానే విజయకేమీ అర్థంకాలేదు. అప్పుడే భార్య గతించినట్లు మాట్లాడారు రాఘవయ్యగారు. ఆయన వూహాలన్నీ ఈ పిల్లకేం తెలుస్తాయి?

అట్టే ఆలోచించ కుండా వచ్చి మళ్ళీ పుస్తకాలు ముందేసు కూర్చుంది విజయ.

## 8

స్టాఫ్ నర్సు వచ్చి మార్ఫియా ఇంజక్షను చేసి వెళ్ళి పోయింది.

"వెళ్ళు తల్లీ ! ఇంకెంత సేపు కూర్చుంటావు ?" అంది లక్ష్మమ్మ.

భారతీ, ఛాయా లేచారు. కొంచెం కాలు వాపు తగ్గి నట్టుందమ్మా !" తేలిగ్గా అంది భారతి.

"ఏదో లేతల్లీ ఫరవాలేదు. బాగానే వుంది. వెళ్ళమ్మా చీకటి పడింది కాబోలు."

"నేను కాసేపుండి వస్తానక్కా. అమ్మ నిద్రపోయాక వచ్చేస్తాను. మామ్మకు చలి ఎక్కువగా వున్నట్టుంది. ఆ నీలం రగ్గు పంపించేయి ఎవరి చేతనయినా." అంది నీల.

"అంతసేపు కూర్చుని ఏం చేస్తావే ? ఒక్క దానివీ రాలేవు చీకట్లో." ఛాయ అంది.

"రోజూ వస్తున్నానుగా. భయ మేమిటి ?"

"సరే." వాళ్లు వెళ్ళిపోయారు.

లక్ష్మమ్మ మగతగా కళ్లు మూసుకుంది. ఒక్క పావు గంటలో ఇంజక్షను ప్రభావం చేత ఆమె మత్తు నిదురలో మునిగిపోయింది. మామ్మ కునికిపాట్లు పడుతూ వుంది.ముసలి వాళ్లకు ఎక్కడ కూర్చున్నా నిద్రే అనుకొని నవ్వుకొంది నీల.

ఇంకో పావుగంట పోయాక వచ్చాడు భారవి. రగ్గు పాకెట్ పట్టుకొని. నీల లేచి రగ్గును విప్పి మామ్మకు ఇచ్చింది "ఇది కప్పుకో మామ్మా ! నేను వెళుతున్నాను." అంది.

"వచ్చేస్తావా ?" అన్నాడు భారవి.

"పద." అంది నీల.

ఇద్దరూ వార్డుదాటి బయటకు వచ్చారు.

"చాలా చలిగావుంది కదూ?" అన్నాడు భారవి. నీల తల మీదినుండి కొంగు కప్పుకోడం చూచి.

"ఆఁ—చిరుచలి!" అంది నీల ఒక్కొక్క అడుగు ముందుకు వేస్తూ.

ఇక మాట్లాడటాని కేమీ దొరక లేదు.

"రిక్షా మాట్లాడనా ?"

"అక్కర్లేదు. నడిచే పోదాం" అంది నీల. ఇద్దరూ ఒక్క రిక్షాలోనా అనిపించిందామెకు.

"నేను నడిచి రాగలను. నువ్వు రిక్షాలో పోవచ్చు."

"ఫరవాలేదు." అంది నీల తన భావాన్ని అతను గ్రహించాడేమోనని సిగ్గుపడుతూ.

మళ్లా కొంత దూరందాకా ఇద్దరి మధ్యా నిశ్శబ్దం అలముకుంది.

"ఏవైనా కబుర్లు చెప్పండి, నీలాసుందరి గారూ!" అన్నాడు భారవి వాతావరణాన్ని ఉల్లాసం గావించ ప్రయత్నిస్తూ.

నీల పొడిగా నవ్వింది. "కబుర్లా? నోరువిప్పితే ఏడుపు వస్తోంది, బావా. ఇలాంటప్పుడేం కబుర్లు చెప్పగలను ?"

"నిజం నీలా! పరిస్థితులేమీ బాగాలేవు. అందరిస్థితీ ఒకలాగే వుంది. నా మటుకు నాకూ అలాగే వుంది ఆంతరింగికంగా కూడా."

నీల మాట్లాడ లేదు.

"ఎందుకలా వుంది అని అడగవేం?"

"తెలిసీ అడగడమెందుకు? నాకెందుకు విచారంగా వుందో నీకూ అందుకే విచారంగా వుంటుంది. ఇక్కడున్న వాళ్ళమంతా. అంతే కదా?"

"అదో పక్కనుండగా, నాకు వ్యక్తిగత సమస్యలు చుట్టుకొని నన్ను చాలా బాధిస్తున్నాయి."

"వ్యక్తిగత సమస్యలా? ఏమున్నాయి బావా?"

"నీతో ఆంతా చెప్పుకోవాలనుంది, నీలా! చూడగానే అందర్నీ అర్థం చేసుకొని శాంతినిచ్చేటట్లు కనిపిస్తావు. నా అశాంతి కూడా నీ వల్లనే చల్లారి పోతుందని ఆశ కలుగుతూంది."

నీల గుండెలో దడ! అంత చలిలో కూడా చిరుచెమట క్రమ్మింది.

"ఇలా మాట్లాడుతూంటే వింతగా వుందా నీలా?"

తనను తాను సంబాళించుకుంది నీల. "నన్నో పెద్ద దాన్నిచేసి మాట్లాడుతున్నావు, బావా! నీ ధోరణి అంతా కొత్తగా వుంది."

"ఒక్క టడుగుతాను. సరేనంటావా?"

"ఏమిటది ?"

"అపార్థం చేసుకోవు కదూ ?"

"చేసుకోను."

"రేపొకసారి బీచికి రాగలవా ?"

నీల వులిక్కిపడింది. "నీతోనా ?"

"మొదటే చెప్పాను, అపార్థం చేసుకోవద్దని. నన్ను ఉత్తముడుగా భావిస్తేనే రా! కష్టమనిపిస్తే వద్దు. ఇక ఆ ఆశ కూడా వదులుకొంటాను." భారవి కంఠంలో అంతులేని ఆవేదన నిండుకొని వుంది.

అంతా అగమ్యంగా వుంది నీలకు. ఏదో, అదొక అర్థం కాని సమస్యలాగా కనిపిస్తూంది. భారవి గొంతుకలో తిరస్కరించలేని అభ్యర్థన, దీనపూరితమైన వేడికోలు! అంతరాల్లో ఇమిడి వున్న కరుణ పొంగిందీ సమయంలో. "సరే. వస్తాను, బావా!"

"కృతజ్ఞుణ్ని. నీకయినా నామీద జాలి వుంది. అంతవరకూ అదృష్టవంతుణ్ణనే అనుకుంటున్నాను. రేపు సాయంత్రం హాస్పిటలు నుండి అలా వెళదాం."

ఏదో భీతి నీల గుండెల్లో! బెరుకుగానూ, కొంతధైర్యంగానూ తలవూపింది. ఉత్సాహం వచ్చినట్లు భారవి చకచక అడుగులు వేశాడు. తెల్లని వెన్నెలలో వారి నీడలు, ఆ నగరపు బాటమీద కదిలి ముందుకు సాగిపోయాయి.

## 9

చంద్రుడు ఉదయించడానికి సూచనగా తూర్పు దిశ ఎఱ్ఱబడింది. వార్డుల బయటవుండే వృక్షశాఖల నడుమ నుండి

వెలుగు నీడలు వసుధపై ప్రసరింమతున్నాయి. చిరుచలి గిలిగింతలు పెడుతూంది. కాంపౌండు లోపలి బాటపైన నడుస్తున్నారు నీలా, భారవీ. తెల్లటి దుస్తుల్లో భారవి పొడుగాటి విగ్రహం గంభీరంగా కనుపిస్తూంది.

చెట్టుకింద నున్న నీలంకారును సమీపించగానే, ప్రక్కనే వున్న డ్రైవరు నమస్కారం చేశాడు.

"ఎక్కు నీలా!"

"కారెందుకు బావా!" విస్తుపోతూ అంది నీల.

"తర్వాత చెప్తాను."

నీల మాట్లాడకుండా కారెక్కింది. కాని, ఆమె మనసు పీకుతూనే వుంది, 'మోసం చెయ్యడు కదా!' అని. ఎత్తుపల్లాల రోడ్డువెంట సాగిపోయి బీచ్ దగ్గర ఆగింది కారు. హోరుమని సముద్ర ఘోష విన్పిస్తూంది. చల్లని గాలి!

ఇరువురూ కారు దిగారు.

"ఆ పక్కగా వుంచమంటారా బాబూ!" అన్నాడు డ్రైవరు వినయంగా.

"అక్కర్లేదోయ్! నీవు వెళ్ళిపోవచ్చు."

కారు జిర్రున మాయమైంది.

"భయపడుతున్నావు కదూ, నీలా!"

"లేదు, లేదు."

"నీ భయం నాకు తెలియక పోలేదు. కాని, ఏంచెయ్యను? నీవలా భయపడటం కూడా నా దురదృష్టమే

మనం నడుస్తున్నప్పు డెవరయినాచూస్తే విపరీతార్థాలు తీయ వచ్చని నా ఫ్రెండ్ కారు అడిగి తీసుకున్నాను. అంతకంటె వేరే ఉద్దేశం.......”

“లేదు బావా! నే నేమీ అపార్థం చేసుకోలేదు.” నీల సిగ్గు పడుతున్నట్లు తెలుస్తూంది. భారవి మౌనం వహించాడు.

ఇసుకలో ఇరువురి పాదాలు బరువుగా పడుతున్నాయి. సముద్రపు గాలికి చలితోడై గజగజ లాడిస్తున్నది. చేతిలో ఫుల్ హాండ్స్ స్వెట్టరు వేసుకొని కొంగు నిండుగా కప్పుకుంది నీల.

“నడవడం కష్టంగా వుంది, బావా. కాళ్లు ముందుకి సాగడం లేదు.” “అదిగో పద.”

కొంత దూరము నడిచి ఒకచోట ఆసీనులయ్యా రిద్దరూ. సంజ వెలుగులో నీల ముఖం అపూర్వ సౌందర్యంతో వెలిగి పోతుంది. సముద్రం లోంచి ఎర్రగా ఉదయిస్తున్న చంద్ర బింబం వంక చూస్తూ కూర్చున్నాడు భారవి.

ప్రసంగం ప్రారంభిస్తాడేమోనని చూడ సాగింది నీల. కానీ అతనిలో చలనం కన్పించడం లేదు.

“బావా!” మృదువుగా పిలిచింది; ఉలికి పడినట్టయి, ఇటు తిరిగి చూశాడు భారవి. అతని ముఖం చూసి, నిశ్చేష్టు రాలయింది నీల. భారవి కళ్ళల్లో నీళ్లు సుళ్లు తిరుగు తున్నాయి.

“బావా!” నీల కంఠంలో ఆర్తం ధ్వనించింది. అదేమిటి? ఏడుస్తున్నావా?”

"లేదు, నీలా" కర్చీఫ్‌తో కళ్లు తుడుచుకున్నాడు భారవి. "నా ఆవేదన పంచుకోడానికి ఇంకో వ్యక్తి ఉన్నదనుకుంటె ఆనందం కలుగుతూంది".

నీల ఏదో అనడానికి నోరు తెరిచింది గానీ, మాట పెగల్లేదు. బావ ఆవేదన తను పంచుకుంటుందా? తనకు ఎవరూ లేరా? ఛాయ??

ముఖంలోకి తేటదనం తెచ్చుకోడానికి ప్రయత్నించాడు భారవి. విషాదంగా నవ్వుతూ, "నేమ ఇలావుంటే నీకేమీ అర్థం కావడం లేదుకదూ, నీలా! కాలయాపన చెయ్యను. నాలోని దుఃఖమంతా యిప్పుడు చెప్పుకుంటాను. ఇంతకంటె మంచి సమయం దొరకదు. నాకు ఇప్పుడు నా జీవితాన్ని నీ ఎదుట పెడుతున్నాను. నీలా. నీ సలహా కోరి నిన్నిక్కడికి తెచ్చాను, నా సమస్యను నువ్వర్థం చేసుకోగలవన్న ఆశతో!" అన్నాడు.

నీలకు అయోమయం అన్పించింది. 'సమస్యా? సలహా? తాను తీర్చాలా?' గోల పెట్టింది ఆమె మనసు.

"ఎవరూ జీవితంలో ఎక్కువగా ఆశయాలు పెట్టుకొని ఆశా సౌధాలు నిర్మించ కూడ దన్పిస్తూంది, నీలా. ఎంతో ఉన్నతంగా, అందరి కంటె ఉత్కృష్టంగా ఊహించుకున్నాను. నా భావి జీవితాన్ని కానీ, నా ఆశలన్నీ ఒక్కసారి కూలిపోతాయని గానీ, ఇంతగా మోసగింపబడతానని గానీ కలలో కూడా అనుకోలేదు".

"మోసమా! ఎవరు మోసగించారు?"

"అంతా వినీ నే నొట్టి అనుమానం మనిషినని మాత్రం అనుకోవు కదూ?"

ఈ మాటలకు నీల జవాబివ్వ లేదు.

"నువ్వు నన్నర్థం చేసుకుంటావని నాకు తెలుసు. చిన్న దానివయినా వివేకవతివి. నన్ను మోసగించిందెవరో, కాదు......."

"ఎవరు?" అన్నట్టున్నాయి నీల చూపులు.

"మీ అక్క!" బరువుగా వెలువడింది మాట. అదిరి పడింది ఆమె. "మా అక్కా!" తమాయించుకుంటూ, "మోసం, మోసం అంటున్నావు. అదెలాంటి మోసం బావా?" అంది.

"మాకు పెళ్ళయి ఏడాది దాటింది. అవునా! ఇలాంటి తరుణంలో మా మనస్థితులు ఏ విధంగా వుంటాయో — అసభ్యంగా మాట్లాడుతున్నాననుకోకు- అనుభవించకపోయినా, కనీసం ఊహించు. ఇరువురి హృదయాలలోనూ, అనురాగం చిగిర్చి, ఒండొరుల జీవితాలూ పెనవేసుకొనే మధుర సమయమిది.

"ఒకరినొకరు అర్థం చేసుకొని, దాంపత్య జీవనానికి పునాదులు వేసుకొనే వేళలో- ఆ ఇద్దరిలో ఏ ఒక్కరికయినా రెండవ వ్యక్తి తనను ప్రేమించడం లేదనీ, ఆ వ్యక్తి మనసు ఇంకో వక్రమార్గాన మరలి వుందనీ తెలిసినప్పుడు ఆ మొదటి వ్యక్తికి ఎటువంటి అనుభవం కలుగుతుంది? ఎలాంటి స్థితికి లోనుకాగల స్థితి ఆ వ్యక్తికి సంభవిస్తుంది? తాను ప్రగాఢ విశ్వాసాలతో నిర్మించుకొన్న భావ సౌధాలు నేలకూలి పోతున్నప్పుడు, ఆ మనిషి ఏమవ్వాలి?...."ఉద్రేకంగా చెప్పుకు పోతున్నాడు భారవి.

భయం భయంగా సంభ్రమంగా వింటూంది నీల.

"ఆనందంగా పాడుకుంటూ, గాలిలో తేలిపోతూ నడిచే వ్యక్తికి రాయి తగిలి అకస్మాత్తుగా బోర్లాపడిపోతే ఎలా వుంటుంది? నేను అలాంటి స్థితికి లోనయ్యాను. నమ్ము, నమ్మకపో నేను సర్వస్వమనీ, నా సర్వస్వమనీ భావించిన వ్యక్తికి నేనేమీ కానని తెలియగానే నాకు సముద్రుడే శరణ్యమనిపించింది. ఎలా చెబితే నా ఆవేదన నీ కర్థమవుతుంది, నీలా? ఏ బాధ్యతలూ, చదువులూ లేకుండా పెరిగాను. నా బాధ్యతనంతా ఒక దేవత చేతుల్లో పెట్టి నేనొక ఆరాధకుడుగా, పసివాడుగా ఉందామనుకున్నాను. కాని... నా ఊహలన్నీ కల్లలయిపోయాయి నీలా! ఏం చెయ్యను? ఎలా...ఎలా..." చేతుల్లో ముఖం దాచుకొని పసివాడులా రోదించాడు భారతి.

అంతవరకు కర్ర బొమ్మలా కూర్చున్న నీల ఒక్కసారి గాఢంగా నిట్టూర్చింది. గంభీరంగా, చిలిపిగా ఉండే బావ ఏడుస్తున్నాడు. ఆ కన్నీరు తుడిచి ఓదార్చా లనిపించిం దామెకు. ఏదో ఆప్యాయత...... అంతరంగం నుండి ఉబికి వస్తూంది. "నువ్విలా పసిపిల్లాడిలా అయిపోతే ఎలా బావా?"

నీల కంఠంలో అంతులేని వాత్సల్యం! ముఖాన్ని అటు తిప్పుకొని కళ్ళు తుడుచుకున్నాడు భారవి. "లేదు. నీలా! నా స్థితి ఎవరూ తెలుసుకోలేరు. చెప్పినా అర్థం కాని అనుభవమది. నా గుండెల్లో ఎటువంటి అగ్ని పర్వతాలు రగులుతున్నాయో... ఏమని చెప్పను? దిక్కూ, తెన్నూ తోచకుండా వుంది. బయటకు వెల్లడిచేసి విడిపోదామా అనుకుంటే లాభం లేదు. రెండు గౌరవ కుటుంబాల పరువు రచ్చకెక్కు

తుంది. ఆపైన కూడా నేను సుఖపడేదేమీ ఉండదు. నాలో నేను దాచుకొని ఉండలేననిపించింది. ఇక మిగిలింది చావు. నాకు తగినదదే అనిపిస్తూంది."

"అంతగా దిగజారిపోకు, బావా! ఆవేశపడుతున్నావు!"

"ఆవేశమా? ఇది కేవలం ఆవేశంకాదు, నీలా! నా మనసుకు ఇదొక పెద్ద దెబ్బ. ఇక దీన్నుండి తేరుకోలే నేమోననిపిస్తూంది. ఏం చెయ్యమన్నావుచెప్పు?"

చంద్రుడు బాగా పైకి వచ్చాడు. ఎర్రగా జ్వలించే ఆ బింబంలోని మచ్చను చూస్తూ అంది నీల: "నువ్వు ఏ ఆధారాలతో ఈ విషయాన్ని సృష్టించుకున్నావు, బావా? ఒక దేవతను అనుమానిస్తున్నావు. నీవిలా పిచ్చిగా ప్రవర్తించడం చూసి తనెంతగా బాధపడుతుందో నీకు తెలిస్తే ఇలా వుండవు. అసలు తననుగురించి ఏ ఆధారంతో నీవీ నిర్ణయానికి వచ్చావు?

"అందుకే మొదటే చెప్పాను. నేను త్త అనుమానం మనిషిననుకోవద్దని. తన ప్రవర్తన ఎలావుండేదో చెప్పమన్నావా? నేను ఏనాడు భోజనం చెయ్యకపోయినా తనకి పట్టేదికాదు. నేనొకణ్ణి వున్నానూ అన్న విషయం, ఏ సమయంలో ఏదవసరం ఉంటుందో తనకి అక్కరలేక పోయేది. అన్నిటినీ మించి ఏకాంత సమయంలో కూడా అతి విసుగూ, నిర్లక్ష్యాన్నీ ప్రకటించేది. ఇప్పుడదంతా పునరవలోకనం చేస్తున్నాను కానీ, మొదట్లోనేనూ పట్టించుకొనే వాణ్ణికాదు. సరిపెట్టుకొనేవాణ్ణి, ఏదో చీకాకులో వుందని. కానీ, నేను చూసిన సంఘటనలో! వాటికేమంటావు?"

"నీ అనుమానానికి ఆస్కారం కనిపించడంలేదు నాకు. ఎవరా రెండో వ్యక్తి ?"

పేరు చెప్పాడు భారవి. అది వింటూనే పిడుగు దెబ్బ తిన్నవ్యక్తిలా అయిపోయింది నీల.

"నీ కాశ్చర్యంగా ఉండచ్చు. కాని నా మనసు నేను మోసగించుకోలేను. ఎంతగా సమర్థించుకుందామన్న నాకు సాధ్యం కావడంలేదు. నేను చూసిన సంఘటనలే అనుక్షణం నాకళ్ళ ముందు మెదులడుతున్నాయి. ఏం చూశానని అడక్కు. నేను చెప్పలేను నీకు. చూసింది మాత్రం యదార్థం!"

గుండెను దిటవుపర్చుకొని స్వరంలో ధృఢత్వాన్ని తెచ్చుకుంది నీల.

"నువ్వెంత చెప్పినా నాకు నమ్మకం కలుగడంలేదు. ఇద్దరం ఒకే రక్తం పంచుకొని పుట్టాం. తనతో ఒక్క ఏడాది అనుభవం నీకు! కానీ బుద్ధెరిగిన నాటినుండి తనను తెలిసి వున్న దాన్ని నేను. ఆమె మనస్తత్వం నీకంటే నాకుబాగా తెలుసునని చెప్పుకోడానికి నాకు సంశయం ఏమీలేదు..."

మధ్యలో ఆపుతూ, "కావచ్చు. కాదనను. కానీ మన అనుభవాల్లో తేడావుంది. నీ పదిహేడేళ్ళ అనుభవంలో నీ వెంత తెలుసుకోగలిగావో, ఒక్క ఏడాది అనుభవంతో నేనంత తెలుసుకోగలిగాను. అంతకంటే ఎక్కువేనేమో చెప్పుకోవా లంటే! తనను నేనర్థం చేసుకున్నంత బాగా ఏవరూ అర్థం చేసుకోలేదేమో !" అన్నాడు భారవి.

"మరి ఇదేమిటి ?"

"అదేనాకూ అర్థం కాకుండా వుంది.

అంత విషమ సమయంలో కూడా నీలకు నవ్వు వచ్చింది. ఇదేనా నువ్వు తెలుసుకున్నదంతా ?" అడిగింది నవ్వుతూ.

భారవి సిగ్గుపడ్డాడు. "నువ్వు నన్నొక పిచ్చివాడికింద జమకట్టెస్తున్నావు నీలా! నేను తెలుసుకున్న దాంట్లో పొరపాటేమీ లేదు. తనేదో క్షణికావేశానికి లొంగిపోయి ఉండవచ్చు. లేకపోతే చిన్నప్పటి నుండి ఉన్న చదువు తన నావిధంగా ప్రోత్సహించిందో! నా జీవన సర్వస్వం తనే అని నమ్ముతున్నాను కాబట్టే, ఇంత వరకూ చచ్చిపోకుండా బ్రతికి వున్నానని పిస్తూంది.

ఇప్పటి క్కూడ నేను తనను ప్రేమించడం లేదని చెప్పలేను. ఈ క్షణం దాకా నా హృదయంలో తనపై ప్రేమ చెరిగిపోవడం లేదు. కాని జరిగింది తలుచుకుంటూ వుంటే ఎవరో కత్తిపెట్టి నన్ను ముక్కలుగా నరుకుతూన్నట్టు బాధ కలుగుతూంది. ఒక వ్యక్తిత్వం అన్నది నాకూ ఉంది. నన్ను ప్రేమిస్తూ, గౌరవిస్తూ ఇంత మోసం ఎందుకు చెయ్యాలి? అదంతా నటనేనా? నాలో తనకేం లోపం కన్పించింది?"

మధ్యలో అడ్డుకుంటూ "నేనొకటి చెబుతాను బావా? అన్నది నీల. "మా అక్కకి ఎవరిమీదయినా అభిమానంగాని, గౌరవంగాని ఉందంటే దాన్ని మనసులో గుంభనగా దాచుకో లేదు. తన మనోగతాభిప్రాయాన్ని చేతుల్లో బాగా వ్యక్త పరుస్తుంది. ద్వేషమయినా, కోపమయినా అంతే. అలాంటి చనువునూ, గౌరవాన్నీ చూచి నువ్వపార్థం చేసుకున్నా వేమో? కొంచెం నిదానించడం మంచిది."

"నేనూ మొదట నీలాగే అనుకున్నాను. లాభంలేదు, నీలా. నీ తోడబుట్టిన సహోదరి కాబట్టి నీకలా అన్పించవచ్చు. కానీ—నన్ను నేను వంచించుకోలేను...కర్తవ్యం మాత్రం తోచకుండా వుంది".

"ఛీ. ఒక పవిత్ర వ్యక్తికి ఎలాంటి కళంకాన్ని ఆపాదిస్తున్నావు బావా! తన స్వంత చెల్లిలినయిన నన్నిలా కూర్చోబెట్టి కబుర్లు చెబుతుంటే, ఈ సమయంలో దూరంనుండి చూసినవాళ్లేమనుకోవాలి? నీకు ఇలాంటప్పుడు ఎలాంటి మచ్చను కలిగించినా నువ్వుఅంగీకరిస్తావా? అంత సంకుచితంగా ఏనాడూ ఉండకూడదు. మనుషుల నర్థంచేసుకోడానికి ప్రయత్నించు."

ఒక్కసారి వచ్చిన విసురుకు భారవి దిగ్భ్రాంతుడై నీల వంక చూస్తూ ఉండిపోయాడు.

నీల తన కంఠస్వరాన్ని తగ్గించుకుంటూ, "ఇది బొమ్మలాటకాదు బావా! జీవితసమస్య! నూరేళ్ళ పంటగానీ క్షణంలో ముగిసిపోయేదికాదు. లేనిపోని శంకలు పెట్టుకొని బ్రతుకును నరకంచేసుకోవడం అవివేకమనిపిస్తుంది!" అంది.

భారవి నిట్టూర్చాడు. "నిజమే, నీలా! నువ్వేకాదు. ఎవరితో నాకథ చెప్పుకున్నా అలాగే అనుకుంటారు. తన చెల్లెలివనిగాని, నా మరదలివనిగాని నిన్ను భావించడంలేదు నేను. ఒక స్నేహితురాలిగా చూసుకున్నాను. కాబట్టే ఎవరితోనూ, చెప్పుకోలేక, నామాటల్నర్థం చేసుకుంటావనీ కర్తవ్యాన్నుపదేశిస్తావనీ నిన్ను నమ్ముకున్నాను. సముద్రంలో మునిగిపోతున్నవాడికి చేయూతనిచ్చి ఒడ్డుకు చేరుస్తావను

కున్నాను. గాని నేను నిన్ను తప్పుగా అర్థంచేసుకున్నానేమో! నువ్వుకూడా నన్నే నిందిస్తున్నావు. సరే ఇక ఏమీ చెప్పి ప్రయోజనంలేదు. మనసుకేదితోస్తే అదే చేస్తాను. ఇప్పుడు నేను చెప్పినదంతా మర్చిపో ఉభయులకూ మంచిది."

తన అహం దెబ్బతిన్నట్లనిపించింది నీలకు. "పనికిరాని ఊహలతో కాలక్షేపం చేస్తున్నావు. నీకు నా మాటలు ఎలా చెవికెక్కుతాయి? ఇప్పుడు నీ సంతృప్తికోసం నీతో నే నేకీభవించినా, నా మనసులోమాత్రం ఆ దేవత నేనేనాడూ శంకించలేను. ఇక....సలహా కోరావుకదూ? నీకంటే చాలా చిన్నదాన్ని, నేను నీకేం సలహా ఇవ్వగలుగుతాను? అయినా నాకు తోచింది చెప్తున్నాను..."

ఒక వింత వస్తువును చూస్తున్నట్టు వింతగా నీలవంక చూస్తూ వింటున్నాడు భారవి.

"తాత్కాలికంగా మా అక్క ఇప్పుడు నిన్ను నిర్లక్ష్యం చేసినా, అది ఎంతోకాలం నిలువదు. వైవాహికబంధం సులువుగా తెంపుకోవాలంటే తెంచుకోలేనిది, బావా! ఏదో అనుభవరహితురాలిగా చెబుతున్నాననిగాని నీకు తెలియదా? మీ ఇద్దరిలో ఏ ఒక్కరు పొరపాటుచేసినా, పెడదారిపట్టినా. క్షమించి సక్రమ మార్గాన మళ్ళించుకోగల శక్తి మీకుండాలి. కానీ ఒక్క వాగ్దానం కోరుతున్నాను...ఇవ్వగలవా?"

"నీవు నా నుండి కోరుకునే వాగ్దానమేముంటుంది? ఇవ్వగలిగినదయితే తప్పకుండా...."

"లౌక్యుడివికదూ, బావా! లేకపోతే నన్నింత దూరం తీసుకురా గలిగేవాడివా? సరే, నాకు కావలసింది కోరు

కున్నాను. ఏ పరిస్థితుల్లోనూ మా అక్కను నొప్పించవద్దు. నీవు తనపై ఇలాంటి అనుమానం పెట్టుకున్నావని తెలిస్తే, తనేమవుతుందో చెప్పడం కష్టం. అంతా మరిచిపోయి ఆనందంగా గడపండి. ఇంతకంటే నేనేం చెప్పగలను. అందరికీ దూరంగా పోతే పరిస్థితులు వాటంతటవే చక్కబడతాయి.

"కృతజ్ఞుణ్ణి, సాధ్యమైనంత వరకూ జీవితాన్ని పూలబాట చేసుకోడానికే ప్రయత్నిస్తాను. కాని ఈ వెలితి నా మనసులో ఉండిపోతుంది...."

"అదిగో మళ్లీ......"

"అదికాదు. మనసు నెవరు అదుపులో పెట్టుకోగలరు? నాలో ఆవేదనను ఎవరితో పంచుకోను? వేదనాగ్ని రగిలినప్పుడెల్లా దాన్ని మనసులో దాచుకోలేకా, పైకి చెప్పలేకా, పిచ్చిగా ప్రవర్తిస్తే అందుకు నేను బాధ్యుణ్ణి కాను. ఆలోచనలను భరించ లేనపుడు దాదాపు పిచ్చివాణ్ణయిపోతాను. ఈ లోకం, మనుషులూ ఎవరూ కన్పించరు...ఆ సమయంలో— చల్లని సన్నిధి కోసం పరితపిస్తాను. అలాంటప్పుడు..."

నీల అటు ముఖం తిప్పుకొని చిన్నగా నవ్వుకుంటూ "చల్లని సన్నిధి అంటున్నావు? భర్తకు భార్యకంటె ఇంకెవరు చల్లదనాన్ని కన్పించగలరు? అంతగా నీ ఆవేదనను చెప్పుకోవాలనిపిస్తే చెట్టులూ...పుట్టలూ..." అంది.

"అదేం? నువ్వున్నావుగా? నీతోనే చెప్పుకుంటాను. ఆ మాత్రం వినలేవూ? ఇంకా నీకేమీ తెలియదు, నీలా! నే నెవరో తెలియగల రోజు ఎప్పుడో వస్తుంది."

•

•

"వచ్చినా, రాకపోయినా ఇప్పుడు వచ్చేది గాని పోయేది గాని ఏమీ ఉండదుగా! ఇక అదే పనిగా మనసును పాడుచేసుకోకు బావా!" అంది నీల లేచి నిలుచుంటూ.

"నేకొక దారితప్పిన బాటసారిని, నీలా! నీవు చూపిన దారివెంట నడిచిపోవా లనుకుంటున్నాను. ఏనాడయినా ముళ్ళడొంకలలో ఇరుక్కుంటే, వచ్చి ఆదుకుంటావని ఆశించ వచ్చునా? భారవి లేచి దుస్తుల కంటుకున్న ఇసుకను దులుపు కుంటూ అన్నాడు.

"దాన్ని చాలా దురాశ అంటాను నేను. కవిత్వం చెప్తున్నావు. నీలాంటి వ్యక్తిపరుల ఆశ్రయాన్ని ఆశించడం అనవసరం. దిక్కులేని బాటసారివి కాదుగదా!"

"అది దురాశే అను. అసమంజసమే అను. నీవు ఆ ఒక్క అభయం నాకు ఇవ్వగలిగితే నాకు సంతృప్తి వుంటుంది."

"సరే. సరేఅంటే పోయేదేముంది? నేను నీకిస్తూన్న మాటను నిలబెట్టుకోవడం నీచేతిలో వుంది.

"అదేం?"

నువ్వు నాకిచ్చిన మాటను నిలుపుకుంటె సరి."— పెదవులలో దివ్యహాసాన్ని మెరిపిస్తూంది. నీల.

"మాటల్లోపడి చాలాసేపుండి పోయాం బావా! టైమెంతయింది."

"ఏడు"—వాచీ చూసుకూంటూ అన్నడు భారవి.

నీలకు చైతన్యం వచ్చినట్లయింది. "అమ్మె దగ్గిరికి వెళ్లాలి! ఈ గంటకే తనని విడిచి ఏన్నోయుగాలయినట్లని

పిస్తూంది. నన్ను వేగం రిక్షా ఎక్కించేయి బావా! ఒక్క దాన్నీ వెళ్ళిపోగలను.” నీల ఆత్రుతగా అంది.

రోడ్డు పైకి వచ్చాక రిక్షాను పిలిచాడు భారవి. రిక్షాలో ఎక్కిన నీల కనుమరుగయ్యే వరకూ చూచి. గాఢ మయిన నిట్టూర్పు విడిచాడు. ఏదో ఒక పెద్ద బరువును తొలగించుకున్నట్టుంది అతని హృదయానికి ఇంకేదో బరువైన భావం ఆక్రమించుకున్నట్టు కూడావుంది.

## 10

వారం రోజుల్లో విజయ పరీక్షలయి పోయాయి. కార్తీక మాసం వెళ్ళిపోయింది. రాబోయే సంక్రాంతి లక్ష్మికి సుస్వాగతం అన్నట్లుగా, కన్నె పిల్లలందరూ ఇండ్లముంగిట రంగ వల్లులను తీర్చి దిద్దుతున్నారు. విజయకు ముగ్గులు బాగా రావు. అయినా సరే పని మనిషి చేత కలాపి వేయించి ఏదో పిచ్చి గీతలు రెండు పెట్టింది. అయినా ఏమి శోభ వుంది వాటిల్లో? ఇల్లూ, వాకిలీ కళావిహీనంగా కన్పిస్తున్నాయి. ఏదో అసంతృప్తి వృథా గుండెల్ని దొల్చుతుండగా ఇంట్లోకి వచ్చింది విజయ.

“ఈ వేళ విశాఖపట్నం వెళదాం, అమ్మా! బట్టలూ, అవీ సర్దుకో” అన్నారు రాఘవయ్యగారు.

తల్లిని చూడ బోతున్న ఆనందం తొణికిస లాడింది విజయ ముఖంలో. వెళదాం అన్నారేగాని, వైజాగు నుండి ఉత్తరం వచ్చినట్టుగానీ, పరిస్థితి ఇలా వుందనిగానీ, ఏమీ చెప్ప లేదాయన కూతురుతో.

కానీ, ప్రప్రథమంగా ఏదో భీతి కలిగిందాయనలో. నేరం చేసిన వాడికి, తాను పట్టుబడే ముందు కలిగే భయం లాంటిది అది. న్యాయస్థానంలో జడ్జీముందు తల వంచుకొని నిల్చుండే ముద్దాయి మనసులోని వైకల్యం ఆయన హృదయాన్ని ఆక్రమించుకో సాగింది.

ప్రకాష్ నుండి వచ్చిన ఉత్తరం, టెలిగ్రాం లాగా నాలుగే నాలుగు పంక్తులు వ్రాసి ఉన్నా, దానిలోని తాత్పర్యం మాత్రం భయంకరమైనది.

—"ఆమె పూర్తిగా బాహ్య స్మృతిని కోల్పోయింది. సంధి పుట్టింది. ఇక రెండు రోజులే వ్యవధి అని సర్జన్ -య్యంగార్ చెప్పారు. వెంటనే బయలుదేరి వస్తే ఆమెను చూడగలుగుతారు."

అంతేగాని ప్రాధేయ పూర్వకమైన వేడికోలు గానీ, ఆజ్ఞాపనగానీ లేదందులో. ఆ నాలుగు పంక్తుల్లోనూ అజ్ఞాతంగా ఇమిడి ఉన్నట్లు ఏదో ఏహ్యతా. తనకు ఆ ప్తవర్గం నుండి దూరంచేస్తున్న భావం వ్యక్తం కాసాగింది.

హాస్పిటల్లో బెడ్ మీద నుండి భార్య సంధిలో ఏవో అర్థంకాని మాటలంటున్నట్లు ఊహించు కున్నాడు. "నాకు ఎదుట పడినా దూషించే స్థితి దాటి పోయింది. తనను చూచి అసహ్యించు కోటానికి కాని, నిందించడానికిగాని, బలమూ లేదు. ఆ స్థితే కాదు" అనుకున్నారు రాఘవయ్యగారు. ఒక బోను లోంచి తప్పించు కున్నట్టు అనిపించింది. కానీ, కానీ, అలా తలచు కుంటేనే ఏదో అసంతృప్తిగా ఉందేమిటి? తను చేసిన ద్రోహాన్నంతటినీ బయట పెట్టి, కసిదీరా నిందించినా తన

కొంత సంతృప్తిగా ఉండేదేమో! అలా ఒక్కనాడూ తాను భార్యనుండి దూషణల నెదుర్కొనలేదు. అయినా దానికేం అన్యాయం జరిగింది? దాని అభీష్టాన్నీ తాను నెరవేర్చలేదూ? ఇంత డబ్బుపోసి చికిత్స చేయించడం లేదూ? నేనేం పాపం చెయ్యలేదు. అంటూ మనసును సమాధాన పర్చుకోబోయారు రాఘవయ్యగారు. కానీ. ఖాళీగా, వెలితిగా మనసులో జాగా మిగిలిపోయిందనే భావన బలంగా కలుగుతూంది.

అల్ల. కల్లోలమైన మనసుతోనే విజయను తీసుకొని రైలెక్కారు రాఘవయ్యగారు.

"ఆ బేసిన్‌ని ఇలా ఇవ్వండమ్మా! నేను వెళ్లి వేడినీరు తీసుకు వస్తాను." అంది ఆయా. భారతి వణికే చేతులతో బేసిన్‌ను మరియా చేతికి అందిచ్చింది. ఆ వేళ లక్ష్మమ్మగారికి స్పాంజ్ బాత్ చేయించమని డాక్టర్ రాజమణి చెప్పింది. బాగులోంచి మెత్తని టవల్ తీసి పైన పెట్టింది నీల. చాలా రోజులనుండి నిద్రాహారాలు సరిగ్గా లేని అక్కచెల్లెళ్ళిద్దరి మొఖాలూ నీరసించి వాడిపోయి వున్నాయి. దానికితోడు తల్లికి సంధి పుట్టినప్పటినుండి వారికి దేహంమీద చైతన్యమే నశించినట్టనిపించింది. ముఖాలు నిస్తేజంగా వున్నాయి.

నర్సు వచ్చింది ఔన్సు గ్లాసులో మందు పట్టుకొని. "లక్ష్మమ్మగారూ! నోరు తెరవండి!"

ఎక్కడో లోతుగా వున్న కళ్లను విప్పి నర్సువంక తీక్షణంగా చూసింది లక్ష్మమ్మ. దగ్గరకు రమ్మని సైగ చేసింది. నర్సు ఆమెను సమీపించగానే, రహస్యంగా గుసగుస లాడుతున్నట్లు "అవి మన భావిలోని నీళ్లేకదూ?" అంది.

అక్కచెల్లెళ్ళిద్దరి కళ్ళ వెంట బొటబొట నీటి బొట్లు రాలాయి. నర్సు వంక చూసి అవును అనమన్నట్లుసైగ చేసింది నీల. నర్సు అర్థంచేసుకొని, "అవునమ్మా మన భావిలోని నీరే." అంది.

"అయితే సరే. తాగుతాను ఇయ్యి! అని పసిపిల్లలా నోరు తెరిచిందామె.

మందునీళ్ళు నోట్లో పడగానే, దాన్ని తుపుక్కున పడకమీద ఉమ్మేస్తూ, ఎక్కడ లేని బలంతో నర్సును పక్కకు తోసేసింది లక్ష్మమ్మ.

తల్లి దగ్గరకు వచ్చారు కుమార్తె లిద్దరూ.

"క్షమించండి, సిస్టర్!" నీల నెమ్మదిగా అంది.

"మీరు బాధ పడకండి. మా కిలాంటి అనుభవాలెన్నో తటస్థ పడుతూ వుంటాయి. పోతే ఆవిడకు ఇంటిమీద ధ్యానం ఎక్కువగా ఉన్నట్టుంది." తీసికెళ్ళిపోకూడదూ? అంది నర్సు.

"ఆఖరి క్షణం వరకూ చూద్దామనే ఆశ మాలో మిగిలి పోయింది. అంత కంటే.......మరేం లేదు." రుద్ధ కంఠాన్ని అణుచుకోటానికి ప్రయత్నిస్తూ నీల ముఖాన్ని అటు తిప్పుకుంది. ఇంకేమయినా ప్రశ్నిస్తే ఆమెలోని దుఃఖం వెలికి రావచ్చని భయపడి, నర్సు మరేమీ మాట్లాడకుండా అక్కడి నుండి వెళ్ళిపోయింది.

"ఉమ్మేశావెందు కమ్మా?" కన్నీరు కారుస్తూ తల్లి నోటిని కొంగుతో తుడుస్తూ అడిగింది భారతి.

"నువ్వెవరు! ఫో ముందిక్కణ్ణించి. ఊఁ వెళ్ళిపో! లక్ష్మమ్మ భారతిని నెట్టివెయ్యడాన్కి ప్రయత్నించింది. భారతి కదల్లేదు.

"హుఁ—నన్ను పిచ్చిదాన్ని చేస్తారు కదూ మీరు! నాకు తెలుసు. మన భావిలోని నీళ్ళు తెచ్చియ్యి. లేకపోతే ఫో" ముఖం అటు తిప్పుకొని ఈ లోకంలో ఏదీ తనకక్కర్లేద న్నట్టు నిరాశగా, నిర్వేదంగా నిట్టూర్చి పడుకుంది.

ఇంతలో ఆయా వేడి నీరు తీసుకువచ్చింది. తల్లిచేసే అల్లరి నంతా భరిస్తూ, ఆయా సహాయంతో మెల్లిగా లక్ష్మమ్మ ఒళ్ళంతా తడి గుడ్డతో తుడిచి. శుభ్రమైన దుస్తులు కట్ట బెట్టింది భారతి. ఈ పనంతా జరగటానికి సుమారు అరగంట పట్టింది.

లక్ష్మమ్మ ఏదో మాట్లాడుతూంది. "విజ్జూ ఎదీ?"

"నేనేనమ్మా!" చేసేది లేక అన్నది భారతి

"ఇలారా. మీ నాన్నగారికి వడ్డించేశానని చెప్పవే. ఆ తర్వాత కోర్టుకాలస్య మయిపోయిందంటారు."

ఇంకో క్షణంలో ఇంకో ధ్యాస.

"విజ్జూ నీలకు సాయం చెయ్యమ్మా కొంచెం. నీకూ ఆక లేస్తుందా?"

స్మారకం లేని స్థితిలో పూర్వ స్మృతులు. కూతుళ్ళిద్దరూ తల్లి మాటలు వింటూ, కన్నీరు మున్నీరుగా విలపించడం తప్పిస్తే ఇంకేం చెయ్యలేక పోయారు.

"అమ్మా! ఇలారా."

భారతి ముందుకు వంగింది.

"మన పెరట్లో తెల్ల దోసకాయలు కాస్తున్నాయా? ఎవరూ చూడకుండా నాకోటి తెచ్చిపెడతావా? చిన్న ముక్క తెచ్చియ్యి తినాలని ఉంది."

ఏమిటిది? పిచ్చిగా కలవరిస్తూందని తోసి పారే యాలా? చీర చెరుగులో ముఖాన్ని దాచుకొని నిశ్శబ్దంగా ఏడ్చింది భారతి. ఏనాడూ కనీసం చాటుగానయినా తినేది కాదు తల్లి అందరి భోజనాలూ అయ్యాక తిన్న తిండేమో! అంతే అలాంటి గంభీర గృహలక్ష్మి ఈ నాడు పసిపిల్లా?

"అమ్మా? మీ నాన్నగారేరీ? వచ్చారా?"

"వచ్చారమ్మా! జవాబిచ్చింది నీల"

"ఏరీ? ఎక్కడ కూర్చున్నారు?"

"అదుగో వస్తున్నారు."

"లేదు, లేదు. మీ నాన్నను మీరు దాచేశారెక్కడో. పోనీ, పోనీ."

అంత దుఃఖంలోనూ తండ్రిపై అంతరాల్లో ద్వేషం జనించింది నీలకు. "అక్కా ఉత్తరం వ్రాశావా?" అంది భారతి వంక తిరిగి.

"నేను రాయలేదే. మీ బావగారు వ్రాశారు. పోనీ లెద్దూ. మంచి మనిషికో మాట! భార్యా పిల్లలూ అనే మమత లేకపోయనా, తనలో మానవత్వం అన్నది ఏ కోశా న్నయినా మిగిలివుంటే వస్తారు. లేకపోతే లేదు. అందుకు మనం విచారించ నవసరం లేదు. ఇంతకంటే ఎక్కువ ఎవరూ

ప్రాకు లాడరు. ఒకరు చెప్పాలా ఏమిటి? పరాయి మనిషి కాదుగా?"

పడక బట్ట మడిచి సంచిలో వేసుకొని, "వెళ్తానమ్మా!" అని వెళ్ళి పోయింది ఆయా.

లక్ష్మమ్మగారి వాగ్ధోరణికి అంతులేదు. మాట్లాడితే అదే పనిగా చావుకు సంబంధించినవీ, గతానికి సంబంధించినవీ ఏవో మాట్లాడుతుంది. లేకపోతే విరాగిని లాగా అలిగినట్లుగా పెడమొగం పెట్టుకొని పడుకుంటుంది. ఇక ఉంచితే లాభం లేదనీ, మర్నాడు ఇంటికి తీసుకు పోవచ్చనీ డిస్చార్జి కార్డు కూడా ఇచ్చేశారు డాక్టరుగారు.

ఆవార్డును తమ స్వగృహం గానూ, ఆమె పడుకున్న మంచం తమ ఇంట్లోదిగానూ తల్లిని నమ్మించడానికీ విశ్వప్రయత్నం చెయ్యవలసి వచ్చింది కుమార్తెలకు, పోనీ ఇంటికి తీసికెళ్ళి పోదామనుకున్నా, అదృష్టం బాగుండి ఇంకెవ్వరయినా బాగు చెయ్యకూడదా అని వెర్రి ఆశ! ప్రయత్నించ లేక పోయామే అని చివరికి విచారించ వలసి వస్తుందని అదొక భావన! ఆ మమతకూ, ఆశకూ అంతులేదు. అన్నీ తెలిసీ కూడా వెర్రి ఆశలు పెట్టుకొని, ప్రాణాలయినా అర్పించి మొండి పట్టుదల అందరిలోనూ ఉంది, ఆమె మరి దక్కదని తెలిసి కూడా! ఇంతగా ఇంటిని గూర్చి కలవరిస్తున్నా, తల్లిని స్వగృహానికి తీసుకు రాకపోవడానకి కారణం ఇదే! స్మృహ ఉండే రోజుల్లో లక్ష్మమ్మగారే నాడూ చెప్పలేదు, తమ ఇంటోనే తన ప్రాణం పోవాలని.

ఆమె హృదయంలో ఏమి భావ పరంపర దాగి వుందో కాని, పైకి చెప్పుకొనే అవకాశాన్ని మాత్రం దేవుడు ఆమెకు ఇవ్వలేదు. చివరి క్షణాల్లో ఆమెలోని చైతన్యాన్నంతటినీ లాక్కొని, మొండి బలాన్నీ, చలించిన మతినీ మాత్రం ప్రసాదించి ఊరుకున్నాడు.

అప్పుడే ప్రకాష్ వచ్చాడు, సర్జన్ నుండి. ప్రార్థించీ, ప్రార్థించీ అతడు సర్జన్ నుండి స్వీకరించిన విషయమేదో అతని ముఖం చూస్తూనే తెలుస్తూనే వుంది.

"ఏమన్నాడు?" భారతి భర్తను ప్రశ్నించింది.

"తాను వచ్చి చెయ్యగలిగిందేమీ లేదన్నాడు. రేపు తీసి కెళ్ళిపోవడమే."

"భారవి ఏడి?"

"డాక్టర్ మాధవ నాయర్ ను కలుసుకోవడాన్కి వెళ్ళాడు. వస్తూండా లీపాటికి!"

భారతి కాస్సేపు ఊరుకొని అంది. "మీ రొకసారి మార్కెట్టుకు వెళ్ళిరావాలి."

"ఎందుకూ?"

"తెల్లని దోసకాయలు దొరుకుతాయేమో! అమ్మకి అవి చాలా ఇష్టం. తినాలని ఉందంటూంది."

"నీదంతా పిచ్చి భారతీ! ఆమె తినగలిగే స్థితిలో లేదు."

"తను అడిగే పద్ధతి చూస్తే మీరిలా అనలేరు. తను తినగలదు. తీసుకురండి."

"సరే" నిట్టూర్చాడు ప్రకాష్ నేను వెళ్ళనవసరం లేదు. ప్యూను వున్నాడు. పంపించివస్తాను." అని అక్కడినుండి కదిలాడు.

అరగంటలో భారవి మాధవనాయర్ రావడమూ ప్యూను దోసకాయలు తీసుకురావడమూ ఒక్కసారే జరిగాయి. నాయర్ బాగా పరీక్షించాడు లక్ష్మమ్మను. అతని ముఖం చాలా గంభీరంగా వుంది.

"ప్రయత్నిస్తాను, రవీ! పేషెంటుకోసం మంచి రూము ఒకటి సెపరేట్‌గా ఏర్పాటు చెయ్యి. రేపేకదూ డిశ్చార్జి చేస్తారన్నావూ?"

భారవి తల ఊపాడు. తరువాత ఇద్దరు వెళ్ళిపోయారు.

దోసకాయల్ని చాకుతో చిన్న ముక్కలుగాకోసి తల్లికి అందిచ్చింది భారతి. ఆదృశ్యం గుండెల్ని కరిగించేటట్టు ఉంది. ఒక కుమార్తె తల్లికి ఇస్తున్నట్టులేదది. ఒక మాతృదేవత తన పాపకు తాయిలాన్ని అందిస్తున్నట్టుంది. లక్ష్మమ్మ ఆత్రంగా తినబోయింది. కానీ, ఆమాత్రం స్పర్శనుకూడా భరించడానికి కావలసిన శక్తిని, పెదవులూ దంతాలూ కోల్పోవడం మూలాన, ఆమెకు అపరిమితమైన బాధ కలిగింది.

వాటిని తక్షణమే పక్కమీద పడేస్తూ, మూలుగుతూ నిట్టూర్చిందామె. "లేదు, లేదు, తినాలని ఉందిగాని తినలేను" అంది. ఈ మాటతో అక్కడ ఉన్న వ్యక్తులందరికీ మనసు గింజుకులాడింది. పగిలిపోయే గుండెలతో అలాగే కూర్చున్నారు ఆ ఇద్దరూ తల్లి దగ్గర.

•

•     •

# 11

రాఘవయ్యగారు విజయతో ట్రెయిన్ దిగి గది చేరుకునే సరికి సాయంత్రం నాలుగయింది. నిర్జీవంగా యంత్రాల్లాగా నడుచుకొనే కూతుళ్ల ఎదుట ఒక నేరస్థుడులాగా కూర్చున్నా రాయన. అల్లుళ్ళిద్దరూ ఏవో నాలుగు ముక్కలు మాట్లాడారు. లక్ష్మమ్మగారి సంగతులన్నీ ఒక్కొక్కటీ తెలుసుకుంటూ ఉండి కన్నీరు కార్చసాగారాయన. ఇన్నాళ్లూ భార్యతోటి అనుబంధం అంతా గుండెల్లో ఏ మూలనో దాగి ఉంది. ఈ క్షణంలో వెలికి వచ్చి ఆయన హృదయాన్ని కరిగిస్తున్నట్టుంది.

కాఫీలయ్యాక భారవి లేచి "వస్తారా వెళదాం" అన్నాడు. రాఘవయ్యగారు మౌనంగా లేచి భారవిని అనుస రించారు. హాస్పిటలు సమీపిస్తున్నకొద్దీ ఆయనకేదో భయం లాంటిది అధికం కాసాగింది.

బెడ్ పక్కన మామ్మ పక్కకు తొలగి, "వచ్చావా, నాయనా!" అంటూ పలకరించింది. తడబడే కాళ్ళతో స్టూలు మీద కూర్చున్నారు రాఘవయ్యగారు.

"అత్తా!" అని పిలిచాడు భారవి. రెండు మూడు సార్లు పిలిచాక తలనిటు తిప్పి చూసింది లక్ష్మమ్మ. ఎదురుగా భర్త ముఖం కన్పించింది. తదేకంగా ఆ ముఖంలోకి చూసిం దామె.

"నేనూ! పోల్చలేదా?" అన్నారు ఆయన వణికే కంఠంతో కళ్ల నీళ్ళు కారుస్తూ. భర్తను పోల్చినట్టు తల ఊపింది లక్ష్మమ్మ.

"వచ్చారా...." కూడదీసుకొని మాట్లాడటానికి ప్రయత్నించింది. "నేను చెప్పినది వినలేదు... ఈనాటికీ కష్టం వచ్చింది... పిల్ల లిద్దరూ... అంతా... అయిపోయింది..."

"లేదు, లేదు. నీకు బాగవుతుంది. మనం కాశీ కూడా వెళదాం. నువ్వు బెంగపడకు." అంటూ రాఘవయ్యగారు భార్యచేతిని నిమరసాగారు. కానీ, కళ్ల ఎదురుగా ఉన్న ఆమె ఆయనకు భీతినీ, పశ్చాత్తాపాన్నీ కలిగించసాగింది. గతంలోని తన ప్రవర్తనలోని దుష్టత్వాన్ని, ఈనాడు ఆమె నామమాత్ర వశిష్టురాలై మంచంపై పడుకొని దండిస్తున్నట్టుంది.

ఒక పావుగంట నిశ్శబ్దంగా కూర్చున్న తరువాత "ఇక వెళదామా ?" అన్నాడు భార్గవి. అశ్రువులను తుడుచుకుంటూ నెమ్మదిగా లేచారు రాఘవయ్యగారు.

ఆనాటిరాత్రి లక్ష్మమ్మ పరిస్థితి చాలా మెరుగ్గా కనిపించింది. పరామర్శకు వచ్చిన బంధు మిత్రులందర్నీ గుర్తుపట్టి పలకరించింది. కూతుళ్లందరితోనూ ఆప్యాయంగా మాట్లాడింది ఆవిడ ముఖంలో కోల్పోయిన ఆరోగ్యం కోలుకుంటున్నట్టు కళ వచ్చింది.

భారతి చేతిలో ఉన్న జాబును ఆవిడ చిరు నవ్వుతో పలకరించి ముద్దాడుతున్నప్పుడు కుమార్తెల ఆనందానికి అవధులు లేకపోయాయి.

"తినడానికి ఏమయినా తీసుకురానా, అమ్మా" అనడిగింది భారతి.

"పెరుగూ, అన్నం తీసుకురా అమ్మా, చాలా రోజు లయినట్టుంది."

•

• •

తల్లి నోటంట ఆ మాటలు వింటుంటే, ఏదో విచారమో ఆనందమో తెలియని అవ్యక్త భావాలు అందరి మనసులలో అలముకొని మాటిమాటికీ కళ్లల్లో అశ్రువులు నిండిపోసాగాయి. హాస్పిటలునుండి వచ్చేశాక, గదిలో అందరూ కూర్చొని లక్ష్మమ్మకు వేరేగా ట్రీట్‌మెంట్ చేసే విషయం చర్చించుకున్నారు. అదొక విధమయిన వేగిరపాటు అందరి మనస్సుల్లోనూ నిండిపోయి, ఎవరూ ఆ రాత్రి ఒక్క ముద్దకూడాసరిగ్గా తినలేకపోయారు. రాఘవయ్యగారు మాత్రం ఫలహారంచేశారు.

మర్నాడు ఉదయం ఆరుగంటలన్నర అవుతూంది. ఇంకా కొందరు నిద్ర లేవనేలేదు. జ్వరం వచ్చినట్టుండి, నీరసంగా పడుకునివుంది నీల. భర్త ప్రవర్తనలో సుముఖతను గుర్తించిన ఛాయ సంతోషాంతరంగురాలై సుఖ నిద్రలో మునిగివుంది. విజయ హార్లిక్సు తీసుకొని తల్లి దగ్గరకు వెళ్ళి అరగంట అవుతుంది. భారతి లేచి ఏవో పనులు చూస్తూంది. రాఘవయ్యగారు కాఫీ టిఫిను ముగించి, బాల్కనీలో కుర్చీవేసుకు కూర్చున్నారు.

"నాన్నా, నాన్నా!" అంటూ వణికిపోతూ విజయ క్రిందినుండి కేకలు పెడుతూ ఉండడాన్ని విని, కిందికి తొంగి చూశారు రాఘవయ్యగారు. కళ్ళనీళ్ళతో గజగజ వణకుతూ నిలబడివుంది విజయ.

"అందరూ రండి త్వరగా, అక్కనిపిలు, నాన్నా. అమ్మ......" ఆపైన ఆ పిల్లకు నోటమాట రాలేదు.

అపటి సరికే కేకలవిని కంగారుగా తండ్రి పక్కకు వచ్చింది భారతి. విజయ మాటలు వినగానే ఆమె గుండెలవిసి

పోయాయి. మరునిమిషంలో ఆ రెండు గదుల్లోని వ్యక్తు లందరూ, భీతాంతరంగులయ్యారు. ఆదరాబాదరా లేచి, తడబడే అడుగులతో అందరూ హాస్పిటల్లోకి పరుగులుపెట్టారు.

ఊర్ధ్వలోకాల్లోకి పరికిస్తున్నట్టుగా లక్ష్మమ్మ ముఖం పైకెత్తివుంది. కళ్ళు తెరిచే వున్నాయి. బెడ్‌పైని దుప్పటి అంతా, వాంతులతో నిండిపోయింది. ఆమె కళ్ళల్లోని కళ అంతా తప్పిపోతూ, కనుగుడ్లపైకి ఒక గాజుపొరలాంటిది కమ్ముకుంది. మధ్యమధ్య వెక్కిళ్ళు వస్తున్నాయి.

తల్లినిచూసి గొల్లుమన్నారు అంతా. "ఏడవకండి" అంటూనే స్టాఫ్‌నర్సు కళ్ళనీళ్ళు పెట్టుకోసాగింది.

"అమ్మా! ఇటు చూడమ్మా! మమ్మల్ని వదలేసి వెళ్ళిపోడానికి నీ మనసెలా ఒప్పుతోందీ? అయ్యో! భగవంతుడా! మమ్మల్ని తల్లిలేని పిల్లల్ని చేయకు. ఒక్కసారి మాట్లాడమ్మా! మమ్మల్ని వదిలి నీవు వెళ్ళలేవు. మా అమ్మ ఉంటుంది మా అమ్మ ఉంటుంది. ఎవరూ డాక్టర్ని పిలవరే? అమ్మా......అమ్మా......"

పిల్లల రోదనతో వార్డంతా దుఃఖమయమైపోయింది. ఉన్మాదినులై విలపించే కన్నబిడ్డల దీనాలాపాలు లక్ష్మగారి చెవినిపడనేలేదు. ఆ సమయంలో ఆ దేవుడూ ఏమీచెయ్యలేక పోయాడు.

కాస్సేపటికి లక్షమ్మగారి వెక్కిళ్ళు ఆగిపోయాయి. ఈ లోకంలో పడవలసిఉండే బాధల్ని అందరితోటీ మమతా బంధాల్ని వదలించుకొని విముక్తురాలై పోయింది. ఒక అనుబంధం తెగిపోయింది.

•

• •

కూతుళ్లెవరికీ చైతన్యమే లేదు. ఏడ్చి ఏడ్చి సొమ్మసిల్లి తల్లి భౌతికాయం దగ్గర పడి ఉన్నారు. ఉండి ఉండి పెద్ద పెట్టున రోదిస్తున్నారు. కాస్సేపట్లో కళేబరం అక్కడినుండి బైటకు గొనిపోబడింది. తెలిసిన బంధువులు నలుగురూ వచ్చి, చెయ్యవలసిన ఏర్పాట్లన్నీ చేశారు. లక్ష్మమ్మను ముత్తైదువగా అలంకరించి స్మశానానికి తీసుకుపోతూవుంటే, ఆ కుమార్తెల దుఃఖావేశాన్ని అవరోధించడానికి ఎవరికీ శక్తిలేకపోయింది.

ఆ రాత్రి లైట్లు వెలిగే సమయానికి ఆ వార్డులోని లక్ష్మమ్మగారి బెడ్ వెలవెలబోతూ ఖాళీగా కనిపించింది. ఆ మర్నాటికే ఇంకో పేషెంటు వచ్చి, ఆ స్థానాన్ని ఆక్రమించవచ్చు. కాని, స్వగృహంలో గృహిణిగాను, తనపిల్లలకు తల్లిగాని, ఆమె చోటు ఖాళీగానే ఉండిపోయింది.

## 12

స్వగ్రామంలో, దేవుడులేని ఆలయంలా ఉన్న ఇంటిలోనికి ప్రవేశించారు అందరూ. మరికాస్సేపటికి ఆ యింటినుండి రోదనధ్వనులు మిన్నుముట్టాయి. అనురాధ వచ్చి నీలను పెనవేసుకుంది. స్నేహితురాలి భుజంపై తల వాల్చి బావురుమంది నీల.

"నువ్వింతలా దుఃఖిస్తే, అమ్మ ఆత్మ శాంతించదు," నీలూ! అలా ఏడవకు...." నీల కన్నీళ్లు తుడిచి ఓదార్చడానికి ప్రయత్నించినా, మాతృసమాన అయిన లక్ష్మమ్మ ఇక లేదు అనుకుంటే అనురాధ హృదయమంతా వికలమయిపోయింది.

ఆ మర్నాటినుండి జరుగవలసిన కార్యక్రమమంతా యథావిధి జరిగిపోయింది.

•

• •

"మీకు మేము చెప్పాల్సినంతటివాళ్లం కాదు. ఆ ఇద్దరు పిల్లలపై రెండక్షింతలు జల్లి మీ బాధ్యత తీర్చుకోండి. పోయిన వాళ్ళతో వెళ్లిపోలేముకదా ? ఆవిడ అదృష్టవంతురాలు. పసుపుకుంకుమలతో వెళ్ళిపోయారు. మీకు మీరే దుఃఖాన్ని ఉపశమింపజేసుకోవాలి." అంటూ మనిషోరకంగా ఆ మాటల్నే తిరిగి చెప్పి బంధుమిత్ర పరివారం వెళ్ళిపోయారు.

లక్ష్మమ్మగారుపోయి పదిహేను రోజులవుతుంది. ఆవేళ సాయంత్రం వరండాపై కూర్చుని యోచనలో మునిగిఉన్న తండ్రి వద్దకు వచ్చింది ఛాయ.

"ఏం తల్లీ!" అన్నారు రాఘవయ్యగారు.

ఒక్కక్షణం ఊరుకొని, "ఆయన రేవు వెళ్ళిపోతా నంటున్నారు. నాన్నా !" అంది ఛాయ నెమ్మదిగా.

"అప్పుడే ఏమమ్మా ? ఓ నాలుగు రోజులుండమను. ఏదీ ? నేను చెబుతాలే."

"అదికాదు నాన్నా. మరి సెలవు లేదంటున్నారు."

"సరేమరి ! ఛార్జీలూ అవీ నీ చేతికిస్తాను. ఇచ్చెయ్యి."

"దానిమాటకేం గానీ...." అంటూ నసిగింది ఛాయ.

ప్రశ్నార్థకంగా చూచారు రాఘవయ్యగారు.

"నేనుకూడా ఆయనతో వెళ్ళిపోవాలనుకుంటున్నాను"

"అదేమిటమ్మా !" దిగ్భ్రమతో ప్రశ్నించారు.

ఛాయ సిగ్గుపడి, "అదికాదు నాన్నా ? నాన్నా. ఆయనకి హోటలుతిండి పడదు. నేనిక్కడఉండి చెయ్యగలిగిందే ముంది ! అక్క ఉంటుందికదా ?" అంది.

కొత్తదంపతులు! కూతురిమాట కెదురాడలేక "సరే" అన్నారు రాఘవయ్యగారు. ఛాయ లోపలికి వెళ్ళిపోయింది.

రాత్రి—ఇంకా భోజనాలు కాలేదు. డాబాపై మసక వెన్నెల్లో కూర్చొని శూన్య దృక్కులతో ఆకాశంవంక చూస్తున్న నీల మెత్తెక్కి ఎవరో వస్తున్నట్లయి వెనక్కు తిరిగి చూసింది.

"ఏం చేస్తున్నావు నీలా?" చనువుగావచ్చి ఎదురుగా కూర్చున్నాడు భారవి.

"ఏంలేదు. నువ్వెప్పుడు వచ్చావు షికారునుండి? చీకటిగా ఉంది. కిందకు పోదామా?" కంగారు దాచుకుంటూ అంది నీల.

భారవి నవ్వాడు. "ఫర్వాలేదులే. కూర్చో ఒక్క రెండు నిమిషాలుండి వెళ్ళిపోతాను నేను."

తన అంతరంగాన్నతడు గమనించినందుకు లోలోపలే లజ్జ కలిగిందామెకు.

"రేపే వెళ్లిపోతున్నాం, నీలా!"

"............"

"అత్తను పోగొట్టుకున్న ఆ ప్రదేశానికి తిరిగి వెళ్లాలంటే బాధ కలుగుతూంది. కానీ ఉద్యోగ ధర్మం!—వెళ్ళకతప్పదు."

"........."

"మాట్లాడవేం నీలా? నాలాంటి నిత్యశంకితునితో ఏం మాటలనా?

. . .

"బలవంతంగా నవ్వును తెచ్చుకుంటూ నీల తలెత్తింది. ఆమె నేత్రాలు సజలములై ఉన్నాయి.

"అలా ఎందుకనుకుంటాను, బావా! అమ్మ జ్ఞాపకం వచ్చింది." అంటూ కళ్ళు తుడుచుకుంది నీల. "అయితే రేపు వెళ్ళిపోతున్నారన్నమాట. సాయంత్రమే విన్నాను నేను కూడా."

"ఊఁ—వెళ్ళేముందు ఎన్నో చెప్పాలని వచ్చాను. తీరా వచ్చి కూర్చునే సరికి అన్నీ మర్చి పోతున్నాను."

"ఏముంటాయి చెప్పడానికి !"

"చెప్పడాని కేమయినా వుంటే నీతోనే నేను చెప్పేది ! ఈ నిర్భాగ్యుణ్ని మరిచిపోకుండా ఉత్తరాలు వ్రాస్తుంటావు కదూ ?"

"అలాగే కానీ !"

"ఏమిటి ?"

"నీ అనుమానాలతో, మనస్సంఘర్షణలతో ఎవర్నీ బాధ పెట్టవు కదా, బావా ?"

భారవి పేలవంగా నవ్వాడు. "నా శాయ శక్తులా ప్రయత్నిస్తాను. చెప్పాను కదా ఒకసారి ? నా మనసు నాఅదుపులో వుంటే ఈనాడిలా నీ ఎదుట కూర్చొని వుండే వాణ్ని కాదు. ఆశించినది అందుకోలేక, పొందిన దాన్ని వదిల పరచుకోలేక గింజుకునే వాళ్ళ బాధని ఎవరూ తీర్చలేరు. నీలా ! అలా తీరిన నాడు అంతటి అదృష్టవంతులింకెవరూ వుండరు. లేని నాడు అటువంటి వాళ్లకు జీవితంలో ఏమీ ఆనందం మిగలదు. తప్త హృదయంతో మృత్యువు కెదురు చూడవలసిందే. ఆ నిరీక్షణలో

మాడి. మనసు మొద్దుబారి పట్టి జడులుగానూ, లోకద్వేషులు గానూ మారిపోయే అవకాశం కూడా వుంది——" అంటూ హఠాత్తుగా మధ్యలో ఆపి లేచాడు. "ఏవో పిచ్చిగా వాగుతుంటాను." అని నవ్వుతూ "మా ఫ్రెండ్ అంటూవుండేవాడు ఇలాంటి పిచ్చి ఉద్రేకానికి బ్లడ్ ప్రషర్ అని. వెళ్ళుతున్నాను, నీలా, ఓపిగ్గా విన్నావు" అంటూ మెట్లు దిగి గబగబా క్రిందికి వెళ్ళిపోయాడు.

అతడు వెళ్ళిన వంకే చూస్తూ ఉండి పోయింది నీల. అతను మాట్లాడిన దాంట్లో ఏదో అర్థం అవుతున్నట్లనిపించింది. కానీ, ఆ అర్థమయిన భావమేదో మనోఫలకంపైన ముద్రింపబడకుండా, మెదడులోనుండి ఆ భావాలను త్రోసివెయ్యడానికి ఆమె ప్రయత్నించింది.

తనకు తెలియని అవేదన ఏదో బావలో దాగివుంది. "వద్దు భగవాన్! అతని ఆవేదనను నేనర్థం చేసుకోకూడదనే వరమియ్యి. నేను పయనించే దారిలో ముళ్ళ డొంకలను నిర్మించారు." అని ఆమె మనసు ప్రార్థించింది.

ఆ మర్నాడే ఛాయా, భారవీ వెళ్ళిపోయారు. భారతి ఉండిపోయింది. ఇంటి యాజమాన్యం నిర్వహించుకుంటూ, చెల్లెళ్ళిద్దరికీ ఓదార్పు కలిగిస్తూ మసులుకో సాగింది. ఆమె ఉండడం కొంత ధైర్యంగా ఉంది రాఘవయ్యగారికి. ఇలా ఒక నెల రోజులు గడిచాయి. తిండి సరిగ్గా లేదని, బయలుదేరి రావలసిందనీ ప్రకాష్ వద్దనుండి ఒక ఉత్తరం వచ్చింది. ఆ రెండో రోజునే భారతి ప్రయాణ సన్నాహాలు చేసుకుంది.

"మనసు కేదయినా కష్టం కలిగితే నాకు వ్రాయండి. తక్షణం బయలుదేరి వస్తాను. అమ్మ ఎక్కడికీ పోలేదు. తన

చల్లని కళ్లతో మనల్ని కాపాడుతూనే వుంది. శ్రద్ధగా చదువుకోండి. వెళ్ళుతున్నానేకానీ, ఇంకో నెల గడిచే సరికి చూడ్డానికి వస్తానుగా? అంటూ ధైర్య వచనాలు పలికి వెళ్ళిపోయింది భారతి.

లక్ష్మమ్మగారి స్మృతులూ, నీలా విజయలూ మిగిలారు ఇంట్లో. ఇల్లు బావురుమంటూ వుంది. భారతితోపాటు బాబుగాడు చేసే అల్లరి పనుల సందడి కూడా వెళ్లిపోయింది. చింతామణిని మాన్పించేశారు. ముసలమ్మ నీల సాయంతో ఏదో వండి పడేస్తుంది. బిక్కుబిక్కు మనుకుంటూ అక్క చెల్లెళ్ళిద్దరూ చెరో మూల కూర్చుంటున్నారు. తల్లి గుర్తుకు వచ్చినపుడల్లా కుమిలి కుమిలి ఏడవటం. విజయ స్కూలుకి వెళ్ళుతూంది. శ్రీనివాసు ట్యూషను చెప్పటానికి వస్తున్నాడు.

రాఘవయ్యగారి శరీరఆరోగ్యం పూర్తిగా చెడిపోయింది ఒక వైపు చదువుకుంటూనే ఇంకో వైపు తండ్రికి పరిచర్యలు చేస్తూవుంది. అహోరాత్రాలు మేల్కొని ఉండటంతో మనిషి బాగా నీరసించి పోయింది నీల.

"తల్లీ! నీవున్నావు కాబట్టి ప్రాణం నిలబడు తున్నది. నువ్వుతప్ప ఇంకెవరున్నారు ఆధారం? మీ అమ్మ చేతి సేవ కరువై పోయింది. నేనేదో దుర్మార్గుణ్ణని మీ అమ్మ అభిప్రాయ పడుతూ వుండేది. వెళ్ళిపోయే దాకా కూడా దాని మనసు మారలేదు. తను నా మీదేమైనా చెప్పివున్నా, అది మనసులో వుంచుకోకు సుమా!" అంటూ ఉంటారు రాఘవయ్యగారు.

దుఃఖం, కోపం, జాలి, అన్నీ ఒక్కసారిగా ముప్పిరిగొని కన్నీళ్ళతో మూగగా కూర్చుంటుంది నీల. కూతుళ్లనెప్పుడూ

తన దగ్గరే కూర్చోబెట్టు కుంటారు తండ్రి. ఆస్తుల వివరాలూ, అప్పులూ, తానెప్పుడైనా హఠాత్తులో పోతే ఏం చెయ్యా వల సిందీ అంతా చెబుతూ ఉంటారు. మనిషికి లేవడానికి బలంలేదు ఎముకలపోగు అయిపోయారు. డాక్టర్లను తేవడం తమ్ముళ్ళ పనీ. సరిగ్గా నిద్రాహారాలు లేక పని చెయ్యటం నీల వంతూ అయింది.

ఎవరి కృషి అయితేనేమి, కొన్నాళ్ళకు రాఘవయ్యా గారు కోలుకున్నారు. ఆయన ఇంటినుండి అడుగుతీసి వీధిలోకి వెళ్తున్నప్పుడు నీలా, విజయలకు ఒక పండుగ చేసుకున్నట్టని పించింది.

కానీ, నిద్రలేమి, నిరాహారం ఆమెపై బాగా పని చేశాయి. త్వరలోనే ఆమె కూడా మంచం పట్టింది. కానీ తెలియనివ్వకుండా లోలోపలే తిరుగుతూ ఉండేది. ఎలా వచ్చిన జ్వరం అలానే వెళ్ళిపోయింది. కాని మునుపటి నీల వేరు; ఇప్పటి నీల వేరు.

నిండైన చెక్కిళ్ళతో, ముఖంనిండా నవ్వుతో, తల్లి దగ్గిర అల్లరి చేస్తూ. గలగల పారే సెలయేరులా ఉండేది ఆనాటి నీల! చిక్కి శల్యమై, దిగులుతో ఏవో అనుభవాల్ని గడించిన గాంభీర్యం కనిపిస్తుందీనాటి నీలలో!

## 13

రెండు నెలలున్నాయి పరీక్షలు. ఆవేళ లెక్కల్లో చిన్న స్లిప్ టెస్ట్ చేశాడు శ్రీనివాసరావు. పేపరు ముగించింది నీల. విజయ ఇంకా ఏదో లెక్క చేస్తూంది.

"గుడ్ . వేగం చేశారు." పేపరందుకున్నాడు శ్రీనివాసరావు. అతని చేతుల్లో కంపనం. కళ్లల్లో కాంతు కనిపిస్తున్నాయి. తెగించాడు శ్రీనివాస్.

"ఆలోచించారా ఆ విషయం ?"

నీల గుండె ఒకసారి టపటపమని కొట్టుకుంది. తలవంచుకొని పుస్తకం తిరగేస్తూ. "ఊఁ" అన్నది. విజయకు ఈ సంభాషణ కొత్తగా వినపడు తున్నది.

"ఏమి నిర్ణయించారు ?"

ధైర్యం పుంజుకున్న నీల తలెత్తి. "చెబుతాను. మీరేమీ అనుకోరు కదా ?" అన్నది.

"అనుకోవడమా ?"

"అదికాదు నానిర్ణయం మీ కిష్టపడక పోయినా స్నేహ భావంతో స్వీకరించాలని కోరుతున్నాను."

"చెప్పండి."

దృష్టిని అతనినుండి మరల్చుకొని పుస్తకం వంక చూస్తూ అన్నది. "మీ కుటుంబాన్ని చూశాను. నాకు నేనై ఆ కుటుంబంలో ఉంటే ఎలా ఉంటుందో ప్రత్యేకంగా పరీక్షించి చూశాను. మరేమనుకోకండి. మీ సంస్కారానికి, మా సంస్కారానికి చాలా బేధం ఉంది. నేను కూడా మీ అందరిలో ఒకదాన్నయితే కలహాలూ, అశాంతీ తప్పవు. నేను చాలా ఆలోచించి ఈ నిర్ణయానికి వచ్చాను........"

ఇంకేదో చెప్పబోతూండగా, శ్రీనివాసరావు ముఖం వివర్ణం అయింది. "అంటే మాది సంస్కారం లేని కుటుంబ

మంటారు. అంతేనా మీ అభిప్రాయం?" అవమానం పొందిన స్వరంతో అన్నాడు.

నీల లోలోపల చిన్నగా నవ్వుకుంటూ: అలా ఎందు కనుకోవాలి? మా కుటుంబమే సంస్కారం లేనిది కావచ్చు. మీ సంస్కారమే గొప్పదవ్వ వచ్చు. అందులోని భేదాన్ని గూర్చి చెప్పానే కాని, హెచ్చు తగ్గుల విషయం నేనేమన లేదే!" అంది.

"అయితే కొంచెం సూటిగా చెప్పండి మీరనుకున్న దేమిటో?"

"ఇప్పటికి నా అభిప్రాయం మీరర్థం చేసుకున్నారనే అనుకుంటున్నాను, మాష్టారూ!"

మునుపెన్నడూ లేని ఈ కొత్త సంబోధనతో అతను పూర్తిగా నిరాశ చెందాడు. అంత వరకూ ఆశలను నింపు కున్న అతని మనసులో క్రోధావమానాలు నిండుకున్నాయి.

"మంచిది. మా నాన్న లక్షాధికారి లెండి. పెళ్ళి చూపులకు రమ్మని మా నాన్నగారెంత వ్రాసినా నేనే తప్పించు కున్నాను. కో అంటే కోటి మంది."

"నిజమే, మాష్టారూ! ఎవరు కాదన్నారు?"

"దయచేసి ఆ ఉత్తరాన్ని కాల్చేయండి."

"తప్పకుండా."

గురు శిష్య సంబంధం కొద్ది క్షణాలు సడలి, ఈ విధ మయిన కటు భాషణ సాగింది ఇరువురి మధ్య. విజయ పూర్తి

చేసి యిచ్చిన పేపరు తీసుకుని, బూట్లలో కాళ్ళు దూర్చి గబగబ లేచి వెళ్ళిపోయాడు,

టేబిల్‌పైన పుస్తకాలు వదిలి. నవ్వుకుంటూ వస్తున్న నీలను చూసి, "ఏమిటక్కా! మీరు మాట్లాడుకున్నది?" అడిగింది.

హృదయం కొంత తేలిక పడినా, బరువుగా నవ్వింది నీల. "నీకేమిటర్థమయిందో చెప్పు."

విజయ కొంచెం తటపటాయిస్తూ, "మాష్టారు........ పెళ్ళి......." అంది.

"చెప్పవే, ఫరవాలేదు."

"పెళ్లి చేసుకుంటానన్నారూ, నువ్వేమో కాదన్నావు"

"కరక్ట్. అంతే. నేను దీనికోసం బోల్డు ఆలోచించి తల బద్దలు కొట్టుకున్నానే. నువ్వే నయం. రెండు ముక్కల్లో చెప్పావు!"

"ఎంత స్వల్ప విషయం అనిపించింది ఇద్దరికీ. ఆ వేళ అన్ని పనులూ అన్యమనస్కంగానే చేసింది నీల. సముద్రతీరం భారవీ, శ్రీనివాసరావూ, హాస్పిటలూ, తల్లీ అందరూ మనసులో తిరుగుతున్నారు. మనసంతా వికలం అయి పోయింది.

రాత్రి ఫలహారం తీసికెళ్ళి తండ్రి ఎదురుగా టేబిల్ మీద పెట్టి వచ్చేయ బోతుండగా, "విజయేదమ్మా?" అన్నారు రాఘవయ్యగారు ప్లేటును ముందుకు తీసుకుంటూ.

"లోపలుంది."

"ఇలా రమ్మను. నువ్వు కూడారా."

ఏదయినా మనసులోని ఉద్దేశాలు చెప్పదల్చుకుంటే పిల్లల్ని కూర్చోబెట్టుకొని చెప్పటం అలవాటు తండ్రికి.

ఆయన టిఫిను చేస్తూండగా ఇద్దరూ కూర్చున్నారు ఎదురుగా.

"పరీక్షలు దగ్గర కొస్తున్నాయి కదూ ?"

"ఊఁ —"

"బాగా చదువు తున్నారా ? మాష్టారు మంచివారే!"

"...........''

"నువ్వెళ్ళ బోయేది అక్క దగ్గరకే కదా ? మరి వాళ్ల కోసం ఏమయినా తీసికెళ్ళద్దూ ?"

"అప్పుడు చూసుకోవచ్చులే నాన్నా !" నీల పరీక్షలు వ్రాయడానికి వెళ్ళబోయేది భారతి ఉన్న వూరే. తండ్రి వూరికే కూర్చుని అప్రస్తుతాలు మాట్లాడు తున్నట్టుంది నీలకు.

"మీ ఇద్దరి భారం నామీద పెట్టి అమ్మ వెళ్ళి పోయింది తల్లీ. ఇక నాతర్వాత మిమ్మల్ని చూసే వాళ్ళుండరు. మీఇద్దర్నీ రెండు మంచిఇళ్ళల్లోపడవేస్తే నాభారంతీరిపోయినట్టుంటుంది."

నీల తల వంచుకొని వింటూంది. ముఖంలో అయిష్టత బాగా వ్యక్త మవుతూంది.

"ఒక సంబంధం విషయం తెలిసింది. మధ్యవర్తి వ్రాశాడు. కుర్రవాడు ఎమ్.బి.బి.ఎస్. పాసయి ప్రాక్టీసు పెట్టుకున్నా డట—...." రాఘవయ్యగారు ఆగి ఆగి చెప్పారీముక్కల్ని.

చెప్పటం అయ్యాక కూతురి ముఖంవంక చూస్తూ అన్నారు. "ఏమని వ్రాయమంటావమ్మా ?"

నీల తలెత్తలేదు.

"చెప్పు. నీ ఇష్టానికేదీ వ్యతిరేకంగా చెయ్యను. నీ ఇష్ట ప్రకారమే చేస్తాను."

"నా కిష్టంలేదు నాన్నా !" నీల తలెత్తకుండానే అంది.

ఆశాభంగం పొందినట్లు ఫీలయ్యారు రాఘవయ్యగారు. "సరే అలాగే కానీ. నీవు ఇష్టపడిన సంబంధాన్నే చేస్తాను. మీకే విధంగా సుఖంగా ఉంటుందో ఆమార్గమే ఆలోచిస్తాను."

"నేనసలు పెళ్లిచేసుకోను నాన్నా ! విజయకు చేసేయి. నా చదువు పూర్తయ్యాక ఉద్యోగం చేసుకోవాలని ఉంది. నా కోసం పెళ్ళి మాట తలట్టవద్దు." నీల చాలా దృఢంగా చెప్పిందీ మాటల్ని.

షాక్ తిన్నట్టయింది తండ్రికి. కాస్సేపటికి తేరుకుని, "సరే చదివిస్తాను. చదువుకో. నీ నిర్ణయాన్ని ఇంకోసారిచెప్పు. బాగా ఆలోచించుకో. మీ భారం తీరిపోతే నాకిక ఏ చీకూ చింతా ఉండదు. ఆ పైన నీ యిష్టం." అన్నారు.

ఆ మాటలన్నీ విని నెమ్మదిగా లేచి వచ్చేశారు అక్క చెల్లెళ్ళిద్దరూ. ఆ రాత్రి చాలా సేపటిదాకా ఒంటరిగా ఆలోచించి డైరీలో వ్రాసుకుంది నీల.

—" నా నిర్ణయం ద్వారా నాన్నను బాధ పెడుతున్నానని తెలిసినా మనసు మారటం లేదు. కాకపోతే ఈ కఠోర వ్రతాన్నెంత వరకూ కొనసాగించుకోగల ననేదే సమస్య

నా ఆత్మ విశ్వాసం నాకు లేక పోలేదు. అయినా పెళ్లెందుకు చేసుకోకూడదు? నా భావు కతకు సరిపోయిన జతగాడు ఎక్కడా లేడని పిస్తుంది. నాలో లీనమై నన్ను లీనంచేసుకో గల వ్యక్తి కావాలి. అలాంటి వాళ్లెక్కడ ఉంటారు? మరి అందరి సంగతో!........"

ఇలా వ్రాస్తూనే ఈ తెగని చర్చను మధ్యలో తెంపి, డైరీని మూసేసి, ఇంగ్లీషు టెక్ట్స తెరిచింది నీల.

## 14

పరీక్షలయిపోయాయి. చాలా రోజులకు తీరికగా స్నేహితులిద్దరూ వెన్నెల్లో కూర్చున్నారు.

"చిర కాలానికి" అంటూఇద్దరూ నవ్వుకున్నారు.

"ప్రశాంతంగా ఉంది కదూ. రాధా! పరీక్షలు బాగా వ్రాశాను కాబట్టి మరీ హాయిగా ఉంది. ఇలాంటి వేళల్లో నీతో చెప్పాలని ఎన్ని విషయాలు దాచానను కున్నావు! వింటే ఆశ్చర్య పోతావు" నీల మాటల్లోని హాయిదనంలో. రవ్వంత చిలిపితనం కూడా ఉంది.

"చెప్పరాదూ! అన్నీ వినాలనే వేచి ఉన్నాను."

"ఉండయితే. తలగడలు తెచ్చివేస్తాను. పడుకొని కబుర్లు చెప్పుకుందాం."

లోపలినుండి తలగడలు తెచ్చివేసింది నీల. వెల్లకిలా పడుకొని చూస్తుంటే నీలాకాశంపై పల్చని మబ్బు పింజలెగిరి పోతున్నాయి. మందమందంగా గాలి వీస్తుంది. పిట్టగోడపై

వాలి ఉన్న కొబ్బరి కొమ్మలపైన వెన్నెల పడి తళతళ మెరుస్తూంది.

"ఊఁ-ఇప్పుడు చెప్పు." పక్కకు తిరిగింది అనూరాధ,

ఇటు తిరక్కుండానే చిన్నగా నవ్వింది నీల. "ఇదుగో మొదలెడు తున్నాను. అన్నీ విని నీ అభిప్రాయం చెప్పాల్సి ఉంది."

"అలాగే. ఏదయినా అసాధారణ విషయం కాదు కదా!"

"కొంత వరకూ అలానే అనుకోవాలి. మా చిన్న బావని చూశావు కదూ అనూ!"

"చూశానూ."

"ఎలా కన్పిస్తాడు నీ కంటికి?"

"అందంగా. సౌమ్యంగా!" అనూరాధ నిస్సందేహంగా చెప్పేసింది.

"ఆ బావలో అందమూ, శాంతమే కాదు : ఆవేదన కూడా ఉంది. అందులో కొంతపాలు నేనుకూడా పంచుకున్నాను అనూ. ఏమిటో వైజాగు వెళ్ళి వచ్చిం దగ్గర్నుండీ మనసేం బాగుండటంలేదు. నే నెన్నడూ ఎదురు చూడని అనుభవాల్ని చవి చూస్తున్నాను. అవి స్వల్ప మైనవే అనుకో. అయినా నాకు మాత్రం కొత్తే."

భారవి సంక్షోభం, తనతో అతను అంతా చెప్పుకోడం— అవన్నీ వివరంగా కాకుండా టూకీగా చెప్పింది. అంతటినీ అనూరాధ సాలోచనగా విన్నది.

•

• •

"ఏమంటావు అనూ? అంతా విని నీకేమనిపిస్తూంది?"

"అతని ఆవేదనంతా అకారణ మనిపిస్తూంది నాకు మాత్రం. ఏది ఏమయినా మనకెందుకీ విషయాలన్నీ? నువ్వు దేంట్లోనూ కల్పించుకోకు సుమా. అనవసరంగా మనసును కష్టపెట్టుకోవడ మవుతుంది. వాళ్ళ సమస్య లేపాటివి? పాల పొంగు మీద నీళ్ళ చిలకరింపు చందం."

"తెలుసు. కానీ, బావ అనుమానం అకారణ మయిన దనుకోను. కారణం దానికి ఉంది. కానీ, ఒకరి చర్యకు ఇంకొకరు బాధ పడాల్సి వస్తుంది అనూ!"

అనూరాధ కళ్ళు పెద్దవి చేసి, "అయితే చాయను శంకిస్తున్నావా నువ్వు కూడా?" అన్నది.

"ఛ. ఎంత మాటన్నావు. అదికాదు నేననేది. నీకు అంతా చెప్పనిదే ఏమీ అర్థం అవదు. నన్ను చెప్పనీ. పరీక్షలకు పెద్దక్క దగ్గరకు వెళ్ళాను కదూ? బావ అనుమానానికి ఆధారం అక్కడ లభించింది నాకు." ఆగి ఆగి చెప్పసాగింది నీల.

"పెద్ద బావను చూస్తే మహోత్తముడిలాగా కనుపిస్తాడు. కానీ, అదంతా పెద్దరికపు బురఖా మాత్రమే, రాధా! ఆ లోపల ఒక....తననేమని సంబోధించాలో తెలియడంలేదు ....కానీ....పశుప్రవృత్తి ఉంది తనలో నేనక్కడ ఉన్నాళ్లూ ఏదయినా సందర్భం వచ్చినప్పుడు నన్ను పొగుడుతూ ఉండేవారు. ఎగ్జామినేషన్‌కు తయారయి వెళ్ళిపోతుంటే, చీర ఫస్టుగా ఉందని, బొట్టు ఇంకొంచెం పెద్దదయితే బావుండేదని, ఏవో ఇలాంటి కామెంట్సు వస్తూండేవి తన దగ్గరనుండి. నేనంత

పట్టించుకోక పోయినా ఆ మాటలు వింటుంటే ఏవగింపు కలుగుతూండేది. కామెంటు చేసినంత మాత్రాన ఏవగించు కోవటమేమిటనుకోకు. అపాటి సంస్కారం నాకూ లేకపోలేదు. కాని, అతని మనసులోని నాకిష్టపడని భావం; ముఖంలో కొట్ట వచ్చినట్టు కనిపించేది. నేనేవగించు కొనేది దాన్ని !" ఆగింది నీల ఇంతవరకూ చెప్పి.

అనూరాధ ఒక నిట్టూర్పు విడిచి, "నీవువూహా ప్రపంచం లో విహరిస్తూ, అభిప్రాయాలేర్పరచు కుంటున్నావు నీలా! ఒక మంచి వ్యక్తి మీదనయినా సరే, మనం చటుక్కున చెడు అభిప్రాయాన్నేర్పరచు కున్నామంటే, అది మరేనాటికి చెక్కు చెదరదు. ఆ వ్యక్తిలోని మంచితనాన్ని కొంత కాలానికి గుర్తించినా, మనసులో తనపై ఉండే చెడు అభిప్రాయం అన్నది కలుక్కుమంటూనే ఉంటుంది. అనాలోచితంగా అభి ప్రాయా లేర్పరుచుకోవడం, అంటే వ్యక్తుల విలువను నిర్ణ యించడం, మానసికారోగ్యానికంత మంచిది కాదు." అన్నది.

నీల అంతా విని మందహాసం చేస్తూ అన్నది. "నేను అంత తొందర మనిషిననుకోకు. పూర్తిగా వినకుండా మధ్యలో లెక్చర్లు దంచుతావేం?"

"సరేలే చెప్పు."

"పరీక్షలయి పోయాక రెండు రోజులు అక్క బలవంతం మీద ఉన్నానులే. ఆ వేళ రాత్రి—భోజనం చేశాక ఏదో నవల చదువుకొంటూ మంచం మీద పడుకున్నాను అక్క వంటింట్లో ఏవో పనులు చూసుకుంటూంది. కాసేపటికి నిద్ర వస్తూండగా, పుస్తకాన్ని పక్కన పడేసి, గోడవైపు తిరిగి కళ్ళు

మీద చేతులుంచుకొని పడుకున్నాను. ఇంకా నిద్రపట్టలేదుబాగా కానీ, మగతగా ఉందిలే, ఇంతలో బయటనుండి ఎవరో లోపలికి వచ్చారు. వచ్చిన మనిషి నా పక్కనే కూర్చోడాన్నిబట్టి వచ్చింది పక్కింటి సరోజ అయి ఉంటుందను కొన్నాను. ఇటు తిరిగి పలకరించుదామను కుంటూ ఉండగా, తను నా మీదికి వంగటం కన్పించింది. చటుక్కున కళ్ళమీది నుండి చేతులు తీసేసి చూశాను. నా దగ్గర కూర్చున్నది సరోజ కాదు, ఎవరూ కాదు. సాక్షాత్తూ బావగారే. నేను చూడగానే తన ముఖంలో రంగులు మారి పోయాయి. గభాల్న లేచి నించొని "ఆ నవల చదివేశావేమోనని...." అంటూ మాటల్ని మధ్యలో మింగేసి, నేనిచ్చిన పుస్తకాన్ని తీసుకుని ఆదరా బాదరా వరం డాలోని చీకట్లోకి వెళ్ళిపోయారు ఆ చీకట్లో ఏం చదివారో మన కననసరం అనుకో."

"నాకు బెంగతో ఆ రాత్రంతా నిద్ర పట్టనేలేదు. అయితే పట్టరాని అసహ్యం మాత్రం కలిగింది. ఒక్కసారి వూహించుకో అనూ. నేను సరోజ అనే భ్రమలో అలా పడుకొని ఉండగా, తను అక్కడ కూర్చోవటం చూసిన వాళ్ళకి ఏమి అభిప్రాయం కలుగుతుంది? ఇలాంటి దృశ్యాలు చూసిన భారవి ఆవేదనకు గురి అయి ఛాయను శంకించాడూ అంటే అసహజమేముంది? లోపలి నిజాలు ఎవరికి తెలుస్తాయి గనుక! దేవుడనే వాడే ఉంటే ఇటువంటి వ్యక్తులేనాటికి క్షమించ బడరు అనూ! నేన న్నది ఈ మాటే. ఒక వ్యక్తిమనసులో చెలరేగిన పశుప్రవృత్తి వలన జరిగే సంఘటనల మూలంగా ఎటువంటి అపోహలు చెలరేగాయి! నిండు జీవితంలో ఎలాంటి విషబీజం మొలకెత్తింది?"

"పైకి ప్రశాంతంగా కనిపిస్తున్నా భారవి మనసులోని ఆవేదనాగ్నిని నేను తెలుసుకోగలను. అనూ. తన హృదయం చాలా సున్నిత మయినది కాబట్టే అంతగా గాయపడ్డారు. ఇక నేనేం చెప్పినా తను నమ్మేది కల్ల. పురుషాహంకారం అంత త్వరగా లొంగిపోదు." నీల ఒక్కసారి ఊపిరి గట్టిగా పీల్చుకుంది. "నువ్వేమో నావన్నీ భావాంబర వీధిలో జనించే భ్రమలంటావు. ఇప్పుడే మంటావు? లేకపోతే దీన్ని కూడా నీ తర్కంలో కొట్టి పారేసినా కాదనను." అన్నది.

ఈ ఆఖరి మాటల్లోని తేలికదనాన్ని అనూరాధ స్వీకరించి నట్టులేదు. ఏమీ మాట్లాడకుండా ఆలోచిస్తూ ఉండి పోయింది.

"మాట్లాడవేం రాధా!"

"ఏం మాట్లాడను? ఇలాంటి వాళ్ళుకూడా ఉంటారా అనిపిస్తూంది."

"ఉంటారని తెలిసిందా! సరే. అదలా విడిచిపెట్టు. ఇంకోటి చెబుతాను."

అనూరాధ సర్దుకోని, "చెప్పు" అన్నది.

"మాష్టారితో నా అభిప్రాయం చెప్పేశాను."

"ఎప్పుడూ? నాతో చెప్పలేదే!"

"చాలా కాలం అయిందిలే. అంతా ఒక్కసారి చెబుదామని వూరుకున్నాను."

"ఏమని చెప్పావు? అసలు అతనేమన్నాడు? ఎలా చెప్ప గలిగావు?"

•

•   •

"చెబుతున్నానుగా ! వాళ్ళ కుటుంబ సంస్కారమూ, తీరూ నీకు చెప్పానుగా అనూ ? ఆ మాటే తనతో అన్నాను. కాకపోతే ఇంకోలా చెప్పాననుకో. మీకూ, మాకూ చాలా భేదం ఉంది కాబట్టి పొందదన్నాను. ఓహ్ ! తనకి చాలా పౌరుషం వచ్చిందిలే, వాళ్ళకీ డబ్బుందిట. బోల్డు మంది అమ్మాయిలు దొరకుతారన్నాడు. సరే చేసుకో మన్నాను. అంతే ఆఖరు !"

"మరి ఆ మర్నాటి నుండీ తన ద్వేషాన్ని చూపించడం లేదూ ?"

"అలా అనకు అనూ. తను వ్రాసిన ఉత్తరాన్నీయ మన్నాడు. ఆ వేళ నుండీ ఎంతో మర్యాదగా పాఠాలు చెప్పకు పోయేవాడు. అసలేం జరగనట్లే అతి సామాన్యంగా ఉండే వాళ్ళం. ఈ రకంవాళ్ళు అంత హానికరమయిన వ్యక్తులు కారనుకో. ఒక విధంగా అందరికంటే మంచి వాళ్ళుకూడా. జరిగినవి ఎప్పటి కప్పుడు మర్చిపోయి నడుచుకునే వాళ్ళంటే ఇష్టపడతాను నేను."

"నీ పదిహేడో వసంతం నీకు శాశ్వితంగా మనసులో నిలిచి పోతుంది నీలా !"

"ఊఁ—ఒక విధంగా ! కానీ, ఈ విధంగా నిల్చిపోయే వసంతం అంత ఆమోదకరమయినది కాదు, అనూ. అన్నీ విషాద స్మృతులే. ఇలాంటి వసంతాలు కాకుండా. అన్నీ మధుర మయినవి గడపాలని కోరుకుందాము."

"ఎవరు చెప్పగలరు, నీలూ ! అన్నీ అనుకున్నట్టు జరి గితే ఇక సమస్య లేమున్నాయి లోకంలో ?"

•

• •

"మన ప్రయత్నం అంటూ ఒకటుందిగా? నా భావి జీవితానికి ఇప్పటినుండే సోపానాలు వెయ్యాదల్చు కున్నాను రాధా."

"ఎలా?"

"నేను పెళ్ళి చేసుకోననీ, చదువే నా ముఖ్య లక్ష్య మనీ స్పష్టంగా చెప్పేశాను నాన్న గారితో."

"ఒప్పుకున్నారా?"

"నిక్షేపంగా! అసలు—తన మనసులో దురాలోచన ఎందుకు రేగుతుంటాయో నాకు తెలియదుగానీ, మానాన్న గారి ఆసరా చిన్నప్పటినుండి నాకుంది, అనూ. యుక్త వయసు వచ్చేదాకా ఈ ఇంట్లో ఒక ప్రత్యేక వ్యక్తిగా పెరి గాను. ఇంట్లో అందరిలాగా కాక అపూర్వ సౌందర్యం లేదనీ, కోపం ఎక్కువనీ, అల్లరి దాన్ననీ. ఆఖరికి ఒక రౌడీగాకూడా నన్నందరూ భావించి అడుగడుక్కీ విమర్శిస్తూ, నన్ను దారిలో పెట్టాలని చూసేవాళ్ళు. నా చిత్ర లేఖనానికి గానానికీ, ఆట లకీ, స్కూల్లోనూ, వూళ్ళోనూ తప్పిస్తే ఇంట్లో ఏమాత్రం ప్రోత్సాహం దొరికేది కాదు."

"అమ్మ కూడా నిరసించేదా నిన్ను?"

నీల నవ్వింది పేలవంగా. "ఒక్కొక్కప్పుడు అందరి కంటే మిన్నగా! అది తనలో పుట్టిన బుద్ధి కాదనుకో. పెద్దక్కా, చిన్నక్కల సలహాల్నిబట్టి నడుచుకునేది నా విష యంలో. ఆ లేత వయసులో వాళ్ళప్రవర్తన నాలో ఎలాంటి విషబీజాలు నాటిందో, ఒక్కో సమయంలో క్రోధం పట్ట లేక ఎలా ఏడ్చేదాన్నో ఎవరికీ తెలియదనుకో! ఆ నాడు నా

చుట్టూ నేనొక వలయం గీసుకున్నాను. ఆ పరిధిని దాటి నా సామీప్యానికి ఎవరూ రాకూడదని, నాలో కఠోర మయిన పగతో కూడిన నిర్ణయం జ్వలిస్తూ ఉండేది. అలాగే ఉండే దాన్నిలే. అందరూ అత్తవారింటికి వెళ్ళిపోయాక మాత్ర ప్రేమలోని మాధుర్యాన్ని చవి చూశాను. ఇప్పటికీ కనిపెట్టు మా యింటి వాళ్ళ నెవర్నయినా! ఏదో పైపై మెహర్బా నీలేగానీ. నాకూ ఒకవ్యక్తిత్వం ఉంటుందని వాళ్ళకు తోచదు. అందుక్కారణ మేమిటో నాకు అనూహ్యంగా నీ, ఇంట్లోని ప్రతి వ్యక్తికీ నాపై అదొక విధమయిన వేరు భావం ఉంటుంది. అన్నిటినీ త్రోసివేసి, ఈ నాడిలా నిబ్బరంగా తిరగ్గలుగుతున్నా నూఅంటే! దానిక్కారణం నాలోని ఆత్మ విశ్వాసమే అనుకో! నేనందరికంటే వున్నతురాలినన్న అహాన్ని పెంపొందించుకో బట్టే పెరిగి పెద్దదాన్నయానేమో! నాదే పురుష జన్మ అయి ఉంటే, ఈ నిరాదరణకి బందబారి రౌడిగానో, లేక కృంగి పోయి అసమర్థుణ్నిగానో మారిపోయి ఉండేదాన్ని. ఆడ దాన్నయ్యాను కాబట్టి అన్నీ దిగ మ్రింగి ఉండగలిగాను. మిగి లింది మాత్రం అందరిపైనా ద్వేషం—

"ఏదో చెప్పవోయి ఇదంతా చెప్పావు కదూ? చూడు బాల్యంనుండీ నన్నెవరు ఎలా చూసినా, మానాన్నగారు మాత్రం అపురూపంగా చూసుకునేవారు. ఆ అపురూపమే ఇప్పుడూ ఉన్నది! దీన్ని నిలుపుకోవాలనే నా వాంఛితం కూడా! కానీ ఈ సంఘానికి....సంఘమేమిటిలే. మనవాళ్ళు అన పేరు వినబడని చోటికి పోవాలి, అనూ. హాయిగా, స్వేచ్ఛగా, విశాలంగా తిరుగాడాలి. ఇప్పుడు నేనున్న పరి సరాలన్నీ సంకుచిత మైనవే!

చెమర్చిన కళ్ళను తుడుచుకుంటూ అన్నది అనూరాధ. "ఈ లేతవయసులో ఎలాంటి మానసికా వేదన పొందుతున్నావు నీలూ? మనం ఎప్పటికీ ఈ కుళ్ళు మనుషులదగ్గరుండొద్దు. ఆ వివాహం అనేబంధాన్ని మెడకేనాడు తగిలించుకుంటామో ఆ నాడిక ఈ సంకుచిత వాతావరణం నుండి విముక్తి ఉండదు. సరికదా, అనేక సమస్యల్లో, చికాకుల్లో మునిగి తేలుతుండాలి. నువ్వూ, నేనూ ఉద్యోగాల్లో జేరిపోతే మన జీవనానికి లోటుండదు. ఆ క్షణం కోసం ఎదురు చూద్దాము."

అంత వరకూ ఏర్పడ్డ విషాదాన్ని తుడిచి వేస్తున్నట్టు నవ్వింది నీల. "మనకు విచార మెందుకు రాధా? నువ్వూ, నేనూ ఒక్కటయినప్పుడు సాధించని కార్యం అంటూ ఉందా? ఇంకా చిగురుటాకులమే కానీ. వేదాంతులు సెలవిచ్చినట్లుగా, ఈ సంసార మనే సాగరంలో ఈదులాడుతూ, మునగానాం తేలానాం అన్నట్టు కాకుండా, సన్యాసం పుచ్చుకోక పోయినా, కనీసం సన్యాసుల మార్గంలోనే శాంతినీ, సుఖాన్నీ అన్వేషించి పట్టుకుందాము. అసాధ్య మంటావా?"

"ఏ నాటికీ కాదు."

"ఇద్దరం ఒకేసారి కాలేజీల్లో ప్రవేశిస్తున్నాం కదూ? ఒకే కాలేజీలో జేరుదాం రాధా!"

"ఏదీ అనుకోవద్దు నీలూ. పిన్ని దగ్గర కాకినాడలో పెట్టి చదివిస్తానంటూంది అమ్మ. మరి నేను కూడా నీతో పాటు హాస్టల్లో చేరాలంటే డబ్బుకావాలిగా? పంటలమీద వచ్చే ఆదాయమేగానీ, ఇంకో ఆధార మేముంది? అమ్మని కష్ట

పెట్ట కుండా చదువుకుంటే కొంతలోకొంత సంతృప్తి ఉంటుంది."

నీల ఏమీ మాట్లాడ లేకపోయింది. డబ్బుండి కూడా ఆర్థికంగా స్నేహితురాలికి సాయం చెయ్యలేని అస్వతంత్రత ఆమెలో ఒక సిగ్గుతెరను కప్పింది. కానీ.......తామిద్దరూ స్వేచ్ఛా లోకాల్లోకి ఎగిసి పోతారు, గాలిలో పిట్టలవుతారు. ఆ భావన ఆమెలో దీపింప జేసింది.

నెచ్చెలుల మనసులు రెండూ ఉద్వేగంతో నిండి పోయాయి. తాము వూహించు కున్న లోకంలోకి అప్పుడే అడుగిడుతున్నట్లని పించింది. కాదనే వాస్తవం లోకి రాగానే, ఆ భావనా లోకంలోకి పోవాలనే ఆకాంక్ష అధికమయింది. పరిపరి విధాల పోతున్న యోచనా హృదయంతో చందమామ కేసి చూస్తూ ఉండిపోయారిద్దరూ!

## 15

పరీక్షా ఫలితాలు తెలిశాయి. సెకండ్ క్లాసులో పాస యింది నీల. అనూరాధ, విజయ పాసయ్యారు.

నీల తన నిర్ణయం మార్చుకోనేది లేదని తెలిసిపోయింది రాఘవయ్యగారికి. "పోనీ, నాకు నీల ఒక మగ పిల్లవాడను కుంటాను. ఈ వ్యాపారం, ఆస్తులూ చూచుకోడానికి నాకు మాత్రం ఎవరున్నారుగనుక ;" అనుకున్నారు. నీలపై ఆయన కున్న విశ్వాసం అటువంటిదీ అంటే, ఆమెను ఒంటరిగా ఈ లోకంపై విడిచి పెట్టినా నెగ్గుకు రాగలదని ప్రగాఢ నమ్మకం ఆయనకుంది. తల్లి పోయిన బెంగతో కూడా కూతురు క్లాసు

తెచ్చుకోవడ మనేది తండ్రిలో ఒక ఆనంద తరంగాన్ని లేపింది. ఫలితాలు తెలిసిన దగ్గర్నుండీ నీలకు ఉత్సాహంగా ఉంటూంది.

"ఎక్కడ చదువుతావమ్మా!" అన్నారు రాఘవయ్య గారు ఒకనాడు కూతుర్ని పిలిచి.

"నీ ఇష్టం నాన్నా! చోటేదయినా ఫరవాలేదు. కానీ. ఉమెన్స్ కాలేజీలో చదవాలని ఉంది."

ఆ మాటే సంతోషాన్నిచ్చింది రాఘవయ్యగారికి. ఆ వేళ నాలుగయిదు కాలేజీలకు ప్రోస్పెక్టస్ కోసం వ్రాశారు. మర్నాడు ఛాయా, భారతులనుండి ఉత్తరాలు వచ్చాయి. చెల్లెళ్ళు పాసయినందుకు, ఇద్దరూ తమ హర్షాన్ని వెలిబుచ్చుతూ చదువులు కొనసాగించ వలసినదిగా సలహా ఇచ్చారు.

"నువ్వు కాలేజీలో జాయినవుతావను కుంటాను. జాయి నయినట్లయితే ఇక్కడికే వచ్చేయ్. ఇక్కడ ఉమెన్స్ కాలేజీలో పిల్లల్నీ నన్స్‌నూ వారందరి యూనిఫారంనీ చూసినప్పుడల్లా నువ్వే గుర్తుకు వస్తావు. నీలోని ఉత్సాహానికీ, నీ భావోద్వే గానికీ ఈ వాతావరణం అతికినట్లు సరిపోతుంది. హాస్టల్లో ఉండాలన్న బాధకూడా లేదు." అంటూ ఇంకేవేవో వర్ణిస్తూ రాసింది ఛాయ.

ఒక సమస్య తీరిపోయినట్లనిపించింది రాఘవయ్యగారికి. నీలకోసం బట్టలూ, మొదలయినవి తీసుకున్నారు. అనూరాధా నీలా కలసి వెళదామని నిశ్చయించి కున్నారు. మర్నాడే ప్రయాణం. ఇంటిని విడిచి అత్తవారింటికి పోతున్నట్లు ఒక వంక సంతోషంగానూ, ఇంకో వైపు విచారంగానూ ఉంది నీలకు

అక్కచెల్లెళ్ళిద్దరూ ఒకరికొకరు ధైర్యం చెప్పుకున్నారు. విజయ హెచ్.ఎస్.సి. లో చేరింది.

మర్నాడు పనివాణ్ని తోడిచ్చి స్టేషను దాకా వచ్చి దిగబెట్టారు రాఘవయ్యగారు. "ఒక్క నెల కాగానే వస్తానమ్మా! ఇంటిమీద బెంగ పెట్టుకోకు. స్టేషనుకు రమ్మని వైరిచ్చాను భారవికి. అడ్మిషను సంగతి అంతా తనే చూసుకుంటాడులే. నీకాభయం అక్కర్లేదు. నేనిచ్చిన ఉత్తరం అతనికిచ్చేయి." అని కూతురుకి ధైర్యం చెప్పారు.

ట్రెయిను ప్లాట్‌ఫారం విడిచి బయలు దేరగానే కన్నీళ్ళుబికాయి నీలకు. అనూరాధ నవ్వుతూ మందలించింది. "పిల్లా, బేలవయి పోతున్నావు. పయనిస్తున్నది వైజాగు వెళ్ళే ట్రెయినులో కాదు. మన ఆశయాల రైలు పెట్టెలో! కలవారి అమ్మాయి కలికి కామాక్షీ! తుడుచుకో కన్నీళ్ళు. ముడుచుకో కురులు."

నీల కళ్ళు తుడుచుకొని నవ్వు తెచ్చుకుంది. ట్రెయిను మధ్యమధ్య ఆగుతుండడం, బయలుదేరడం కూడా గమనించకుండా దారి పొడుగునా కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారిద్దరూ. ఒకర్ని వదలి ఒకరు ప్రవాసాలకు పోతున్నట్లుగా భావించుకున్నారు.

వాల్తేరు స్టేషను చేరుకొనేసరికి మూడు గంటలయింది. ట్రెయిన్ దిగి ఇద్దరూ చేతులు కలుపుకొని నించున్నారు, దుఃఖంతో మాటలు పెగిలి రావటంలేదు.

ఆఖరికి నీల గొంతుక పెగల్చుకుంది. "నాకు ధైర్యం చెప్పి నువ్వేడుస్తున్నావా? ఛ!"

• 
. .

"లేదు."

"ఏమిటిలేదు? వెళ్ళగానే ఉత్తరం రాస్తావు కదూ! నేను రాస్తాలే! ఏదైనా మాటాడు అనూ" గాద్గదికంగా అంది నీల.

"ఏం మాట్లాడను? కొన్ని యుగాలుదాకా కలుసుకోమేమో అన్నట్లుంది." కన్నీళ్ళతోనే నవ్వింది అనూరాధ.

"మళ్ళా రైలెక్కి పోతారా ఏమిటి, నీలా? నేను నీ కోసం కంపార్టుమెంట్లన్నీ గాలిస్తుంటే మధ్యలో నించున్నారా ఇద్దరూ?" భారతి మందహాసంతో వచ్చి నిలబడ్డాడు.

"బావున్నారా?" అంటూ అనూరాధను పలకరించాడు తల ఊపి సమాధానమిచ్చింది అనూరాధ.

"అక్క రాలేదా బావా?"

"ఉహూ—నీ కోసం తయారుగా ఇంట్లో అంతా చేసి ఉంచుతుందట. నువ్వొస్తావని పండావుడి చేస్తూంది."

చాలా సేపు నించుండి పోయారు ముగ్గురూ. ఇంజను కూత వినిపించగానే "ఎక్కండి" అని తొందర చేశాడు భారవి అనూరాధను. విడువ లేక, విడువ లేక విడిపోయారు మిత్రులిద్దరూ. టాక్సీని పిలిచాడు భారవి.

"రిక్షాలో వెళ్ళిపోతే సరిపోదూ?" అంటూ అడ్డు పెట్టింది నీల.

సామానూ, మనమూ! టాక్సీ అయితే గొడవుండదు. వూఁ—ఎక్కు!" అని భారవి తొందర పెట్టాడు.

తారు రోడ్డుపై మెత్తగా సాగి పోతూంది టాక్సీ. తల్లి జ్ఞాపకాలు నీల కొక్కసారి చుట్టు ముట్టాయి. తమ ఇంటి

దీపం ఎక్కడారి పోయిందో, ఆ స్థానంలోనే తన ఆశాజ్యోతిని వెలిగించు కోడానికి వెళ్ళుతూంది.

"అమ్మా, ఇక్కడే మమ్మల్ని దిక్కులేని వాళ్ళను చేసి పోయావు! నీ చల్లని చూపే నాకిక దారి చూపించాలి." అనుకుంటూ ఉంటే గుండెంతా బరువెక్కి పోయింది.

నీల ముఖం చూస్తూ, తల్లిగురించే ఆమె ఆలోచిస్తూ ఉందని గ్రహించాడు భారవి.

"ఏమిటాలోచిస్తున్నావు నీలా? ఇంకా ఆ బెంగతోనే ఉంటున్నావా?"

ఆలోచనలోనుంచి తెప్పరిల్లిన నీల ఏం మాట్లాడ లేదు.

"నిన్ను మళ్ళీ చూస్తుంటే నాకు గుండెంతా తేలికయి పోయినట్టని పిస్తూంది, నీలా! పోగొట్టు కున్న శాంతి మళ్ళీ లభించ బోతూందని ధైర్యం కలుగుతూంది."

భారవి ధోరణి ఏమీ మారలేదని అర్థమైంది నీలకు. ఇన్నాళ్లు అతని మనసు గురించి తానేనాడూ ఆలోచించలేదు. స్టేషనులో నిండైన స్వాగతం ఇవ్వగానే కలతలన్నీ సమసిపోయాయనీ, సంతృప్తి పడింది. "అయితే ఈ హాసోల్లాసం కేవలం తనను చూచిన తర్వాతేనా? ఇలా అనుకుంటే ఆమె మనసుకేం నచ్చటంలేదు.

నీల ఏమీ మాట్లాడక పోవటం చూచి, భారవి కూడా కాసేపటి వరకు ఏమీ మాట్లాడలేదు. ఆ తరువాత అందరి యోగక్షేమాలూ అడిగి తెలుసు కున్నాడు. నీల అన్నిటికీ పరధ్యానంగానే సమాధాన మిచ్చింది.

గేటు దగ్గర టాక్సీ ఆగగానే ఛాయ పరుగున వచ్చి చెల్లెల్ని దగ్గరకు తీసుకుంది.

"ఎంత చిక్కి పోయావే! అమ్మ ఉంటే నిన్నిలా ఉంచేదా ?" కళ్ళమ్మట నీళ్లు జలజలా రాలాయి.

"అమ్మ ఉందనుకొనే ఇంకా ఇలా ఉన్నానక్కా !"

కళ్లొత్తుకుంటూ ఇద్దరూ ఇంట్లోకి నడిచారు. ఛాయ పేరుపేరునా అందరి విషయాలూ అడుగుతూంటే నీల ఓపిగ్గా జవాబిస్తూంది.

భారవి బూట్లు విప్పి ఈజీ ఛైర్ లో వాలాడు. "మీ కబుర్లు తరువాత! ఈ దానవుడికి కొంచెం అమృతమిచ్చి ఏ దేవతలైనా పుణ్యం కట్టుకుంటే—

ఛాయ స్టౌ వెలిగించడానికి గదిలోకి వెళ్ళుతూ, "దేవతలకు పుణ్యం అక్కర్లేదు లెండి. అమృతం వారికే ఇస్తారు. దానవులు కాబట్టే ఆఫీసునుండి అలా స్టేషనుకి వెళ్ళిపోయారు. కాస్త ఇంటికి వచ్చిఅడిగారూ అంటూ దెప్పి పొడిచింది.

"అదేమిటి ప్రొద్దుట అడిగితే రానన్నావుగా ? ఇంకెందుకని ఆఫీసునుండి అలా వెళ్ళి పోయాను ! అయితే రానంటే వస్తానని అర్థం అన్నమాట. సరేలే. ఈ సారి వద్దన్న పనే చేస్తాను. నాదేం పోయింది ?" అన్నాడు భారవి టేబిల్ పైనున్న వార పత్రికను చేతుల్లోకి తీసుకుంటూ.

"మనిషికి మాటల్లోని చమత్కారమే !" అంటూ గొణుక్కొని నవ్వుకుంది ఛాయ. ఇద్దరి సంభాషణా విని మనసు

తృప్తి పరుచు కోడానికి ప్రయత్నిస్తూ సబ్బూ, టవలూ తీసు కొని స్నానాల గదికి వెళ్ళింది నీల.

రాత్రి ఎనిమిదిన్నరకు భోజనాలూ అన్నీ ముగిశాయి, ఫెన్సింగులో కుర్చీలు వేసుకొని కూర్చున్నారు ముగ్గురూ. ఇంటిలోనుండి వెలుగు వచ్చి వరండామీద పడుతూంది. రేడియో లోంచి భానుమతి కంఠం చల్లని గాలికి తోడై మరింత చల్లగా వినిపిస్తూంది. "గాలుల తేలెను గాఢపు మమతలు, నీలివు మబ్బుల నీడలు కదిలెను అందెల రవళులా......"

"ఇంకేమిటి విశేషాలు ?" సిగిరెట్ వెలిగించుకుంటూ అడిగాడు భారవి,

నీల తడుము కోకుండా, "ఈ సిగిరెట్ పొగని మా అక్క ఎలా భరిస్తుందా అని నా ఆశ్చర్యం బావా! అంది.

"సారీ! అయితే పారేయ మన్నావా ?"

ఫర్వాలేదు, ఆ ధూమాన్ని మామీదే పారద్రోలకుండా ఉంటే చాలు !"

"నయమే. చెప్పి, చెప్పి విసిగి పోయాను. ఆదివారం వస్తేచాలు. గది నిండా సిగిరెట్ పొగ తప్ప ఇంకేమీ ఉండదు. ముక్కు మూసుకొని వంటింట్లో జపం చేస్తాను నేను." అంది ఛాయ తన విసుగును మాటల్లోనే చూపిస్తూ, భారవి నవ్వా డంతే గాని జవాబియ్యలేదు. కాసేపు ముగ్గురూ మౌనంగా కూర్చున్నారు.

"కాలేజీ కెళుతున్నా నంటే ఎందుకో భయంగా ఉంది. ఎలా ఉంటుందో! అంతా కొత్త !"

ఏమీ ఫరవాలేదులే. రోజూ నేను చూస్తుంటానా స్టూడెంట్స్‌ని. అందమైన యూనిఫారం వేసుకొని వెళ్ళి పోతూ ఉంటారు. ఇంకా ఆ నన్స్‌ని చూస్తుంటే మరీ సరదా వేస్తుందనుకో. కంటికి చల్లగా తెల్లటి డ్రెస్సులో ఎప్పుడూ నవ్వు ముఖాలతో ఉంటారు. వాళ్ళందర్నీ చూస్తుంటే. నేనూ ఓ స్టూడెంటు నయిపోతే బావుణ్ను, ఎందుకొచ్చిన పెళ్ళి అని పిస్తుందనుకో. ఎందుకూ ఎలాగా రేపు వెళ్ళి పోతున్నావు కదా? చూద్దువుగాని!"

"పోనీ నువ్వు కూడా చేరిపోరాదూ? ఉద్యోగం చేస్తే నాకొంచెం సాయం!" అన్నాడు భారవి భార్య వంక చిలిపిగా చూసి

"పాపం! తమరెక్కడ ఉంటారేం?"

"ఏం చేస్తాం? విధి లిఖితం తప్పుతుందా? పిచ్చి సన్యాసుల్లో కలిసి పోతాం."

"మాటాడితే ఇదొహటి నేర్చారులెండి." అంది ఛాయ చిరుకోపంతో.

"సకుటుంబ సన్యాసమా బావా?"

ముగ్గురూ నవ్వుకున్నారు.

"బడలికగా ఉందక్కా! ఈ చల్లటి గాలికి నిద్రకూడా వస్తోంది."

"నిజమే. పద నీ కోసం నీ చదువు కోసం అని ఒక గది కూడా ప్రత్యేకించాను. ఈ ఇల్లు మాకు కొంచెం పెద్దదయి పోయిందిలే." అంది ఛాయ లేస్తూ.

•

• •

"పది మంది పిల్లలున్న కుటుంబానికయినా ఒక్క గది కూడా దొరకటం కష్టమై పోతున్న ఈ రోజుల్లో ముఖ్యంగా విశాఖలో, మాకిది దొరకటం అదృష్టమే ననుకో!" అంటూ ఛాయ వంక తిరిగి "ఇంకెన్నాళ్ళులే ఓపిక పట్టూ!" అన్నాడు భారవి కనుకొనల్లో కొంటెదనాన్ని చిందిస్తూ. ఛాయ తల వంచుకొని ముసిముసి నవ్వులు నవ్వింది. ఒక్క ఐదు నిముషా లకు అర్థం చేసుకున్న నీల లేచి నుంచుని చాటంత ముఖంతో "కంగ్రాచ్యులేషన్స్! ఇద్దరికీ!" అన్నది. ఆ పైన ఏమనాలో తోచలేదు.

"రాంవే" అంటూ ఛాయ లోపలకు నడిచింది. నీలకోసం ప్రత్యేకించ బడ్డ గది బాగానే ఉంది కిటికీ దగ్గర మంచం, పక్కనే టేబిల్, చిన్న బీరువా. రెండు కుర్చీలు. గోడకు రెండు మూడు సినిమా తారల కేలండర్లూ!

గదిని పరికిస్తున్న నీల కాలండర్ల వంక చూస్తూ. "అన్నీ బాగున్నాయిగానీ, అక్కా ఆ సినిమా తారల కేలండర్లే నాకు నచ్చవు. ఇంకొద్ది రోజుల్లో చూడు వాటి స్థానాల్లో ఏముం టాయో!" అన్నది.

"నీ పెయింటింగ్స్ పెడతావు కాబోలు. మంచివి రెండు సీనరీలు వేసియ్యి. ఈ కేలండర్లతో నేనూ విసిగి పోయాను." అన్నది ఛాయ.

నీల మంచం మీద వాలి, కిటికీ నుండి వచ్చే చల్లటిగాలి లోని హాయిని అనుభవిస్తూ, నన్ను ప్రొద్దుటే లేపడం మరచి పోకు అక్కా!" అంది.

"అప్పుడే పడుకుంటావా ఏమిటి?" అంది ఛాయ.

"ఏం ?"

"రాక రాక వచ్చావు. ఇక చదువులో మునిగిపోతావు ఏమన్నా కబుర్లు చెప్పకుండా మనీ !"

"వోహో ! చదువులో పడి ప్రపంచాన్నే మరచి పోతా ననుకున్నావా ? అదేం కాదక్కా ! మైండ్‌కి రిలీఫ్ ఇస్తుం డాలి అప్పుడప్పుడూ, సరే, ఇలా పడుకొని ఎన్ని కబుర్లయినా చెబుతాను. రా కూర్చో."

ఛాయ వచ్చి నీల ప్రక్కన కూర్చుంది. నీల సర్దుకుంది. "చెప్పు. ఏం కబుర్లు చెప్పను ? అది సరే. ఎలా ఉందక్కా వైజాగు జీవితం ?"

"ఏం, వైజాగులేవే. నా జీవితమే మారి పోయిందీ వైజాగులో. బాగుందిలే."

నీలలో చిందులు తొక్కే చలాకీ తనమంతా మాయ మైంది, గుండె గుబగుబ లాడింది. అదేదీ పైకి కనిపించ నీయ కుండా ప్రయత్నించింది.

"అవును మరి. ఇన్నాళ్ళూ పుట్టింట్లో గ్రామీణ జీవితం· ఇప్పుడు కాపురం పట్నవాస జీవితం."

"పోవే, ఏమీ తెలియనట్టు నటిస్తావూ ! నీ జీవితంలోని మలుపు నీకు తెలీదా ? అవును, మరి ఇద్దరు కలిసి ఎంత నాటకం ఆడారు !"

"భగవాన్ ! రాగానే ఏమిటీ అభాండం ! నీలకు ప్రపంచమంతా గిర్రున తిరుగు తున్నట్టనిపించింది.

"నాటకమా ?"

ఛాయ మొహం అటుతిప్పుకుని "ఊఁ—నిన్నేమీ అనే యనులే. మామధ్య కలతలు రావటం అన్నీ అణగి పోవటం అన్నీ అయిపోయాయి. కొత్తలో నిన్ను అపార్థం చేసుకున్నా ఆ తర్వాత నిన్ను, నిన్నుగా అర్థం చేసుకున్నాను. ఇప్పుడు ప్రశాంతంగా సాగిపోతూందిలే. వింటావా. ఏమిటి ? అదంతా ఎలా జరిగిందో ?" అంది.

నీల ఏమీ మాట్లాడలేదు. ఛాయ మాటలు ఆమెను సందిగ్ధంలో పడేశాయి.

"నువ్వు చెప్పక పోయినా, నాకు తెలుసులే. నీకు వినాలని ఉంటుందనీ. చెబుతాను విను."

కంపిస్తున్న గుండెను చిక్క బట్టుకొని వినడానికి సిద్ధ పడింది నీల.

ఏవో స్మృతులన్నీ కళ్ళముందు కదులు తున్నట్లుగా ఎటో చూస్తూ అన్నది ఛాయ. "ఎక్కడ నుండి మొదలు పెట్ట మన్నావు?" ఆమె మొహంనిండా ప్రసన్నత పరచుకొని ఉంది.

మనసులోని ఆంధోళన దాచుకుంటూ "నీ ఇష్టం నాకెలా తెలుస్తుంది ? మొదటినుండీ చెప్పు?" అన్నది నీల.

ఛాయ నీల వంక తల తిప్పి చిరునవ్వు నవ్వింది. "ఒకందుకు నిన్ను అభినందిస్తున్నానే నీలా ? నీవు నా దగ్గర ఎటువంటి భావాలని మాటల ద్వారా వ్యక్త పరుచు తుంటావో, అదే భావ పరంపరను కనీసం ఒకే పదమైనా తేడా లేకుండా ఆయన నోటివెంట వింటూంటాను. ఇద్దరు వ్యక్తుల మనోగతాభిప్రాయాలు ఇంతగా కలుస్తాయా అన్నది నాకు మాత్రం

వింతైన విషయమే. నీమనసెలాంటిదో నా కంటే ముందుగా ఆయన తెలుసు కున్నారు. అందుకే తన ఆవేదనంతా నీతో చెప్పుకో గలిగారేమో !"

కాసేపు ఆగింది ఛాయ. "ఇప్పుడయితే అంతా సర్దుకొని కాలం తిన్నగా నడిచి పోతూంది కానీ, అబ్బ మొట్ట మొదట నేను పడిన బాధ! మా సంసార సాగరాన్ని కలచి వేసిన సుడిగుండాలు! అవన్నీ తలంచు కుంటూ ఉంటే నా ఒళ్లు జలదరిస్తూ ఉంటుందనుకో. ఈయన ఒక ఉన్మాది లాగా ఉండేవారు. ఎప్పుడు చూచినా ఏదో దీర్ఘాలోచనలో మునిగి పోయి, కళ్ళు ఎర్రగా జ్వలించి పోతూండేవి. శిరోవేదనని భరించలేక కణతలు నొక్కుకుంటూ ఉస్సురుస్సురని ఒక్కలాగే నిట్టూర్చుతూ ఉండేవారు. కారణం అవగాహన అయ్యేది కాదు. దగ్గిరకి వెళ్ళడానికే జంకుతుండే దాన్ని. భోజనం దగ్గర కంచంలో చెయ్యిపెట్టి నా ముఖం లోకి క్రోధంగా చూస్తూ ఆఖరికి తినకుండా లేచి పోయేవారు." ఛాయ గొంతు జీరవోయింది. "ఎందుకు నన్నిలా బాధ పెడతారు? అంత కష్టమయితే నాకు విడాకులిచ్చి మీకు నచ్చిన పిల్లను చేసుకోండి—అనేదాన్ని. ఆ మాటకు మాత్రం నవ్వుతూ— సరే చేసుకుంటాను. ఆ మాత్రం త్యాగం చెయ్యగలవు కదా— అనేవారు. అంతేకాని, ధోరణిమాత్రం మారేది కాదు. తన ఆవేదనను నేనూ పంచుకుందామనీ, తనని ఓదార్చుదామనీ, ఎంతగానో ప్రయత్నించే దాన్ని! కానీ... నేను ఆయన్నుండి స్వీకరించేది మాత్రం ఒక్కటే మాట. నన్ను విసిగించకు. వెళ్ళి పో. నన్ను ఇలా ఏడవనీ—అని. అలాగే ఒక రాత్రి చెట్టంత మనిషి కుళ్ళి, కుళ్ళి ఏడ్చేవారు. దూరంగా ఉండి అంతకు

రెట్టింపు గుండెల్ని పగుల గొట్టు కోవటం తప్పించి, ఇంకేదీ చేయగలిగే దాన్ని కాదు." చెమర్చిన కళ్ళను తుడుచుకుంది. ఛాయ "ఆయనది వెన్నలాంటి హృదయం నీలా! ఆ వెన్నలో ఎవరు విషాగ్ని పోశారో, లేక ఆయనకే ఆ దుర్బుద్ధి పుట్టిందో కాని, ఇప్పటికీ నా మనసులో ముల్లులాగ గుచ్చుకుపోయింది. ఒక్కరాత్రి భయానకంగా కాళరాత్రిలా గడిచేది. అర్ధరాత్ర ప్పుడులేచి—ముందు నా ఎదుట నుండి వెళ్ళిపో—అనేవారు. నన్నా సమయంలో హత్య చెయ్యడానికి కూడా వెనుదీయ రేమో అనిపించేది. అంతేకాని, తన ఆవేదనని నాతో పంచు కోలేక పోయారు. అర్ధాంగిగా ఆ విషయంలో పనికి రాలేక పోయాను."

నీల తదేకంగా అక్కవంక చూస్తూ వింటూ ఉంది.

"ఒక్కోరాత్రి చెంప దెబ్బలు కూడా తినేదాన్ని. కానీ నా కన్నీరు చూడగానే కరిగిపోయి మళ్ళీ వూరడించే వారు. ఇలాగే అయోమయంగా గడచింది చాలాకాలం. మళ్ళీ అటు వంటి చెడు కాలం నా జన్మలో అనుభవించ డానికిష్ట పడను నేను." కన్నీరు తుడుచుకొని, "ఇదంతా నీకేమీ అర్థం కాదు కదూ! అర్థం అవుతుందిలే విను." అంటూ చెప్పుకుపోసాగింది ఛాయ.

"ఒక రోజు—ఆయన కాంపు కెళ్ళిపోయారు. ఆ రోజు పని మనిషి చేత ఇంట్లో చెత్తంతా తుడిపిస్తున్నాను. ఆయన ఫైల్సు, ఏవో పుస్తకాలూ బుక్ షెల్ఫులో ఉండేవి. ఒక ఫైలు తీసి దుమ్ము దులుపు తున్నాను. అందమైన కవరొకటి జారి పడింది. అప్పటి సరికి దానిమీద కుతూహలం లేదు సుమా!

యాదాలాపంగా తెరిచి చూశాను...అందులో ఉన్నది ఆయన వేదనా హృదయమంతా, అప్పటి నా స్థితిని ఎలా మాటల్లో చెప్పాలో తెలియటం లేదు. ఆ కాగితాల్లో సారాంశ మంతా చదివాక తల గిర్రుమని తిరిగి పోయింది. నీ మీదా, ఆయన మీదా పట్టరాని ద్వేషం కలిగింది. గుండెల్లోని భారం తీరే వరకూ ఏడ్చాను. ఆయన నీకు వ్రాసి పోష్టు చెయ్యకుండా దాచుకున్న ఉత్తరాలూ, తన మనో వేదనని ప్రతిబింబించే డైరీల్లాంటి కాగితాలు అవి,

కాంప్ నుండి ఆయన వచ్చాక ఏమాత్రం ఆలస్యం లేకుండా దులిపేశాను. ఈ హఠాత్సంఘటనకు తను ఏమాత్రం జంకకుండా నిశ్చలంగానే సమాధానాలిచ్చారు. అదంతా ఇప్పుడు నేను చెప్పలేనులే. మొత్తానికి నీవు నిర్దోషివని మాత్రం నాకు తెలియ జెప్పారు. ఆ కాగితాలూ, అవీ తెచ్చిస్తాలే. చదువుకొని నిద్ర పోదువుగానీ! ఇప్పుడు మునుపటి కంటే నాకు మక్కువ అధికమైందంటే పొంగిపోవు కద!" చిలిపిగా అన్నది ఛాయ.

ఏదో భారం తీరినట్లుగా గాఢంగా నిశ్వసించింది నీల. చేతుల్ని వెనక్కు విరుచుకుంటూ అన్నది. "బాగా చెప్పావక్కా!"

"ఆగాగు. అంతటితో అయిపోయిందను కున్నావా? కథ. మరి తన అనుమానం సంగతి ఏమైందని అడగవేం? అసలా విషయంలోనే మేమిద్దరం చాలాకాలం ఒకరి కొకరు ఏమీ కానట్లు ప్రవర్తించాం. ఘర్షణంతా అయ్యాక, మీ కిలాంటి అనుమానం ఎందుక్కలగాలని అడిగాను. ఆయన

పాదాల మీద తల పెట్టి కొట్టుకున్నాను. నన్నేమయినా చెయ్యండి గానీ, శంకించి చిత్రవధ చెయ్యవద్దని వేడుకున్నాను ఎంతకీ తన ధోరణి మారలేదు. తను చూసిన సంఘటనలని చెప్పారు. నీకు తెలిసే ఉంటుంది. నా నోటితో చెప్పలేను. మనదోషాలన్నీ ఒప్పుకుంటే తనకి సంతృప్తిగా ఉంటుందట. నేను అబద్ధమాడుతున్నాననే విషయమే తనని అధికంగా బాధిస్తూందిట. అంతకు మించి ఇంకో కోపమే తన మనస్సులో లేదట. ఏం చెయ్యాను? ఈ విధంగా ఒక నెల రోజులు సాగింది చివరకి నేను చేయని నేరాన్ని చేశానని ఒప్పు కున్నాను. అలా ఒప్పుకున్నా తను శాంతిస్తారని, కొన్నాళ్ళ కయినా నిజాన్ని గ్రహించక పోరని అదొక వెర్రి ఆశ! మా లాంటి మనుషుల్ని నువ్వెక్కడయినా చూశావే, నీలా? ఇప్పటికీ మేమెంత అన్యోన్యంగా ఉంటున్నా, అప్పుడప్పుడు మా మనసుల్ని విషం పురుగులాంటి ఆ విషయం కలిచి వేస్తూనే ఉంటుంది. ఏం చెయ్యాను చెప్పు? తను నన్నర్థం చేసుకొనే వరకూ, తన దృష్టిలో దోషిగానే ఉండటానికి నిశ్చయించు కున్నాను." ఛాయ కండ్లలో నీరు; ముఖంలో నిశ్చలత! "తన దగ్గర ఈ ప్రసక్తి ఏదీ తెలియనీకు. నీకు ఈగొడవలన్నీ చెప్పొద్దన్నారు. నువ్వు బాధ పడతావని. నా మనసుండక చెప్పాను. వచ్చీ రాగానే ఈ సోదితో నీకు విసుగు పుడుతుందేమో! నిద్రపో." ఛాయ లేస్తూ అన్నది. "ఇదుగో ఇలా ఆలోచించు కున్నప్పుడు కాసేపు ఏడుస్తాను. మళ్ళా మామూలే. సరే నేను వెళతాను. ఫాను వేసుకుంటావా?"

"వద్దు, గాలి వీస్తోంది..." ఇంకేవో అడగాలన్నట్లు ఆగిపోయింది నీల.

నీల ముఖంలోకి చూచి గ్రహించిన ఛాయ నవ్వుతూ "ఆ కాగితాలు తెమ్మన్నావా? ఏమిటే?" అన్నది.

"ఎందుకులే?" నీల ఇబ్బందిగా కదిలింది.

"తెస్తానులే. చదివాక పరుపు క్రింద దాచేయి. రేప్రొద్దుట నేను తీసుకుంటాను!"

ఛాయ వెళ్ళి కాస్సేపట్లో ఒక కవరు తెచ్చి ఇచ్చింది. తలుపు దగ్గరకు వేసుకుని వెళ్ళిపోతూ, "మనసులో ఏదీ పెట్టుకోక హాయిగా నిద్రపోవే." అంది. నీల జవాబివ్వ లేదు.

ఛాయ వెళ్ళిపోయిన దిక్కుకేసి కాసేపు చూసి, లేచి కూర్చుని, కిటికీకి చేరబడి కవరు విప్పింది నీల. కాగితాలు విడి విడిగా మడిచి ఉన్నాయి. ఆమెగుండె కొట్టుకుంటున్నది. ఎద ఝల్లు మంటున్నది.

ఒక్కొక్క కాగితమే విప్పిచూసి, చివరికి తనకు వ్రాసిన లేఖల్లో ఒకటి తీసి చదువ నారంభించింది. కాంపులో ఉండగా వ్రాసినట్లుంది అది.

నెల్లిమర్ల
సంధ్యాసమయం
21–2–60

నాహృదయ రాణి! నీలూ!

ఇలాంటి పిలుపును ప్రత్యక్షంగా నీవెప్పుడు అందుకుంటావు?. ఏపనిలో వున్నా, ఎలాంటి సమయంలో నయినా, ముగ్ధమైన నీ చిరుహాసమే జ్ఞాపకం వస్తుంది. నిష్కళంకంగా

ప్రకాశించే నీ రూపాన్ని నాభావాలతో కళంకితం చేస్తున్నా నేమోనని భయంగా ఉంది.

ఇక్కడొక ప్రేమజీవి తపస్సు చేస్తున్నాడు. తన ప్రేమ దేనికోసం! తన ప్రణయరాణి కోసం! పవిత్ర శారదా నది వణుకుతూ, మిణుకుతూ, అలలు జల్లుతూ, మెల్లి, మెల్లిగా పారిపోతోంది. గట్టునున్న పొగడ చెట్లు గలగలా కదిలి, జలద రించాయి. నల్ల, నల్లని, తెల్ల, తెల్లని మేఘమాలలు చల్ల, చల్లగా మసలుతూన్నాయి. నేను ఏమీ చేయలేనని, నాదు వేడిమి మోయ కలదని, కాయవలదని, చెప్పి చెప్పి సూర్య బింబం తప్పుకుంటూంది. అప్పుడే ఈలోక మంతా – నీదు మదిలో నీవారి హృదిలో చీకట్ల ఛాయలు, ఇక్కట్ల పాయలు చేర నివ్వను. మారనివ్వను. ప్రేమ మయులగు మీకు ఇవిగో – వెలుగు వెన్నెల, జిలుగు మాలల మెలగు తారల పంచి ఇస్తా నోయ్, ప్రేమని పంచియిస్తానోయ్–అంటూ తన కిరణాల బాటలో దారి చూపిస్తున్నాడు వెన్నెలరేడు.

అది సంధ్యావేళ అని తెలుపుతూ - ఒక ప్రేమ తపస్వి ఆలపించే పిలుపు లోపలి అలుపు చూస్తూ, కలలు గాంచుతూ కనులుమూసి, మనసులో తన కన్నె తలచి, ప్రకృతి కన్నియ చిత్తరపోగా, శారదానది తత్తరపడగా, రాగమాలలే అనురాగ మాలగా, పాటలో తనుపొందుపరచి పిలుస్తూండేపిలుపు వింటూ కుహు, కుహూ, మనికలవరిస్తూ, రెక్కరార్చుకు రోజుకుంటు- శకుంతశ్రేణులు తమ గూళ్ళవైపు ఎగిరిపోతున్నాయ్.

ప్రక్కనే తమ పనులలోపడి, చక్కగా తను ప్రియుల చేతులనక్కి యుండే పడవ పడుచులు, బిక్కు, బిక్కున నక్కి

చూసే, హాయి హాయని పాడిపోయే గాన సుధలో కరిగిపోతూ "ప్రేమమయా అనురాగ ప్రియా! లేవోయి, రావోయి!అదిగో చిన్నది – నీదు చిన్నది–చూడవోయి నీమదితో వున్నది– చూడవోయ్ నీశ్వాసలోనే కరిగి దాక్కుంది"–అని హెచ్చరిస్తూ హెచ్చు మీరగ తెల్లు వేసేరు.

ఆ ప్రాంతమంతా –అతడు తన ప్రేమరాశికై చేస్తున్న ధ్యానంలోని ఏకాగ్రతకు, గానంలోని విషాదానికి చలించి పోతూంది. ఆ ప్రియుని పిలుపు విని తన ప్రేమమయి ఏవైపు నుండి వస్తుందో, అతని ముందల యెలా ప్రత్యక్ష మవుతుందో, అతని అంతరాంతరాల్లో ఎలా లీనమవుతుందో, ఏ పవనుడు తన ప్రేయసిని తనబాహువుల్లో చేరుస్తాడో, ఏ మేఘాలు ఆ తపస్వినిని తోడి తెస్తాయో– ఏ తరంగిణి అనురాగ కన్నెకు తనభావతరంగాల నందిస్తుందో, యే తారకలీ పిచ్చివానిని మధురహృదయినికి వెలుగు ఊతనిచ్చి వెంట తెస్తాయో,– అని అతనిహృదయం తహతహలాడుతూ ఎదురుచూస్తున్నది..."

కాగితం పక్కన పెట్టి, గుండె నరచేత్తోపట్టుకొని ఒక్క నిటూర్పు విడిచింది నీల. ఇదేమి ప్రేమలేఖ, గుక్క తిప్పుకో నీయకుండా గాభరా ఎత్తిస్తూంది! తిరిగి మొదలు పెట్టింది.

"......."అత డతనిలోలేడు. ప్రకృతిలోనేలేడు. ఆ పిలుపులో, తపనలో లీనమయ్యాడు. తనప్రాణసఖి శ్వాసలో నిదుర పోయాడు. ఆతని హృదయ కవాటాలు దడ, దడలాడు తున్నాయి. కన్నులు మూసుకున్నాయి. ఉచ్ఛ్వాస, నిశ్వాసలు ఉద్వేగంతో సెగలు కక్కుతున్నాయి. అప్పుడే చల్ల బడిన సంధ్యకాంతులు అతణ్ని ముంచి వేస్తున్నాయి. 'ప్రియ,

వచ్చాను. ఇదుగో, అందుకో నన్ను'. అని విన్పించింది. మధుర నాదం ఆ పిలుపులోని ఉద్వేగానికుబికిన అతని హృదయంలోని ప్రేమ ఒక వెల్లువలాగా ప్రవహించింది. చైతన్యం కలిగింది. కన్నులు తెరుచుకున్నాడు "ప్రియా! నేనే వచ్చాను. నీలోనే ఉన్నాను.—నన్ను చూడు—విన్పిస్తుంది. ఎదురుగా తన ప్రణయ దేవి! రెండు చేతుల్లోనూ ప్రోపు చేసుకున్నాడు. తనకింకేం కావాలి — ఏమీవద్దు. తనలోనేతానూ — అంజలిచేర్చి అందు కున్నాడు. మనసుతీర మద్దుపెట్టుకున్నాడు. తనకీ ప్రపంచమే వద్దు మరి. అంతె దివినుండి దేవతలు పూలు జల్లారు. అంతే నీలూ! నానీలూ! అంతే......నీతలపులలో దూరంగా వున్న నన్ను పిచ్చెక్కిస్తున్నాను. నిజంగా పిచ్చెక్కిపోయాకయినా నన్నాదు కుంటావో, లేదో!

నిరీక్షణలో....నీకోసమే....నీలోనే...

నీప్రియభారవి.

ముఖంమీద చమటను తుడుచుకుంది నీల. ఎంతో పని చేసిన మీదట అలసినట్టు ఫీలయి, తేలిగ్గా వూపిరి తీసుకుంది. ఏంతపిచ్చి! ఇంతగా తనను ఆరాధిస్తున్నాడా? "ఎందుకు బావా నీకీ ఆశలు?" అనుకుంది.

ఒక్కొక్కఉత్తరమే చదువుతుంటే అతనికలలు ఊహలు, వేదనలు అంతరాల్లో నాటుకుంటున్నాయి. ఎంతోకాలంగా తనలో గడిపినట్లు వెర్రిగా వ్రాసుకున్నాడు. చదువుతూంటే లోనుండి వాత్సల్య ప్రవాహం పొంగి వస్తూంది.

ఉత్తరాలన్నీ చదివి ప్రక్కన పెట్టింది. అతడు వ్రాసు కున్న డైరీ కాగితాలు! అవి తీసింది వణికే చేతులతో.

"ఇంత పనికిరాని వాణ్ని అయ్యానేమిటి? ఛీ, ఛీ, నా ఛాయ—నానీడలాగా నన్నంటిపెట్టుకొని వుండేఛాయ ఇంతగా దిగజారిపోయిందా?. తనని దుశ్శీల అనుకోడానికి మనసు రావటంలేదు. ఎవరో వేయి సమ్మెటలతో నాతల పగల గొడు తూన్నట్లుంది. తనకి సంతృప్తిలేని ఈ సంసారమెందుకు? నాకు హాయి లేని ఈ జీవితాన్ని భరించలేను. ఈ జీవితాన్నిక్కడికి చాలించుకొని, ఈ పాడులోకంనుండి అదృశ్య మయిపోవాలి." ఈ విధంగా తర్క వితర్కాలతో నిండి ఉన్నాయి కొన్ని కాగితాలు.

"నా సహచరిణి లేనిదే నేను బ్రతక లేను ప్రభూ నా ప్రేమని పంచుకొని, నన్ను ప్రేమించే వాళ్లు కావాలి. నా ఛాయ అటువంటిది కాదని ఏ అజ్ఞాత శక్తి అయినా వచ్చి చెబితే బాగుండును." ఇలా భగవంతుణ్ని వేడుకుంటూ దుఃఖంతో కొన్ని అసంపూర్తిగానే ఉన్నాయి.

"ముగ్ధ మనోహర భావప్రకటిత మానసురాలు! నీలా సుందరి! కరుణామయి! నడి సముద్రంల్లో కొట్టుకు పోతున్న వానికి ఒక వూత దొరికింది. రక్షింప బడ్డాను. ఆమెలో ఎందు కంత సౌజన్యం? ఎన్ని యుగాలనుండో నాతోఉండి, నన్నర్థం చేసుకొనే దానిలాగా కనిపించే యీ అపూర్వాకర్షణను ఆమెలో ఏ దేవత ప్రవేశ పెట్టిందో!" ఇలా ఉన్నాయి కొన్ని కాగితాలు! తన పేరెక్కడ వున్నా దాని కింద ఇంత కవిత్వం పిచ్చి ధోరణి! కాగితాలన్నీ మడిచి,కవర్లో పెట్టి పక్కన పెట్టింది.

ఆమె ముఖం నీరసించి పోయింది. భారవి మనసులోని ఒక్కొక్క విషయమూ, తనపై అతనికున్న ప్రణయ భావమూ

తలచుకుంటూ ఉంటే ఆమెకు నమ్మశక్యం కాకుండా ఉంది. ఒక కలలాగా తోచి, అంతలోనే సిగ్గుతెర కప్పివేస్తూంది.

లైటు తీసేసి పడుకోబోతూ "ఛ ! నేనేమిటింత వెర్రిగా ఆలోచిస్తున్నాను! తను ఎప్పుడో వ్రాసుకున్న కాగితాలవి! అదో ఉన్మాదవ స్థితిలో రాసుకున్నవి. ఇప్పటి జీవితానికి, అప్పటికీ ఎంతో భేదం ఉన్నది. నేనసలు ఇవేవీ పట్టించు కోనే కూడదు." అనుకుంది బలవంతంగా. "ఇప్పటి కయినా ఇద్దరూ ఒకటయ్యారు. అదేచాలు భగవాన్."

కానీ, ఆమెకు తెలియకుండానే ఆ ప్రశాంత నిశీధిలో నీల హృదయంలో భారవిపై ఒక అనురాగ బీజం బలంగా నాటుకు పోయింది.

## 16

భానుని వేడి చూపులు కిటికీగుండా నీల కనురెప్పలపై ప్రసరించాయి. ఎవరో లేపినట్లయి మెలకువ వచ్చింది. ఎదురుగా ఛాయ నించుని ఉంది. రేడియోలో గ్లయికోడిన్ సంగీతం భో మంటూంది. బాగా తెలివి తెచ్చుకొని, కంగారుగా లేచి కూర్చుంది నీల.

"మంచి పని చేశావే, కవరు పక్కన పెట్టుకొనే నిద్ర పోయావన్న మాట! ఏడున్నరయింది. లేస్తావా ?" అంది ఛాయ.

"నువ్వు లేచినప్పుడు లేపేయక లేకపోయావా ?"

"లేపానే. మంచి నిద్ర పోతున్నావు. ఎందుకులే అని పూరుకున్నాను. పద, తయారయి కాలేజీకి వెడుదువుగాని.

ఈ వేళ నుండీ కాలేజీ స్టూడెంటువి కదామరి !" అంది ఛాయ చెల్లెలి వంక చూసి తృప్తిగా నవ్వుతూ.

నీల కాలకృత్యాలు ముగించుకుని తయారై వచ్చే సరికి, సైకిలు తుడుచుకుంటున్నాడు భారవి. రాత్రి ఆ కాగితాలు చదివిన దగ్గర్నుండీ అతని ముఖం చూడటానికి సిగ్గుగా ఉంది నీలకు. సాధ్యమైనంతగా మామూలుగానే ఉండటానికీ ప్రయత్నిస్తున్నా, మాట్లాడేటప్పుడు మాత్రం చూపులు క్రిందకు వాలి పోతున్నాయి.

"మరదలు గారూ! వెనుక సీట్లో ఎక్కుతారా ?"

ఉలిక్కిపడి సర్దుకుంటూ "నేనా ! నయమే." అంది నీల.

"ఇది మీ వూరు కాదోయ్, వై జాగ్ ! జాగ్ !"

"కావాలంటే నడిచి వస్తాను కానీ, సైకిలు మాత్రం ఎక్కను."

"సరే. సరే. అలవాటుపడు కొన్నాళ్ళ దాకా. కొత్త నీరు కదూ ! ఇన్ని వాహనాలుండగా నడిచి పోవలసిన అగత్యమేం ? శుభ్రంగా సిటీ బస్సులో పోదాం."

కాలేజీ గేటుముందు బస్సు ఆగింది. ఇద్దరూ దిగారు. నీలకు మనస్సులో ఏదో బెరుగ్గా ఉన్నా, ధైర్యం తెచ్చుకొని అడుగులు వేయసాగింది.

చుట్టూరా సన్నని కాంపౌండు. కాంపౌండు వాల్ పొడుగునా భారంగా గుత్తులతో ఒంగిపోయి వచ్చేపోయే వాళ్లను పలకరించే రంగు రంగుల బోగన్‌విల్లా పొదలతో, పూలతో గోడ కట్టినట్టుంది. ఆకాశాన్నంటే వృక్షాల వెనుక

చిన్న, చిన్న పూల తోటలు. ఒక వైపు అందంగా కాలేజీ బిల్డింగు కన్పిస్తూంది. కాలేజీకి అనతి దూరంలో హాస్టలూ, కొంచెం దూరంలో పవిత్రమైన చర్చి గోపురం గోచరిస్తున్నాయి. తెలుపు, లేత నీలం యూనిఫారంలో, పుస్తకాలు చేతుల్లోపట్టు కొని గుంపులు, గుంపులుగా కాలేజీలో ప్రవేశిస్తున్నారు కాలేజీ విధ్యార్థినులు. అందరి ముఖాలూ హాస ప్రఫుల్లాలుగా ఉన్నాయి. కొందరు చెల్లాచెదురుగా పచ్చిక మైదానంపై నీరెండలో కూర్చుని చదువుకోవటం, కబుర్లు చెప్పుకోవడం, చేస్తున్నారు. రంగు, రంగుల చీరెలతో ఠీవిగా, హుందాగా నడిచి పోతున్నారు లేడీ లెక్చరర్లు. ఈ దృశ్యం అంతా మనోజ్ఞంగా కన్నుల పండువుగా కనిపించింది నీలకు. అన్నిటికంటే ఆమె దృష్టినాకర్షించిన వారు నన్స్. అరబ్బీల వేషధారణను పోలివుండీ, ధవళ కాంతులీనుతూండే దుస్తులలో అందరూ ఒక్క లాగే కనిపిస్తూ తీరిక అన్నది తమకు తెలియనే తెలియదన్న ట్టుగా, వెనుకనుండి ఎవరో తరుముకొస్తున్నట్లు ఠిరోజరీల చిరు చప్పుడుతో హడావిడిగా తమతమ పనుల్లో నిమగ్నులవు తున్నారు వాళ్ళు.

"ఎలా ఉంది కళాశాల వాతావరణం?" భారవి ప్రశ్న నీలను మెల్కొలిపింది.

"అంతా వింతగా కనిపిస్తూంది బావా? వీళ్ళల్లో నేను కూడా ఒకదాన్ని అవుతున్నానంటే సంతోషంగా ఉంది. అయితే ఈ నన్స్‌ని ఒకదగ్గర నిలబెట్టి చూస్తే ఏ వ్యక్తి ఎవరో గుర్తుపట్టగల మంటావా?

అందరి ముఖాలూ ఒకే మూసలో కరిగించి పోసినట్టు కనిపిస్తున్నాయి."

పగలబడి నవ్వాడు భారవి. "బలే దానివే. కాకపోతే ముఖాల మీద పేర్లు ప్రింట్ చేయించుకుంటారా ఏమిటి? కొన్నాళ్ళకు అదే అలవాటయి పోతుంది. ఆ డ్రెస్సుల్ని బట్టి అలా కనిపిస్తున్నారు కానీ......పద, పద."

ఆఫీసు గది బయట విజిటర్స్ రూమ్‌లో కూర్చుని బెల్ మోగించాడు భారవి. నల్లని రూపుతో, యూరోపియన్ డ్రెస్సుతో ఒయ్యారంగా వచ్చింది ఒక ఆంగ్లో ఇండియన్ యువతి లోపలినుండి.

"హూమ్ డూ యూ వాంట్ ?"

ప్రిన్సిపాల్‌ను కలుసు కోవాలనీ, అడ్మిషన్ కోసం వచ్చామనీ చెప్పాడు భారవి. ఆ యువతి లోపలికి వెళ్ళి పోయింది.

నీల నోటికి చెంగు అడ్డుపెట్టుకోడం చూచిన భారవి "ఎందుకు నవ్వుతున్నావు?" అని అడిగాడు.

"కాదు బావా! చూడ్డానికి హరిజన కన్యలాగా ఉంది కానీ, ఆ డ్రెస్సూ....ఆ మాటలూ..."

"గట్టిగా నవ్వకు. ఈ వూళ్ళో సగం మంది ఇలాంటి వాళ్ళే ఉన్నారు. ఇంకా చూస్తావుగా ముందు, ముందు! వీళ్ళకి తెలుగు క్షుణ్ణంగా వస్తుంది. కానీ, తెలుగంటే ఎరగ నట్టూ, అప్పుడే యూరపునుండి దిగుమతి అయినట్టూ అభిన యిస్తారు ఇక్కడ మిషనరీ వాళ్ళు నడిపే సంస్థలు చాలా ఉన్నందున ఇటువంటి వాళ్ళు అధిక సంఖ్యలో కనిపిస్తారు.

సంభాషణ ఆగిపోయింది. లోపలినుండి ఒక నన్ వచ్చింది. చేతిలో కొన్ని కాగితాలు పట్టుకొని మందహాసంతో

ఇద్దరూ లేచి నమస్కరించారు. ఆమె ప్రతి నమస్కరించి కూర్చుంటూ, "ప్లీజ్ టేక్ యువర్ సీట్స్." అన్నది. ఆమె సుందర వదనం వంకే చూస్తూ కూర్చుంది నీల.

"మీరు........" వాక్యాన్ని మధ్యలో ఆపి, "నేను ఈ హాస్టలుకి వార్డెనుని. వైస్ ప్రిన్స్‌పాల్‌ని కూడా." ఆమె నోటి నుండి సుమధురమైన ఇంగ్లీషు వెలువడుతూంది సరళమైన శైలిలో.

కాగితాలు తెరిచి ఒక్కొక్క వివరమే తెలుప సాగిందామె. కాలేజీ టైమింగ్సు చెప్పింది. యూనిఫారమ్ కొనుక్కోవాలి. క్లాసు పుస్తకాలు కాలేజీ ఆఫీసులోనే కొనుక్కోవచ్చు. ప్రొద్దుటే వచ్చేటప్పుడు కారియర్ తెచ్చుకుంటే సదుపాయంగా ఉంటుంది. డే స్కాలర్స్‌కు డైనింగ్ హాలుంది.

"క్లాసెస్ మొదలవుతున్నాయి. ఈ వేళనుండీ అటెండ్ కావచ్చు." అన్నది సిస్టర్. సందేహాస్పదంగా బావ ముఖం లోకి చూచింది నీల.

"ఈ వేళ మధ్యాహ్నం ఆఫీసుకు సెలవు పెడతానులే. పన్నెండు గంటలకు, కాలేజీ విడిచిపెట్టే టైముకు వచ్చి నిన్ను తీసుకు పోతాను. మధ్యాహ్నం అన్నీ కొనుక్కుందువు గాని. రేపటినుండి రెగ్యులర్‌గా అటెండ్ కావచ్చు.

భయం భయంగానే తలూపింది నీల. ఈ విషయమే సిస్టర్‌కు కూడా చెప్పాడు భారవి.

"భయ పడకు. నీలాంటి వాళ్ళు బోల్డుమంది ఉన్నారు." నీలకు ధైర్యం చెప్పాడు భారవి. ఫీజు చెల్లించి బయట

పడ్డాడు. సిస్టర్ స్వయంగా నీలను దగ్గరకు తీసుకొని ఆప్యాయంగా కబుర్లు చెబుతూ కాలేజీకి తీసికెళ్ళి క్లాసు రూములో ప్రవేశ పెట్టి వెళ్ళిపోయింది.

కొత్త, కొత్త ముఖాలతో, కొత్తగా చూచే ముఖాలతో క్లాసంతా కోలాహలంగా ఉంది. పి.యు.సి. క్లాసులో, కొత్తగా కాలేజీ చేరగానే, ఏదో మేరుపర్వతం అధిరోహించినంత గర్వంగా, గొప్ప తనంతో వెలిగిపోతున్నాయి ఒక్కొక్కరి వదనార విందాలు. కొత్తగా అక్షరాభ్యాసం చేశాక, పలకా బలపం పట్టుకుని బడికివెళ్ళే కుర్రాడి ముఖంలోని భావాలకు ప్రతి బింబాలుగా ఉన్నారు మరికొందరు.

బెరుగ్గా ఒక కుర్చీలోకెళ్ళి కూర్చున్న నీలకు తనలాగే మూగగా, అందరికీ దూరంగా కూర్చున్న ఓ శాల్తీ కనిపించింది. ఆ అమ్మాయి ముక్కున రవ్వ పుడక ధగ,ధగ లాడు తున్నది. చెవుల్లో రింగులు, ఒక చేతికి వాచీ, రెండో చేతికి నాలుగు బంగారం గాజులు మెళ్ళో సన్నని గొలుసూ ఉన్నాయి. అమాయకమైన చూపులతో అందరి వంకా చూస్తూంది.

ఇద్దరూ ఒకరి నొకరు చూసుకున్నారు సంకోచంతో. నీల చటుక్కున వెళ్ళి ఆ అమ్మాయి పక్కన కూర్చుంది. ఆ అమ్మాయి పెదిమలపై నవ్వు ప్రాకింది. నీల కూడా స్నేహ పూర్వకంగా నవ్వి "అంతా కొత్తగా ఉంది. మాట్లాడే వాళ్ళ వరూ లేరు." అన్నది.

"నేనూ అదే స్థితిలో ఉన్నాను. ఏమిటో చాలామంది వెకిలిగా ఉన్నారు. ఎవర్నీ పలకరించబుద్ధవలేదు. మీరు ఈ రోజే అడ్మిట్ అయినట్టున్నారు." అన్నది ఆ అమ్మాయి.

"ఊఁ! మీరెక్కడుంటున్నారు? మీకు కొంత పాత బడాలీ పరిసరాలు."

"మాది రాజమండ్రిదగ్గర ఒక పల్లెటూరు. వుమెన్స్ కాలేజీ అని ఇక్కడకు వచ్చి చేరాను. హాస్టల్లోనే వుండటం. మీరో?"

"మా అక్క దగ్గరుంటున్నాను. హాస్టల్లో బావుందంటారా.? అమ్మాయిలంతా సరదాగా వున్నారనుకుంటాను. అందరూ కలసి వుండవచ్చు హాయిగా. ఏమంటారు?"

ఆ అమ్మాయి ఏడుపుముఖం పెట్టింది. ఏడవలేక నవ్వుతూ, "ఏం హాస్టలండీ, వచ్చినదగ్గర్నుండీ ఇంటిమీదే బెంగయిపోయింది. సరైన తిండిలేదు. తెచ్చుకున్న ఆవకాయతో రెండు మెతుకులు తింటున్నాను. కానీ, ఆకలి తీరక వేడి చేసింది. కళ్ళమ్మట ఆవిర్లు వస్తున్నాయికూడాను. ఆ అన్నం కూడా తృప్తిగా చేతుల్తో తినడానికి వీలులేదు. నవ్వాను, ఫోర్కు విధిగా ఉపయోగించితీరాలి. మొదటి రెండురోజులయితే ఒడినిండా అన్నం మెతుకులు పడేసుకున్నాను. చచ్చిన ఈగలు, బొద్దింకలు బయలుదేరుతుంటాయి మధ్యమధ్యన. ఆ తరువాత ఈ రూల్సు చూస్తూంటే ఏ అర్ధరాత్రయిన గోడదూకి పారిపోదామనిపిస్తుంది. పక్కనే శ్మశానం! పక్కమీద పడుకుంటే ఎదురుగా మంటలు కన్పిస్తుంటాయి. ఏమిటోనండీ, రెండు రోజుల్నుండి ఇంటిమీద బెంగగా ఉంది." గబగబ చెప్పేసి కళ్ళు దుడుచుకుంది.

నీలకు జాలి వేసింది. శ్మశానం పేరు వినగానే కొంచెం భయంకూడ మెదిలింది మనసులో.

"అయితే శ్మశానంకూడ వుందా ఇక్కడే? ఇదుగో, మీ పేరు తెలియదు నాకు. మీరలా బెంగపడకండి, కొత్తగా ఇంటిని విడిచి వచ్చినప్పు డలాగే వుంటుంది లెండి. క్రమంగా అదే అలవాటయిపోతుంది." అంటూ ఓదార్చింది నీల.

"మీకు మీ అమ్మ జ్ఞాపకంవస్తే బెంగగా లేదూ?"

నీల పేలవంగా నవ్వి, ముఖంలోని మేఘచ్ఛాయలు కన్పించకుండా ముఖాన్ని అటు తిప్పుకుని "ఆ బెంగకి నేను అలవాటుపడిపోయాను. మా అమ్మకి మేము శాశ్వతంగా దూరం అయిపోయాము. మీరు మీ ఇంటికివెళ్తే మీ అమ్మ కనుపిస్తుంది. కానీ, మా ఇంట్లో మా అమ్మ లేదుగా! అందుకే నాకు బెంగలేదు"

ఆ అమ్మాయి నొచ్చుకుంది. "క్షమించండి. నాకు తెలీక అలా అడిగాను. మీతో పోల్చుకుంటే నా బెంగకి అర్థం లేదన్పిస్తూంది. అది సరే. మీ గ్రూపేమిటి?" అన్నది సంభాషణను మార్చడానికి ప్రయత్నిస్తూ.

"బై. పి. ఎల్. మీరో?"

"అదే మనిద్దరం ఫ్రెండ్సు కావచ్చునంటూరు."

"అవశ్యం." ఇద్దరూ నవ్వుకున్నారు ఆనందంగా,

"మీ పేరు చెప్పారు కాదు."

"నా పేరా? నర్మద. మీరో?

నేను నీలాసుందరి నండీ."

"అబ్బ. ఎంతందంగా చెప్పుకున్నారండీ."

. . . .

"మరి నీలంగా వుంటాననుకదూ! అందుకు."

ఉన్నట్టుండి గోలంతా సద్దుమణిగిపోయింది. బల్లలూ కుర్చీలూ జరుపుకుంటూ అందరూ తోప తొక్కిరిగా లేచి నించున్నారు.

"గుడ్ మార్నింగ్ సిస్టర్!" అన్నాయి అందరి కంఠాలూ ఏకమై.

ప్రిన్సిపాల్ సిస్టర్ సెంట్ థేరీసా ప్రవేశించి చిరునవ్వుతో కుర్చీలో ఆసీనురాలయింది. "సిట్ డౌన్" అంటూ క్లాసంతటినీ చిరునవ్వుతో కలియజూసిందామె. ముఖం అతి ప్రశాంతంగా ఉండి, పెదిమలపై హాస్యం లాన్యంచేస్తూ ఉన్నది. "కబుర్లు పూర్తయ్యాయనుకుంటాను." చిరునవ్వుతోనే అన్నది. అందరూ సిగ్గుతో ఊరుకున్నారు.

"సరే. మీరీ కాలేజీలో ఎప్పుడైతే చేరారో, ఇకనుండీ మా నిబంధనలన్నీ పాటించాల్సి వుంటుంది. మీలో చాలా మంది తెలుగు మిడియమ్ నుండి వచ్చినవారు కాబట్టి నా ఇంగ్లీషు మీ కంతబాగా అర్థం కాకపోవచ్చు. కాలక్రమేణా మీరంతా ఇంగ్లీషులోనే మాట్లాడటానికి ప్రయత్నించి తీరాలి. అన్నట్టు మీకు టైంటేబిల్ ఇవ్వబడిందనుకుంటాను."

"యస్. సిస్టర్!"

"ఆల్ రైట్. సరే. ఇక రోజూ ఉదయంపూట మనం చేస్తుండే ప్రార్థన మీకు రాదనుకుంటాను కొత్తవాళ్లు కాబట్టి."

"దాన్ని నేర్చుకోడానికి కుతుహల పడుతున్నాము సిస్టర్!" ఒకమ్మాయి లేచి ధైర్యంగా అన్నది.

"గుడ్. ఆ ప్రార్థన బోర్డుమీద వ్రాస్తాను. మీరు కాపీ తీసుకోండి. ఆ పైన మనం మొదటి ఇంగ్లీషు పాఠాన్ని ప్రారంభించ వచ్చు. ఈ ప్రార్థన క్రిష్టియన్లదని మీరు సందేహించనక్కరలేదు. దేవుణ్ణే ఉద్దేశించి కామన్‌గా చెప్ప బడింది కాబట్టి, అందరూ నేర్చుకోవచ్చు."

కాలేజీలో ప్రప్రథమ దినానుభవం ఈ విధంగా మొదలైంది. నీల జీవితంలో ఒక నూతనాధ్యాయంలో, పన్నెండు గంటలకి విడిచి పెట్టారు కాలేజీ.

ఎండవేడిమికి నెత్తి మాడి పోతున్నది. కడుపులో కర కర మంటూంది ఆకలి.

పక్కనే నడుస్తూ, "కారియర్ తెచ్చుకున్నారా?" అంది నర్మద.

"లేదు. ఇప్పుడే వెళ్ళిపోయి యూనిఫారం మొదలయినవి కొనుక్కోవాలి. ఇంటికెళ్ళి భోజనం చేస్తాను."

"అదృష్టవంతులు! రేపువస్తారన్నమాట. వేగం వచ్చేయండి. మీకోసం చూస్తువుంటాను. హాష్టలు మేట్సున్నారు. కానీ అందరూ ధుమధుమలాడేవాళ్ళు, గర్విష్ఠులూ అక్కడక్కడ కూడా వెకిలివాళ్ళు వున్నారు. ఎవరో ఒకరు సరదాగా వుంటారంతే. ఎంతసేపూ ఒకరినొకరు విమర్శించు కోవడంలో టైము గడిచిపోతుంది. డిగ్రీ క్లాసువాళ్ళయితే సరేసరి. మమ్మల్నేదో చీమల్ని, దోమల్ని చూసినట్టే చూస్తారు."

ఈ రెండు రోజులకే ప్రాణం విసిగిపోతూందండీ.

"కొంచెం ఓపికపట్టాలి మరి. రేపు త్వరగా వచ్చేస్తా లెండి. మరి వెళ్లనా? అదిగో, మా బ్రదర్లిలాకూడ వచ్చినట్టున్నారు."

ఇద్దరూ విడిపోయారు.

గబగబ నడిచి భారవిని చేరుకుంది నీల.

"చాలా సేపయిందా బావా, నువ్వు వచ్చి?"

"అబ్బే. అయిదునిమిషాల క్రిందటే నేనూ వచ్చాను. నీ న్యూఫ్రెండా తను?"

"యస్."

"అప్పుడే అమెరికన్ స్టయిల్ అలవడిందన్నమాట. ఊఁ — ఇక రేపటినుండీ తెలుగు మర్చిపోతావు గాబోలు."

నవ్వుతూ తల వంచుకుంది నీల. "నిజం అలా అయి పోవాలనేవుంది నాకు మాత్రం!"

"ఆ ఇంటరెస్టు ఉండటమే మంచిది."

మాట్లాడుకుంటూ గేటు దగ్గర ఒక పదినిమిషాలు వేచి వున్నాక బస్ వచ్చింది.

ఇంట్లో అడుగిడుతునే ఉస్సురంటూ ఈజీచైర్‌లో కూలబడి ఫాను వేసుకుంది నీల. వేడి అంతా ఉపశమించి సేదతీరింది.

"ఆఁ ఆఁ — వడ్డించేయ్ త్వరగా! చెల్లెలుగారు అలసి పోయి వచ్చారు చదువునుండి."

"ఓహో మీకేం తొందరలేనట్టు. మా చెల్లెలికేం లేదు. మీకే ఆకలని చెప్పరాదూ!"

చన్నీటి స్నానం చేసి భోజనం ముగించుకొని ఒళ్లెరుగని నిద్రపోయింది నీల. లేచేసరికి మూడు దాటింది. వంటపని ముగించుకొని ఐదుగంటలకి ముగ్గురూ తయారై షాపింగుకు బయలుదేరారు. సూర్యబింబం కొండల వెనుక దిగిపోతున్న కొలదీ మెయిన్ రోడ్డుపై జనసంచారం ఎక్కువైంది.

దుస్తులే ప్రధానంగా పెట్టుకొని వెకిలి తనపుకంపు దాచడానికా అన్నట్టు ఘుమఘుమలు పూసుకొని టిప్‌టాప్‌గా తయారై రోడ్లను సర్వేచేస్తున్నారు కాలేజీ, యూనివర్సిటీ విద్యార్థులు. ఏ ఎలక్ట్రిక్ పోల్ దగ్గరో, పేవ్‌మెంటు మీదనో గుంపులుగా నిలబడి, సిగరెట్లు కాలుస్తూ, పగలబడుతూ, బాతాఖానీ వేసుకోవడం; పక్కనుండి విద్యార్థినులుగానీ, ఏ ఆడవాళ్ళుగానీ పోయినా – "ఒరేయ్ ఆ చేతిలోని బ్యాగు ఖాళీ. అందులో డబ్బేం లేదు బ్రదర్. షోకుకోసం." అని ఒక డంటాడు.

"ఎక్కడికిరోయ్, వెళుతున్నావు? మే ఐ కమ్ ఆఫ్టర్ యూ?" అని ఇకిలిస్తాడు మరొక శతమర్కట సమానుడు.

"ఒహో వన్నెల చిన్నెల కన్నియా! నీ నల్లని జడలో పూలూ నా గుండెలలో బాణాలూ!" విరహగీతం!

"ఇది కాన్వెంట్ శాల్తీరోయ్! ఫర్వాలేదు. ఎంత తెలుగులో తిట్టినా అర్థంకాదు గురూ!" అని భ్రమపడతాడు ఇంగ్లీషులో ఫెయిలయిన మొనగాడొకడు.

. . .

ఈ విధమైన వెకిలి మాటలతో, చూసీచూడనట్టు యువతుల భుజాల్ని రాసుకుపోవడానికి ప్రయత్నిస్తూ, సైకిళ్ళను అటూ, ఇటూ పోనిస్తూ, సిగరెట్ పొగను ఒక్కసారిగా వాళ్ళ ముఖాల కడ్డం వచ్చేటట్లు వదులుతూ, ఒకవైపు జుగుప్సనూ, ఇంకోవైపు జాలినీ కలిగిస్తున్నారు.

ఇదంతా చూసిన నీలకు ఒళ్ళు జలదరించింది.

"నయమే, అక్కా! ఆడాళ్ళ కాలేజీలో చేరి బ్రతికిపోయాను. వీళ్ళను గన్న తలిదండ్రులు ఒక్కసారి వచ్చి చూస్తే, సుపుత్రుల చదువుకోసం తాము పోసేడబ్బు వృధా అని ఎంత విచారిస్తారంటావు? ఈ కుర్రవాళ్ళకు ఇంగితమనేది లేదా?" అన్నది.

"అవన్నీ కుర్రకారు సరదాలోయ్, అలా అమ్మాయిల్ని బాధపెట్టడంలో వాళ్ళకొక ఆనందం ఉంది" అన్నాడు భారవి.

"ఓహో! స్వీయానుభవం కాబోలు! ఏడిపించడం అనే సరదా వేరు; ఇలాంటి అసహ్యాకరమైన ప్రవర్తన వేరు. వాళ్ళ నడతని బట్టి ఇవతలవాళ్ళెంత బాధపడతారో, ఆలోచించరెందుకు? నేనే అబ్బాయి నయివుంటేనా......"

"నువ్వూ వాళ్ళలోనే చేరిపోయేదాని వప్పుడు. నీకు కొత్త కాబట్టి బాధపడుతున్నావు కానీ, నీలాంటి వాళ్ళు వాళ్ళని పురుగుల్ని విదిలించినట్టు విదిలించేస్తారు. నెమ్మదిగా పోయే ఆడాళ్ళను వాళ్లేమీ అనరు కూడాను. ఈ కుర్రాళ్ళ మాటలకు లోలోన సంతోషిస్తూ, అటునుండి కావాలని ఏవో మాటలంటూ, అసభ్యంగా అలంకరించుకుని నడిచిపోయే అమ్మాయిలు కూడా చాలా మంది వున్నారు..."

. . .

"అమ్మాయిల్లోనా...?"

"ఇప్పుడు కాదు, కాలక్రమేణా నీ కర్థమవుతుందిగా! విద్యార్థుల్లో కూడా మంచివాళ్లు లేకపోలేదు. కానీ, స్నేహితులతో తిరగడం మూలాన, అంటే చెడు గుణాలవాళ్ళతో తిరగడం మూలాన, మంచిగా వున్నా సరే వాళ్ళకూ్కడా చెడ్డపేరు వస్తుంది. రౌడీ మిత్రుణ్ని మంచి మార్గంలో నడవమని ఒక మంచివాడు బోధించాడూ అంటే, ఇక వాడేం చేతగానివాడికిందే లెక్క. ఎవడయితే విశృంఖల విహారం చేస్తాడో వాడిచుట్టూ అందరూ చేరుతారు. నీకు తెలీదు కానీ, విద్యార్థినులు కూడా లోలోపల అటువంటి వ్యక్తి స్నేహాన్నే అభిలషిస్తారు. ఒక ఇంటివాళ్లయ్యాక ఈ అల్లరి వుండదనుకో."

"వీళ్ళని సన్మార్గంలో పెట్టి, సంస్కృతి నేర్పేందుకు చట్టాలు లేవా?"

"ఎందుకు లేవు. ఇలా నన్నో కుర్రాడు అల్లరి చేశాడూ అని రిపోర్టు చేస్తే, న్యాయస్థానం ఆ ముద్దాయిని శిక్షిస్తుంది. అలా రిపోర్టు చేయగల ఆడవాళ్లెంత మంది వున్నారు? ఒకవేళ చేసినా, నాలుగయిదు రోజుల శిక్షకు వాళ్ళలో పరివర్తన వచ్చేయదు కదా! వాళ్ళ ప్రవర్తన ఇతరులకు బాధాకరమని ఒప్పుకుంటాను. కానీ, ఈ సమస్యను విప్పేవారు లేరు. విద్యార్థులందరూ, ఎవరంతట వారు తెలుసుకో గలగాలి. క్రమంగా వాళ్ళలో మంచి పరిణామం రావాలి. అప్పటిదాకా, మనదేశంలో వున్న విడదీయలేని చిక్కు సమస్యలన్నిటిలో ఇది కూడా ఒకటని వూరుకోవలసిందే. ఇంకా ఈవాళేగా వచ్చావు! ఇదంతా లోకానుభవం కిందే వస్తుందిలే, చూద్దువు గాని ఒక్కొక్కటి."

. . .

"విన్నావా, మీ బావగారి దీర్ఘోపన్యాసం? ఏమని ఉద్ఘాటించారో అవధరించావు కదా! అది నిజమే! నా కలవా టయిపోయింది. వాళ్ళని లెక్కచెయ్యకూడదు. విన్పించు కోనట్టు వెళ్ళిపోవడమే."

తట్టలూ, బుట్టలూ మోసుకుని వచ్చే కూలీలూ, ఆఫీసుల నుండి ఇంటికి పోతూ, పూలంగడిలో ఒక పూలపొట్లం కొని జేబులో వేసుకొని, ఇంటి దగ్గర భార్యామణి అందించే వేడి కాఫీని తలంచుకుంటూ నడిచే గుమస్తాలూ; ఇంటికి వెళ్ళ డమే ఒక భారంగా బరువు బాధ్యతలతో వంగి, దిగులు ముఖా లతో నడిచే ఉద్యోగస్థులూ, రకరకాలవాళ్ళతో నిండిపోయి వుంది ఇరుకూ, సుదీర్ఘమూ అయిన విశాఖపట్టణం మెయిన్ రోడ్. ఇన్ని రకాల జనం మధ్యా బుట్టల్లాంటి బుర్రలతో, గొడుగు విప్పినట్టున్న గౌనులతో, నేలకు నాలుగడుగుల ఎత్తు నున్న హైహీల్సుతో షోగ్గా మెరుస్తున్నారు ఆంగ్లో ఇండియన్సు చుక్కల్లో చంద్రుల్లాగ!

షాపింగు ముగించుకొని బయటపడేసరికి, వీధుల్లో దీపాలు వెలిగాయి. చీకటిపడింది బాగా.

"ఇంజనులో పెట్రో లయిపోయింది. హోటలు కెళ దామా?" జవాబు ఆశించకుండానే హోటలుకు దారితీశాడు భారవి. మసాలా దోసెలూ, ఐస్క్రీమూ పూర్తయ్యాయి.

"వాటీజ్ ది నెక్స్ట్ ప్రోగ్రాం?"

"బీచ్" ఛాయ ప్రపోజ్ చేసింది.

"కరెక్ట్" బలపరిచాడు భారవి.

తల్లికి బావులేకపోవడం, బీచ్‌లో తమ ఇద్దరికి జరిగిన సంభాషణా జ్ఞాపకం వచ్చాయి నీలకు. మనసును ఒక మబ్బు తెర కమ్మింది. అయినా వాళ్ళ ఉత్సాహాన్ని పాడుచెయ్యటం ఇష్టం లేక, మూగపోయిన మనసుతోనే అనుసరించింది.

మిరమిట్లు గొలిపే ఎలక్ట్రిక్ దీపాల వెలుగుల్లో మరుగు పడిపోయిన చంద్రుడు, సాంద్రతీరాన స్వచ్ఛంగా ప్రకాశిస్తున్నాడు. అంతా నిర్మానుష్యంగా ఉంది. ఇసుకలో మేను వాల్చాడు భారవి.

"మరే, మిమ్మల్నర్థం చేసుకున్న వ్యక్తి వచ్చింది కదా" ఛాయ అందిచ్చింది.

"అది అబద్ధం కాదు. ఉన్నమాటే" అన్నాడు భారవి నిశ్చలంగా.

దెబ్బతిన్నట్టు నీల ముఖం పాలిపోయింది.

"మరేం అనుకోకండి. సరదాకన్నాను, ఏమనుకోరనే."

ఈ మాటతో కొంచెం తేటపడినా, మనసులోని కలవరం సర్దుకోలేదు నీలకు. భారవి మాత్రం నవ్వేశాడు.

"ఏం మాట్లాడవేమిటే, బాధ కలిగిందా నే నన్న మాటకు? మరెప్పుడూ అననులే" చెల్లెల్ని సమాధాన పరచ జూసింది ఛాయ.

అక్కడున్నంతసేపూ నీల మౌనంగానే కూర్చుంది. అవీ, ఇవీ కబుర్లాడసాగారు భారవీ, ఛాయా. రాత్రి ఇంటికి చేరుకొనేసరికి ఎనిమిది గంటలు దాటింది.

# 17

తల్లిపోయినదగ్గర్నుండీ పరిస్థితులు అర్థమవుతున్నాయి విజయకు. బాగా జ్ఞానం వచ్చింది. కానీ, ఆమెకు వింతగా కనిపిస్తున్నదల్లా తండ్రి ధోరణి ఒక్కటే. రాత్రింబగళ్లు ఆలోచనలతో మునిగితేలుతూ విజయను పిలుస్తారు రాఘవయ్యగారు.

"అమ్మా, నా ఆరోగ్యం చూస్తుంటే రోజురోజుకీ దిగజారిపోతూంది. నేను కొంతకాలం బ్రతికుండాలీ అంటే, నాకు సదుపాయకరంగా ఉండేటట్లు అన్ని పనులూ జరగాలి. మీ చేత చాకిరీ చేయించు కుంటానా? అదెంత తప్పు. పోతే, ఈ ముసిల్ది నా వంట ఏం చెయ్యగలదు? దాన్ని తన మేనల్లుడి దగ్గరకు పంపించేస్తాను."

"చింతామణిని తెచ్చుకుంటే సరి."

"చింతామణా? ఛ. ఆ వెధవపేరెత్తకు. వాడి మొహం, వాడేం చెయ్యగలడు?" అంటూ దగ్గరకు రమ్మని పిలిచి నెమ్మదిగా అంటారు. "నాకు కాళ్లొత్తడానికీ, వీపు రుద్దడానికీ, నాకే రాత్రప్పుడు ప్రమాదం జరిగినా సేవచెయ్యగలిగేటట్లు నా గదికో కాపలా వుండేదాన్ని ఒక వంటావిడను తెచ్చుకోవాలి. తెచ్చుకుంటానులే, నువ్వు ఆ బెంగపడనవసరం లేదు. మీ సంరక్షణ కూడా అదే చూస్తుంది. ఏమంటావు?"

ఈ మాటలు వినడానికి చాలా ఇబ్బందిగా ఉంటుంది విజయకు.

"మా పెత్తండ్రి కొడుకొకడున్నాడులే, అప్పారావని మీరు వైజాగులో ఉండగా ఇక్కడకు వచ్చాడు. వాడికో ఉత్తరం రాశాను, ఇలా వంటావిడను పంపించమని. తక్షణం

పంపిస్తున్నానని వ్రాశాడువాళే. అందంగా వుంటుందిట పేరు వెంకటమ్మ. బాల్య వితంతువు. నాసేవలన్నీ చూసుకో డానికి పనికి వస్తుంది. నాకు దూరపుబంధువు అవుతుందిలే. అయితే మీరు తనని వంటమనిషిగా చూడ్డానికి వీల్లేదు సుమా; మన ఇంట్లో మనిషికంటే ఎక్కువగా చూడాలి."

కోపాన్ని దిగమ్రింగుతూ నిలుచుంది విజయ.

"తనకి మీరు రాసుకునే తల నూనెలూ, సబ్బులూ అన్నీ యివ్వాలి. తన గొంతుక, రూపం అచ్చం మీ అమ్మ లాగే ఉంటుందని వ్రాశాడు అప్పారావు. నాలుగయిదు రోజుల్లో వస్తుంది"

ఏమాటా అడగకుండా ఛర్రున అక్కడనుంచి వచ్చేసింది విజయ. తల్లిపోయాక ఈ ముసలితండ్రి ఎంత విషయలోలు డయిపోయాడో అర్థమౌతుందా మెకు. "చెట్టంత ఆడపిల్లలు ఇంట్లో వుండగా వితంతువుని తెచ్చుకుని....ఛీ....ఛీ.... ?

తండ్రి అన్న మాటలన్నీ నీలకు వ్రాసింది వివరంగా తన అసహనాన్నికూడా వ్యక్తం చేసింది. రెండురోజులకే నీల దగ్గర్నుండి జవాబు వచ్చింది.

"నువ్వు అన్నీ విని ఊరుకో. తన ఇష్టప్రకారమే అన్నీ జరగనీ. ఎవరిదారిన వాళ్లు పోవలసిందే. తన సుఖం తను చూసు కుంటూఉంటే మనం ఎందుక్కాదనాలి? దాని వలన మనకు హాని ఏమీలేనప్పుడు మనం జోక్యంకలుగజేసుకోడం అనవసరం" అంటూ, ఇంకా ఏవో కాలేజీ విషయాలు వ్రాసింది.

ఆ ఉత్తరం విజయను సంతృప్తిపరిచింది. తండ్రి తన కలలనూ, ఊహలనూ రోజూ చెప్పడం మానలేదు. అన్నీ

మౌనంగా వినేసి ఊరుకుంటూంది విజయ. ఎప్పటిసంగతు లప్పుడు నీలకు వ్రాసేస్తుంది.

రాఘవయ్య కుటుంబంపై శని ప్రభావం బలంగా ఉన్న రోజున. ఒకనాటి అసుర సంధ్యవేళ లక్ష్మమ్మ విడిచిపోయిన ఇంట్లోకి ప్రవేశించింది వెంకటమ్మ. రాఘవయ్యగారు అందల మెక్కిపోయారు. ముఖం చింకి చాటంతయింది.

నలభయ్యేళ్లుంటాయి వెంకటమ్మకు. మనిషి చామన ఛాయగా ఉంది. పీక్కుపోయిన ముఖం, లోతుకుపోయిన కళ్లూ, సన్నగా పొడవుగా వున్న ఒంటికి చాలీ చాలని బట్టలు! తన పాలిటదేవతో అన్నట్టు మురిసిపోసాగారు రాఘవయ్యగారు.

"అమ్మా! చూశావుకదూ, మనిషెంత గంభీరంగా అణకువగా ఉందో! ఒకప్పుడు బాగా బ్రతికినవాళ్లే! తనని అలుసుచెయ్యడానికి వీలులేదు. నీలకు ఇష్టపడుతుందిలే" అన్నారు రాఘవయ్యగారు విజయతో. ఈ విషయం నీలకు కూడా వ్రాశారు. జవాబుగా, తండ్రి సంరక్షణకు ఇన్నాళ్ళకు ఒక మనిషి దొరికినందుకు ఆనందిస్తున్నది నీల.

నాలుగైదు రోజుల్లో వెంకటమ్మకోసం తెల్లటి చీరలు నాలుగు తెచ్చారు. "నీకోసం ఒక పరుపుకొంటాను. ఆ చాప గుచ్చుకుంటున్నట్లుంది నీకు" అన్నారు ఒక రోజు. చేతులు నులుముకుంటూ నవ్వింది వెంకటమ్మ.

ఆప్యాయంగా చూసే మామ్మ వెళ్లిపోయిన దగ్గర్నుండీ విజయకు చాలా వెలితిగా కనిపిస్తూంది ఇల్లు. ఆ ఇల్లు తమది కానట్టూ, పరాయివాళ్ళింట్లో తానుంటూనట్టూ భావన కలుగుతూంది. ఎవరితోనూ మాట్లాడదు. ముభావంగావచ్చి రెండు

మెతుకులు కతికి లేచిపోతుంది. తన చదువేమో! తానేమో! కానీ, ఎంతగా పట్టించుకోకుండా ఉందామన్నా తండ్రి తాలూకు శృంగారలీలలు కళ్ళపడుతూనే ఉంటాయి. చెవులకు వినబడుతూనే ఉంటాయి.

వచ్చిన కొత్తలో తన పరిధిల్లో తామండేది వెంకటమ్మ. కాని, ఒక్క వారంరోజుల్లో, రాఘవయ్యగారిలోని బలహీనత, ఇంటి పరిస్థితులు తెలుసుకున్నది. అలా తెలుసుకున్నప్పటి నుండీ, కేవలం లక్ష్మమ్మ స్థానాన్ని భర్తీ చెయ్యడానికే తానున్నట్లు, ఈ సంసారాన్నంతటిని తన చేతులమీదుగానే నడిపించాల్సి ఉన్నట్లు భావించుకుని; ఒక్కొక్కప్పుడు విజయ మీద అధికారం చూపించడం, తనక్కావలసినవన్నీ రాఘవయ్య గారికి చెప్పి చనువుగా తెప్పించుకోవడం చేస్తూంది.

ఆమె వంట చేస్తున్నంతసేపూ రాఘవయ్యగారు వంట గదిలోనే కూర్చున్నారు.

"వెంకట్ ! నువ్వు వచ్చావు; నాజిహ్వాలేచివచ్చిందనుకో. పెళ్ళయిననాటినుండీ ఇన్ని రోజులకు సుఖపడుతున్నాను. అసలు విజయ తల్లికి వంట నేర్పించింది నేనే. ఏదో వండేదనుకో! అయినా నీకీ నలభీమ పాకం ఎక్కడబ్బిందీ ?"

"మీ మాటలకేం లెండి. "అంటుంది వెంకటమ్మ మురిసి పోతూ.

"అలా అనకు. బీడు పోయిన నా ఇంటికి ఒక దేవతలా వచ్చావు. ఇక ఈ సంసారమంతా నీదే. ఈ పిల్లలందర్నీ నీ చేతుల మీదే ఎత్తాలి. ఇక నా బాధ్యతంతా నీ చేతుల్లోనే పెట్టేశాననుకో."

"మీ కెందుకు కూరుకొందురూ. ఆ పాటి తెలివి నాకూ ఉందిలెండి. అయినా ఏనాటికైనా, మీరూ, మీ పిల్లలూ ఒకటి గానీ, నేనెందుకు లెక్కలోకి వస్తాను ?" మెల్లిగా రాఘవయ్యగారి మనసులోని మాట లాగడానికి ప్రయత్నించేది వెంకటమ్మ.

"అలాగని నన్ను వేరు చేస్తున్నా వన్నమాట. ఎంత చమత్కారివే వెంకటీ ? ఇక ఈ కాపురం నీది కాకపోతుందా ఏమటి ? పిల్లలిద్దరికీ పెళ్ళయి వెళ్ళిపోయాక ఈ ఇంట్లో ఎవరుంటారిక ఈ ఆస్థీ, డబ్బూ ఎవరనుభవించడానికి. ?" అంటూ రహస్యంగా "పుస్తె కట్టేయ మన్నావా ఏమిటి ?" అనే వారు. వెంకటమ్మ ముఖంలో ఆనందం వెల్లివిరిసి పోయేది.

కాళ్లొత్తడం, తలంటు పొయడం, రాఘవయ్యగారి నిద్ర లేపడం అన్నీ వెంకటమ్మ డ్యూటీలే. రాఘవయ్యగారి మాట అటుంచి, తిండి సదుపాయాలన్నీ బాగుండి, ఒళ్ళంతా నునుపు దేరి. బాగా తేరుకుంది వెంకటమ్మ.

"వెంకటీ, వెంకటీ ! వెంకటేశ్వరుడంటే దేవుడే. నువ్వు నాకు దేముడవేనా, ఎంత పిల్చినా పలకవు ?

"నేనెందుకు మీకు దేవుణ్ణవుతాను, మీరే నాకు దేముడు."

"నిజమేనే. నేను దేవుణ్ణయితే నా పాలిట దేవతవు కావూ నువ్వు ?" పకపకా నవ్వుకుంటారిద్దరూ.

"ఎప్పుడూ వంటగదేనా ? కొంచెం వచ్చి కూచుందూ ఇలా. విజయ చూసుకుంటుందిలే ఆపని. నువ్వెదురుగా

కూర్చుంటే నా జబ్బంతా నయమయి పోతుందే." కన్ను గిలు పుతూ పిల్లలకు మాత్రం నువ్వంటే అభిమానం లేదను కున్నావా ? వాళ్ళపై నువ్వు చూపించే ప్రేమకు, నువ్వంటే వాళ్ళకెంత అభిమానమో నీ కెలా తెలుస్తుంది ?" అంటారు గట్టిగా.

"నాకు తెలీదేమిటండీ ?"

"నీ మెడేమిటే అంత బోసిగా ఉంది. ఉండు. మెడ లోకి ఏదో చేయిస్తాను."

నిరాటంకంగా. నిశ్శృంఖలంగా సాగిపోతున్నాయి వెంక టమ్మా. రాఘవయ్యగారి శృంగారలీలలు. ఒకోరోజు సంభా షణా వింటూంటే ఒంటిమీద తేళ్ళూ, జెర్రులూ ప్రాకుతున్న ట్లుంటుంది విజయకు. మనసంతా పాడయిపోయి చికాగ్గా ఉంటుంది. నలభీమ పాకమని తండ్రి మెచ్చుకొనే వెంకటమ్మ చేతి వంటతో, గొంతుకలో ముద్ద దిగటం కష్టం అయిపోతు న్నది. రాత్రిళ్ళు చదువుదామని పుస్తకం తెరిచి కూర్చుం టుంది. గదిలోంచి వికవికలూ, పకపకలూ విన్పిస్తుంటాయి. మధ్యలో గుసగుసలూ ! చదువు తలకెక్కదు. పడుకుందా మంటే నిద్ర పట్టదు. తల్లి గుర్తుకు వచ్చి ఆపుకోలేని దుఃఖం వస్తుంది.

"నువ్వులేని ఈ ఇంటిని ఇద్దరు నీచవ్యక్తులు కలుషితం చేస్తున్నారు. ఎందుకు మమ్మల్ని విడిచి పోయావు? ఏ లోకాల్లో ఉన్నావు? ఇదంతా నీ చెవుల పడటం లేదా ? అనుకుంటూ తల్లినుద్దేశించి, తనివితీరా ఏడుస్తుంది.

. . .

వెంకటమ్మా, తండ్రీ ఆడుకునే మాటలూ, ఇంట్లో నిత్యమూ జరుగుతూండే తతంగం అంతా వ్రాసింది నీలకు. ఇంకా జవాబు రాలేదు. రోజులు చికాగ్గా, మందంగా నడుస్తున్నాయి.

* * *

వెళ్లిన చాలా రోజులకు అనూరాధ వ్రాసింది—తాను కో ఎడ్యుకేషన్ చేస్తున్నాననీ, మగ పిల్లల అల్లరి భరించడం కష్టంగా ఉన్నా రోజులు సరదాగా గడచి పోతున్నాయనీ. నీల వాల్తేరు వచ్చి రెండు నెలలవుతుంది, నర్మదా, నీలా బాగా స్నేహితులయి పోయారు. ఇద్దరూ కలిసి చదువుకోడం, కలిసి ఎక్కడి కయినా వెళ్ళడం చేస్తుంటారు. కాలేజీలో ఉన్నంత సేపూ ఒక్క క్షణం కూడా విడవకుండా ఉంటారు. నీల అప్పుడప్పుడు నర్మదకు వేపుళ్లూ, కూరలూ తెచ్చి ఇస్తూంటుంది. ఒకటి రెండు సార్లు వార్డెన్‌ను పర్మిషన్ అడిగి ఇంటికి తీసుకుని వెళ్ళింది.

పరీక్షలు దగ్గరకు వస్తున్నాయి. చదువులో మునిగి పోతూంది నీల. తన గదిలో కూర్చుని ప్రశాంతంగా చదువుకుంటుందెప్పుడూ. ఏమీ అంతరాయం కలుగదు,

ఛాయా. భారవి నవ్వుకుంటూ, త్రుళ్ళు కుంటూ కాలం గడిపేస్తున్నారు. అప్పుడప్పుడు కీచులాటలు వచ్చినా మరు క్షణంలో సమసి పోతున్నాయి. తరుచూ కడుపు నొప్పి వస్తూ వుంది ఛాయకు. భారవి చాలా ఆందోళన పడుతున్నాడు.

"బాబుగాణ్ని నేను ఆడించు తున్నప్పుడు నువ్వన్ని పనులు చేసుకుందువు గాని, ఇప్పుడు మాత్రం విశ్రాంతి తీసుకో రాణీ! నా మాట వినవూ?" అంటూ ఉంటాడు భారవి.

కోడలుకు నెల తప్పిందని విని అత్తా, మామా వచ్చి నాలుగు రోజులుండి వెళ్ళిపోయారు. రాఘవయ్యగారు అల్లుడికి ఉత్తరం వ్రాశారు. ఏడవ నెలలోనే ఛాయను పురిటికి పంపించ వలసిందని. తాను తండ్రిని కాబోతున్నాననే గర్వం భారవిలో తొణికిస లాడుతూ ఉన్నది. కాబోయే మాతృమూర్తి ఛాయలు ఛాయలో తొంగి చూస్తున్నాయి.

"రాణీ! నాకు బాబే కావాలి బాబు నివ్వకపోతే ఒప్పుకోను, తెలుసా ?"

భర్త వక్షంపై తలవాల్చి పరవశంగా కళ్ళు మూసుకుంటుంది ఛాయ.

"బాబుకేం పేరు పెట్టుకుందాం? నాడొచ్చాక నీ సరసన చోటివ్వవేమో ?" లాంటి మాటలతో ఆపిల్ పండ్లలాంటి ఛాయ చెక్కిళ్ళకు మరింత అరుణ వర్ణాన్ని పూస్తాడు భారవి.

వీటిలో ఒక్కొక్కమాట నీల చెవుల పడుతూ ఉంటుంది. నవ్వుకుంటూ ఉంటుందామె. ఇప్పుడు ఛాయ అన్ని పనులు చేయలేకపోతూ ఉంది. భారంగా తిరుగాడుతూంది. వంట అంతా నీలేచేస్తుంది. పొద్దు ఉేలేచి స్నానం ముగించుకొని, దేవుడి దగ్గర దీపం పెట్టి, ఓ నమస్కారంపెట్టి వంటలో జొరబడుతుంది నీలమధ్యలో భారవి సాయం చేస్తానంటూ వస్తున్నాడు.

"నువ్వున్నావు కాబట్టి దాని క్కొంచెం సాయంగా ఉంటుంది. ఎలా కృతజ్ఞత తెలియజేసుకోవాలో తెలియటంలేదు, నీలా !"

నీల చిరునవ్వు నవ్వుతుంది. "నువ్వేం సాయం చెయ్యనక్కర్లేదు బావా! సాయం పేరుతో నా పనికి అడ్డంరాకపోతే చాలు."

"మీరిలా రిద్దరూ, చేశారు గానీ గొప్ప సాయం!" అంటూ కేక పెడుతుంది ఛాయ.

"ఇన్సల్టు. డబుల్ ఇన్సల్ట్." అంటూ వంటగది నుండి నిష్క్రమిస్తాడు భారవి.

టెర్మినల్ పరీక్షలయి పోయాయి. అనూరాధ వ్రాసింది. "నేను సోమవారం నాడు జి.టీ. లో వస్తున్నాను. నువ్వు ఆ వేళ బయలు దేరితే, ఇద్దరం కలిసి వెళ్ళిపోదాం." అని.

తాను వస్తున్నట్లు తండ్రికీ, చెల్లికీ ఒక కార్డు వ్రాసి పడే సింది నీల. ఛాయ స్టేషనుకు రాలేక పోయింది. భారవి ఒక్కడే వచ్చాడు దిగబెట్టడానికి. ఎందుకో అతని ముఖంలో పొద్దుటి నుండీ ఒక విషాద రేఖ తొంగి చూస్తూంది. దాన్ని గమ నిస్తున్నా "అలా ఉన్నావే" మని అడగలేదు నీల.

"ఇంకా పదిహేను రోజులుంది కదా నీలా నువ్వు రావటానికి ?"

"ఇంకా వెళ్ళందే!" నీల నవ్వింది. ఇంకో నాలుగు రోజులు ఆలస్యంగానే వస్తాను. విజయనూ, నాన్ననూ చూసి రోజులు చాలాకాలం గడిచి నట్టని పిస్తోంది. రాధనుకూడా ఇన్నాళ్లకు కలుసుకుంటున్నాను కదా?"

"నీ కోసం ఇక్కడొక భగ్నజీవి యెదురు చూస్తూ ఉంటాడన్నది మరచి పోతావా నీలా ?"

"అంత పెసి మిస్టిక్‌గా మాట్లాడతావేం బావా ? ఇలాంటి సంతోషసమయంలో నువ్విలామాట్లాడటం అసహజంగా కనిపిస్తూంది నాకు. నీ ఆనందానికేమి లోటు వచ్చిందిప్పుడు?"

"ఇంతేనా తెలుసు కున్నావు? నీ కిచ్చిన మాటను నిలబెట్టు కోవాలని నేనెంతగా తాపత్రయ పడుతున్నానో నీకెలా తెలుస్తుంది? నువ్వెదురుగా ఉండటం నాకు కొండంత బలాన్నిస్తూంది, నీలా!

"చదివానులే అవన్నీ."

"ఆ కాగితాలా! ఎప్పుడు?"

అక్కే ఇచ్చింది, అది సరే. నా విషయంలో తనకే మని జవాబు చెప్పుకున్నావు బావా? ఈ మాట అడగటానికి ఇన్నాళ్ళు అవకాశం లేకపోయింది."

"అంతా తెలిసి ఏమీ ఎరగనట్టు నన్నింత దూరంగా ఉంచావా ఇన్నాళ్ళూ? నీ విషయంలో తనకేమని చెప్పానని కదూ? నేను దారీ, తెన్నూ తోచక మరణానికి సిద్ధపడిన సమయంలో, నువ్వు నన్నెలా కాపాడి ఒడ్డుకు చేర్చావో తనకి తెలియజెప్పాను."

"మరి ఉత్తరాల సంగతో?"

నవ్వాడు భారవి. "తనకోక్కోపం వచ్చింది. కానీ, నా కారక్టర్ విషయంలో తనకెప్పుడూ అనుమానం లేదు. ఏదో ఉద్రేకంలో రాసుకున్నవని చెప్పాను. నువ్వు దేవతవనీ. నిన్ను కలుషితం చేయవద్దనీ నాతో దెబ్బలాడింది."

"పోనీ ఇప్పుడయినా తెలిసింది కదా నీకు. మా అక్కయ్య హృదయ నైర్మల్యం?"

"నేనెప్పుడయినా నీకు చెప్పేదొక్కటే నీలూ! నీకిచ్చిన మాట ప్రకారం నడుచు కుంటున్నాను. మా కాపురం

నడుస్తున్నదంటే, దానికి కేవలం కారణం నువ్వే! తను నా భార్య. నా కారణంగా తను బాధ పడ కూడదు. తనని సంతోష పెట్టటం నా విధి. అలాగని ప్రేమించడం లేదనను. నా హృదయ పూర్వకంగా తనని ప్రేమిస్తున్నాను. కానీ. గతంలో తన నడత విషయంలో మాత్రం నా మనసేనాటికి మారదు నీలా! దాన్నొక పక్కకు నెట్టి కాలం గడుపుతున్నాను. నా హృదయంలో ఒక్కరికే ప్రధమ స్థానం ఉంది. దాన్ని వారు స్వీకరిస్తే ధన్యుణ్నే. లేదూ అంటే ఈ మోడు బారిన జీవితాన్ని నడుపుతూ ఉంటాను. ఏనాడో కూలిపోయి సమాప్తమయి పోయేదాకా."

"ఛ, అలాంటి మాటలనకు బావా!"

భారవి కళ్ళలో నీళ్ళు చిప్పిలాయి. "నిన్ను నేనెంతగా ఆరాధిస్తున్నానో, నా మనసెంతగా తపిస్తున్నదో నీవు నిజంగా గ్రహించగలుగుతే, నన్నొక్క క్షణ మయినా విడిచి ఉండలేవు, నీలూ. అది మాటల్లో ఇమడని భావం. నీకు నిజంగా నాపై ఏమాత్రం అభిమానం ఉన్నా, నా హృదయస్పధన. ఆక్రందన నీకు వినిపించి తీరుతాయి."

నీల మనసంతా వికలమయి పోయింది. కన్నీళ్ళతో తల వంచుకుంది. 'నా మనస్సంఘర్షణ నీకెలా చెప్పుకోను బావా! నీవు నాకందని వాడివి. నా జీవితంలో ఎవరికయినా నా మీద అధికారం ఉంటుందీ అంటే అది నీకే. నీవు నన్ను ప్రతి నిమిషం ఎంత కలిచి వేస్తున్నావో నీకు తెలియదు.' ఈ మాటల్ని ఆమె భారవితో అనాలనుకుంది. కానీ, అందులో ఒక్క పదాన్ని కూడా బయటకు ఉచ్ఛరించలేక పోయింది.

కన్నీళ్ళు టపటప కింద పడ్డాయి తలెత్తి చూసింది నీల. నీరు నిండి ఉన్న ఇద్దరి కళ్ళూ కలుసు కున్నాయి. ఒకరి కనులలో ఒకరు తమకు కావలసిన భావాన్ని వెదుక్కో కలిగారు. ఇన్నాళ్ళ నుండీ ఇద్దరి హృదయాలలోనూ అజ్ఞాతంగా దాగి ఉన్న ప్రణయ భావం వెలికి వచ్చి ఇద్దర్నీ ఒకటిగా చేర్చింది.

భారవి తెప్పరిల్లి కన్నీళ్ళతోనే నవ్వుతూ, ఇప్పుడేకాంతంగా ఉంటే, నిన్నేం చేసేవాడినో చెప్పనా, నీలా?" అన్నాడు.

నీల కళ్ళు తుడుచుకుంది. "ఇప్పుడేం చెప్పనక్కర్లేదు."

"ఊఁహూఁ—చెప్పి తీరాలని ఉంది. కానీ చెప్పను. ఏకాంతంగా ఉన్నప్పుడే చెబుతాను, ఇప్పటికి మాత్రం వెళ్ళిరా. ఒక్కటి మాత్రం మరిచిపోకు. ఎక్కడ ఉన్నా నా బంధం నుండి తప్పించు కోలేవన్న సంగతి!"

తరువాత చాలా సేపు మౌనంగా కూర్చున్నారిద్దరూ. ట్రెయిన్ వచ్చి ఆగింది. ఏ పెట్టెలో అనూరాధ ఉంటుందో అని వెతకడం మొదలు పెట్టారు.

"నీలూ ఇక్కడ!" విన్పించింది. వెనక్కు తిరిగి చూశారు అనూరాధ కంపార్టుమెంట్ దిగి వస్తూంది. స్నేహితురాళ్ళిద్దరూ ఒకరి చేతుల నొకరు గట్టిగా పట్టుకున్నారు.

"ఎన్నాళ్ళకు నీలూ!"

"రెండున్నర యుగాలకు!" ఇద్దరిలోనూ ఆనందాతిరేకం పొర్లింది.

. . .

అనూరాధతో పాటు నీల వెళ్ళిపోతుంటే తన శరీరం లోని భాగాన్నెవరో విడదీసి తీసుకుని పోతున్నట్లు తన గుండె ల్నెవరో పట్టి పిండుతున్నట్లూ అనిపించింది భారవికి. నడవలేక నడవలేక నడిచి ప్లాట్ ఫారం దాటి బయటకు వచ్చాడు.

## 18

"చెప్పు నీలా, ఏమిటి వైజాగు విశేషాలు ?"

"చెప్పుకోదగ్గ విశేషాలే జరిగాయి. ఏమి చెప్పమన్నావు? ఇంటి విశేషాలా, కాలేజీ విశేషాలా ?"

"రెండూను."

"అయితే కాలేజీవే ముందు చెబుతాను. ఏం చెప్పను ? కాలేజీ చాలా బావుంటుంది."

ఫకాలున నవ్వింది అనూరాధ. "ఇంతేనా ?"

"మరి నాఅంతట నేనేం చెప్పను ? నువ్వు ప్రశ్నలు వెయ్యి. నేను జవాబులు చెబుతాను."

"సరే, అయితే, కాలేజీలోని అమ్మాయిలు సరదాగా ఉంటారా ? అందరిలోనూ సంస్కారం తొణికిసలాడుతూ ఉంటుం దనుకుంటాను."

"ఆ– సంస్కారయుతంగా ఉండకపోతే, మా సిస్టర్లు పట్టుకుని దులిపేస్తారు, రోగ్స్, పిగ్స్ అని. కాబట్టి అందరూ మర్యాద ఇచ్చి పుచ్చుకుంటూ ఉంటారు. పోతే, అన్ని రకాల వాళ్ళూ ఉన్నారనుకో. గుజరాతీలూ, సింధీలు, ఆంగ్లో ఇండియన్సూ, పంజాబీలు- ఒకరేమిటి ? అన్ని రకాల వాళ్ళూ

ఉంటారు. కాలేజీ ఆవరణ లోపల ఇంగ్లీషు తప్ప తెలుగు మాట్లాడరాదు. మనం చాటుగా ఎప్పుడైనా మాట్లాడుకోడం వినపడిందీ అంటే చాలు, ఫైను ఇచ్చుకోవాల్సిందే. మనలాంటి వాళ్ళకు మొదట్లో కొంచెం కష్టంగా ఉంటుందనుకో.

"అయితే ఒక్కటి. కాన్వెంటులో కేంబ్రిడ్జి పాసయిన వాళ్ళు, మెట్రిక్ పాసయినవాళ్ళు కూడా ఉంటారు క్లాసులో. వాళ్ళదగ్గర మన ఇంగ్లీషు పనికి రాదు. వాళ్ళు బాగా ధారాళంగా మాట్లాడగలరు. సాధారణంగా లెక్చరర్లు కూడా వాళ్ళని కొంచెం అభిమానంగా చూడటం కద్దు. ఇక ఆంగ్లో ఇండియన్సుకీ, కాన్వెంటు నుండి వచ్చిన స్టూడెంట్సుకీ కొంచెం సుపీరియారిటీ కాంప్లెక్సు, అంటే తాము అధికులమనే భావం బాగా ఉంటుంది. మనలో గొప్పలకు పోయేవాళ్ళు కొందరు-వాళ్లని పూసుకు తిరగాలనీ, వాళ్లతో సన్నిహితంగా ఉండాలని ప్రాకులాడుతారు. మరింత లోకువయిపోవడం తప్ప దీనివలన లాభమేమీ ఉండదనుకో.

"ఇక సిస్టర్సు అంటావూ, వాళ్ల నర్థం చేసుకోడానికి చాలా టైము కావాలి. ఫేవరిటిజమ్, హీరోవర్షిప్— ఈమాటలెప్పుడయినా విన్నావూ, ఈ రెండూ అక్కడ బలంగా ఉన్నాయి. కాన్వెంటు నుండి వచ్చినవాళ్లని సిస్టర్స్ కొంచెం ప్రత్యేకాభిమానంతో చూస్తారు. ఇంగ్లీషు రాకుండా, కొంచెం అమాయకంగా కనుపించే అమ్మాయిల్ని లోకువ కడతారు. మనం హైస్కూల్లో చదివే రోజుల్లో ఏనాడయినా ఎండలో నిలబడ్డామా, అనూ, పనిష్మెంట్‌గా? ప్రేయర్లో ఏదో కొంచెం పక్క అమ్మాయితో మాట్లాడిందనిచెప్పి, ఒక అమ్మాయిని ఎండలో నిలబెట్టి శిక్షించింది సిస్టరు, నానా తిట్లు తిట్టి.

ఆ తర్వాత ఆ అమ్మాయి కన్నీరు, మున్నీరుగా ఏడ్చిందనుకో అది వేరే సంగతి. అదే తమ కాన్వెంటు స్టూడెంట్స్ గానీ— ఆంగ్లో ఇండియన్సు గానీ ఏ అల్లరి చేసినా సరే చూసీచూడ నట్లూరుకుంటారు. అంతెందుకు? మనకీ ఒక వ్యక్తిత్వం, బుర్రలో తెలివన్నదీ ఉంటుందన్న విషయం వాళ్ళకు తోచ దనుకుంటాను. అయితే, మంచి క్రమశిక్షణ ఉంది ఆ సంస్థలో. కాదనలేను. కానీ, ఆ క్రమశిక్షణకు సంబంధించిన రూల్సు కొందరి విషయంలోనే వర్తిస్తాయి. మరికొందరి విషయంలో వర్తించవు. అదే ఫేవరిటిజమ్‌కు ఉన్న ప్రత్యేకత.

సిస్టర్సంటే నిస్వార్థ పరులనీ, విశాలహృదయులనీ విన్నాను. చదివాను. కానీ, అది పూర్తిగా నిజం కాదని తెలిసింది నాకు. నిస్వార్థపరులే. కానీ విశాలహృదయులు మాత్రంకాదు. వాళ్ళలోనూ పైకి కనబడని సంకుచితగుణాలు కొన్ని ఉన్నాయి. ఒకటి పక్షపాతం. డబ్బూ, పలుకుబడి ఉన్నవాళ్ళని ఎంత మెహర్బానీగా చూస్తారో చెప్పలేను. ఒక సిస్టర్ ఒకమ్మాయి అంటే ఇష్టపడిందీ అంటే, ఇక తను అందలమెక్కిందన్నమాటే, దేనికయినా తనకి పర్మిషన్ వేగం దొరుకుతుంది. తను సిస్టర్ దగ్గర గారాలుపోవచ్చు. కాని, దురదృష్టవశాత్తూ ఏ సిస్టర్‌కయినా ఒకమ్మాయి మీద ద్వేషం కలిగిందీ అంటే, దాని తతిమ్మా నన్స్ అందరూ పంచు కుంటారు. ఇక ఆ అమ్మాయిలోని ప్రతి విషయంలోనూ నిరసిస్తారు. అయితే వాళ్లని చూసి మనం నేర్చుకోవలసిందేమి టంటే ఒళ్లువంచి పని చెయ్యండి! అందులో వాళ్లకువాళ్లే సాటి. తీరిక అన్నది ఏమిటో వాళ్లకు తెలియదు సోమరి తనం ఏకోశానా కన్పించదు. తమ శక్తినంతటినీ వినియో

గించి, ఒక్క నిమిషమయినా వృథాకాకుండా తమ తెలివిని నంతటినీ ఆ సంస్థకే ధారపోస్తారు. జీతమా, ఏమన్నానా? అంత నిస్వార్థంగా సేవ చెయ్యడం ఆ నన్స్‌కే చెల్లింది. పసి పిల్లల్నీ, పెంపుడు జంతువుల్నీ వాళ్లు చూసినంత ప్రేమగా మరెవరూ చూడలేరు కూడాను. ఇక శుభ్రత విషయం అంటావూ? వాళ్లకది చెల్లుతుంది; మనకది చెల్లదు. ఇంగ్లీషు వాళ్లకి పనులన్నీ సులువుగా తేలిపోతాయి. మనకు కొంత బద్ధకం. వాళ్లకది లేదు. అంతే తేడా! మరి హాస్టలు పిల్లలు తినే అన్నంలో బొద్దెంకలూ, ఈగలూ బయలుదేరుతున్నా యంటే, దానిక్కారణం ఏమంటావు? అది వాళ్ల అశ్రద్ధ కొక ఉదాహరణ.

ఇక — హీరో కర్షిప్! దీన్ని చూస్తుంటే నవ్వు వస్తుంటుంది నాకు. ఈ హీరో వర్షిప్ అన్న పదానికి తెలుగులో ఏమంటారో నాకు తెలియదు కానీ, ఒకే మనిషిని గుడ్డిగా ఆరాధించడం అని మనం అర్థం చెప్పుకుందాం. ఒక లెక్చెరర్, ఒక స్టూడెంట్, లేక సిస్టర్, ఒక స్టూండెట్ ఉన్నారనుకో. వాళ్లకు ఒకరిపై ఒకరికి అభిమానం ఉండవచ్చు. కానీ, నేను చెప్పిన హీరో వర్షిపర్స్ అందరూ అర్థం లేకుండా స్త్రీ పురుషుల్లా ప్రేమించుకుంటారు. ఉదాహరణకు ఒకటి చెబుతాను విను.

ఒకనాడు నేను మామూలుగా, రెండో అంతస్థులో మా క్లాసు రూముకి వెళ్ళిపోబోతున్నాను. డిగ్రీ క్లాసు అమ్మాయి ఒకతె బాల్కనీలో నించుని క్రిందకు చూస్తూఉంది. ఉన్నట్టుండి ఆమె చటుక్కున "అబ్బ! ఓ మై స్వీట్ హార్ట్!" అనుకుంది కళ్లు మూసుకొని తన్మయంగా! ఎవరా అని కిందికి

తొంగిచూశాను. బాటనీ లెక్చెరర్‌గా ఉంటున్న ఒక సిస్టర్ చకచక వెళ్లిపోతున్నది. ఆ అమ్మాయి ఎవర్ని చూసి ఆ మాటనుకుందో నా కర్థం కాలేదు. ఆ అమ్మాయిని బుజం తట్టి ఈ లోకంలోకి తెచ్చి, "ఎవర్ని స్వీట్ హార్ట్" అంటున్నావు?" అని అడిగాను. వెళ్లిపోతున్న సిస్టర్‌ని చూపించిందామె. ఏమంటావు, అనూ, దీనికి? నవ్వాలా, ఏడవాలా? తన సేవ నంతటినీ ప్రజలకూ, భగవంతునికీ అర్పించిన ఒక విరాగిణి అయిన సిస్టర్‌ని, ఆ అమ్మాయిగా ప్రేయసిగా భావించిందీ అంటే, ఆ సిస్టర్ విలువ దిగజారి పోయినట్లు కాదా? ఇలాంటి పిచ్చవేషాలు వేస్తుంటారు కొందరు.

లెక్చెరర్స్ విషయంలో కూడా అంతే. తనని హీరో వర్షిప్ చేసే అమ్మాయిని చూస్తూనే చిరునవ్వులు చిందిస్తుంది ఆ లెక్చెరర్, భావగర్భితంగా, ఆ అమ్మాయి సిగ్గులు ఒలక బోస్తుంది. ముడుచుపోతుంది. ఆ లెక్చెరర్ ఒక్కక్షణం కన బడక పోతే, ఆ అమ్మాయి ఏడవటం అందరూ ఓదార్చడం! ఆ సమయంలో ఆమెనొక విరహిణిని చూచినట్లు చూస్తారు తన ఫ్రెండ్సందరూ! అందరూ అలా వుండరనుకో, కొందరు మాత్రమే. కొత్తలో ఇలాంటిది నా కర్థమయ్యేది కాదు. క్రమంగా అర్థమయి, చివరికి దాన్నొక హాస్యాస్పద విషయంగా తీసుకున్నాను. అటువంటి వాళ్ళపై మా ప్రిన్సిపాల్ ఒక రోజున వ్యంగ్యంగా క్లాసులో లెక్చెర్ ఇచ్చింది కూడాను. ఆ అపూర్వారాధకుల తలలన్నీ క్రిందికి దించుకుపోయాయనుకో.

"ఈ విషయాల్ని విడిచి పెడితే, తక్కినవన్నీ బాగానే ఉంటాయి. అన్నీ క్రమ బద్ధంగా జరుగుతూంటాయి. నేను

వ్రాశానుగా, నర్మద నా బెస్ట్ ఫ్రెండయిందని. నీ విషయం కూడా చెప్తుంటాను తనకి. నీ ఫోటో తెమ్మంది"

అన్నీవిన్న అనూరాధ నిట్టూర్చి "బాగా చెప్పావు. అన్నీ కొత్త విషయాలు!—కో - ఎడ్యుకేషన్ కాలేజీల్లో ప్రణయ కలాపాలూ, ఉమన్సు కాలేజీల్లో ఇదీనా? బాగుంది" అన్నది.

"అన్నీ కాలేజీలు నేనెక్కడ చూశాను, రాధా? నా అనుభవం చెప్పానంతే!"

"సరే ఇంటి విషయాలేమిటి? ఇద్దరూ సఖ్యంగా ఉన్నారా?"

"ఊఁ— సఖ్యంగానే ఉన్నారు. వాళ్లని చూస్తూంటే నాకంతా అయోమయంగా ఉంది, రాధా! పైకి చూస్తే ఇలాగా. లోలోపల నిరాశా హృదయులుగా మాట్లాడతారు" అంటూ స్టేషన్లో జరిగిన సంభాషణ తప్ప తక్కినదంతా చెప్పింది నీల.

రాధ అంది "సరే. వాళ్లేదో పోట్లాడుకుంటారు. ఆ లేఖలను చదివి కృంగిపోకు, నీలూ! నువ్వూ, నీ వాలకం చూస్తుంటే తొందరపడి మనసు పారవేసుకునే దానిలాగే ఉన్నావు. భారవి ఒంటరివాడు కాడు. నీ అనురాగం ఫలించే అవకాశం లేదు. కాకపోయినా, పెళ్లయినవాళ్లతో ప్రణయ కలాపాలేమిటి? ఛీ. వాళ్ళ మానాన వాళ్ళని విడిచిపెట్టేయి. మన ఊహా చిత్రం ఉందిగా! హాయిగా స్వేచ్ఛావిహంగాలయి పోదాము. ఆనాడు మనల్ని ఏ కాలుష్యమూ అంటలేదు.

"మా మేనత్త కూతురుండేదిలే, కమల అని. టెలిఫోన్ ఎక్స్ఛేంజీలో పనిచేస్తూ ఉండేది. కొంత కాలానికి తనూ, తన ఆఫీసులోనే ఇంకో ఉద్యోగీ పరస్పరం ప్రేమించుకున్నారట. కమలని పెళ్ళి చేసుకుంటానని కూడా వాగ్దానం చేశాడట. క్రమంగా వాళ్ళ ప్రేమ విషయం లోకానికి వెల్లడి అయ్యాక తెలిసింది తనకి—— తను ప్రేమించినవాడు వివాహితుడనీ, పిల్లలు కూడా ఉన్నారనీ, చివరికి నిందలు భరించలేక నిస్సహాయురాలై ఆత్మహత్య చేసుకుందని. ఇప్పటికీ మా మేనత్త ఏడుస్తూంటుంది. వద్దు, నీలూ, నువ్వు వాళ్ల విషయంలో జోక్యం కలుగజేసుకోకు."

"లేదు, రాధా! లేదు. నేను కలుగజేసుకోను" కంపిస్తున్న కంఠంతో అంది నీల. కాసేపు అవీ, ఇవీ మాట్లాడి అనూరాధ వెళ్ళిపోయింది. వికలమయిన మనసుతో పడుకొని ఆలోచనలలో మునిగిపోయింది నీల.

తన మాటలతో నీల హృదయంలో తుఫాను రేపి వెళ్ళిపోయింది అనురాధ. తన మనసులో నిజంగా ఏముందో ఈనాడు బాగా తెలిసి వచ్చింది నీలకు. బావపై తన మనసులో నాటుకున్న రాగబీజం ఇంతగా మహావృక్షమై విస్తరించిపోతుందనీ, దాన్నిక పెల్లగించివేయడం సాధ్యంకాదనీ, తెలిసిపోయిందామెకు. మరి ఆశయాలు? వివాహం చేసుకోకూడదనీ, ఏదో సాధించుదామనీ! తన ఆశలు మారవు. తన ప్రేమను తనలోనే దాచుకుంది. సన్నిహిత సాంగత్యంలేకుండా ప్రేమను భావనారూపంలో ఉంచుకోవడం తన కసాధ్యమేమీ కాదు. ఆనాడు సముద్రతీరంలో తన సామీప్యంలో కూర్చొని పసివాడిలాగా తన కళ్లల్లో ఏదో వెతుక్కొనే బావ చూపులు

తన మనస్సును లాగేసుకున్నాయి. పురుషుని ప్రేమ తీక్షణం లోని మాధుర్యం తెలియగానే కొత్తగా ఒళ్లు జలదరించింది. ఆనాటినుండీ అల్లరిచేసే తన మనసుని అణచువేస్తూ వచ్చింది. కానీఅది అసాధ్యమని తెలిసి పోతూ ఉంది. బావతప్ప ఇంకో పురుషుడు ఎన్ని జన్మలకయినా తన హృదయంలో అడుగు పెట్టలేదు. అది నిజం. కాని మనసు ? ముందుకు ఉరకలు వేసే ఈ మానసాన్ని తాను ఏ కళ్లెం వేసి అదుపులో పెట్టుతుంది ? ఈ సంఘర్షణను భరించడం యెలాగ ? బావకు దూరమైపో వాలి తన ప్రేమను తాను వెల్లడి చేసికోకముందే అతని నుండి దూరంగా పారిపోవాలి. లేకపోతే ఆకళ్ళలోని పిలుపుకు తాను కట్టుబడి పోతుంది. తనకేవరో సంకెళ్లతో బంధించివేసినట్టు ఇక తనొక్క అడుగు కూడా వెనుక్కు వేయలేదు. తన బాహు వులలోనే ఇమిడి పోవాలనిపిస్తుంది. కాని తను వంటరివాడు కాడు. ఇద్దరికిమధ్య పెద్ద అగాధం ఉంది. ఆ అగాధం దాటి ఇద్దరూ ఒకటికావడం అసాధ్యం. ఆ అగాధాన్ని మరింత పెంచ డానికే ప్రయత్నించాలి. కొన్నాళ్లు చూసి హాస్టల్లోనే చేరి పోవాలి. ఇక అక్క దగ్గిరుంటే లాభంలేదు.

నీల కన్నీళ్లతో తలగడ అంతా తడిసిపోయింది. ఏడ్చి ఏడ్చి నిద్రపోయింది.

* * *

నిద్ర లేచేసరికి మూడు గంటలవుతూంది. తన ఆలోచన లన్ని ఒక కలలాగ అనిపించాయి నీలకు. చాలాసేపు నిద్ర పోవడంమూలాన వాస్తవ ప్రపంచంలోనికి రావడానికి చాలా సేపు పట్టింది. వంట గదినుండి ఏవో కేకలు వినబడుతున్నాయి. వెంకటమ్మగొంతుక పెద్దగా వినిపిస్తున్నది.

"ఇంత చిన్న గుంటవి లేవు. నువ్వు నన్నంటావా? నువ్విచ్చిన బురద కాఫీ తాగడానికి నేనేం పని మనిషినను కున్నావా? నువ్వెంత చదువులు చదివినా, నేనంత తెలివిలేని దాన్ని కానమ్మాయ్...." ఏదో ఈ విధంగా సాగిపోతూంది వాగ్ధోరణి.

నీలకు ఏమీ అర్థం కాలేదు. ఒక్క గంతులో వచ్చింది వంట గదికి. బొగ్గుల కుంపటి దగ్గర నిశ్చేష్టయి, కన్నీళ్ళు సుళ్లు తిరుగుతుండగా కూర్చుని ఉంది విజయ. ఎదురుగా వెంకటమ్మ నిల్చుని ఉంది. ఆమె నోటినుండి అడ్డు లేకుండా సాగిపోతూంది వాక్ప్రవాహం. పక్కనే కాఫీ గ్లాసు పడివుంది. నేలమీద ఒలికి పోయిన కాఫీ.

"ఏమిటి సంగతి?" అని అరిచింది నీల. వెంకటమ్మ ఇటు వైపు తిరిగింది.

"ఇదుగో నమ్మా! నీ చెల్లెలు చేసిచ్చిన కాఫీ. ఎర్రగా బురద నీళ్ళలాగా. నీకోసం, దానికోసం మంచి కాఫీ, ఫల హారం చేసుకొని నాకీ నీళ్ళు పోస్తుందా? నేనేం గతి లేని దాన్నా? నేనా వెధవ కాఫీ తాగను, ఆయన రానీ."

"ఎవరాయన? నీకేమవుతారు?" హద్దులు దాటి రాబోతూన్న ఆగ్రహాన్ని అణిచి పెడుతూ వెటకారంగా అడి గింది నీల.

"మీ నాన్న గారు........తెలీదేమిటి?"

అయితే మా నాన్నగారు వచ్చాక మా మీద చెబు తావా? ఇడియట్, నువ్వు వంట మనిషివి కావా! నువ్వు కాఫీ చేసి ఇవ్వటం పోయి, నా చెల్లెలి మీద ఎగురుతావా?

నోటిని అదుపులో పెట్టుకో. పని మనిషివి నీకింత పొగ రెక్కిందా? కండ కావరంతో పేల్తున్నావు. ఈ క్షణంలో తీసి వేయించ గలను. జాగ్రత్త."

ఎదురు చూడని మాటలకు నిర్ఘాంత పోయింది వెంక టమ్మ. నీల మంచి తనం చూసి ఆమె తన పక్షమే వచ్చి చెల్లికి మెత్తగా రెండు చివాట్లు పెడుతుందను కుంది. తన భావన లన్నీ వమ్మయి పోగా రెచ్చి పోయింది వెంకటమ్మ.

"ఓహో! నన్ను తీసేయించ గల దానివా? ఎవర్ని తీసేయించ గలవో చూస్తాను. మాట వొచ్చిన దానివి నువ్వొ క్కర్తివేననుకోకు."

నీల చెల్లెలి దగ్గరకు వెళ్ళి లేవదీస్తూ అంది. నీకెందుకు మాటలురావు? ఎంత చమత్కారివి కాకపోతే, ఎక్కడినుండో వచ్చి, పనికి వచ్చి మామీదెగురు తున్నావు? నీ మాటల చమ త్కారం ఇంకెవరికీ లేదమ్మా, వెంకటమ్మా. అయితే విజ్జూ. నువ్వెందుకు కాఫీ చేశావే, అనవసరంగా? దానికి జీతం ఊరికే ఇస్తున్నామా?

నిస్సహాయంగా కూర్చుండి పోయిన విజయకు నీలవచ్చి జోక్యం కలుగ జేసు కోగానే ఎక్కడలేని ధైర్యం వచ్చింది. "ఆదేం కాదక్కా. నువ్వు చాలా రోజులకు వచ్చావుకదా అని పడుకొని లేవగానే నీకు టిఫిను. కాఫీ ఇద్దామని స్వయంగా చేశాను. అలాగే తనకూ్కడా చేసి ఇచ్చాను. రోజూ నీళ్ళ లాగా తయారు చేస్తుంది కాఫీని. ఈ వేళ నేను చేయడం మూలాన స్ట్రాంగ్‌గా ఉంది. దాన్ని చూసి......"

"అవునులే. దాన్ని చూసి బురద కాఫీ అంటూంది కదూ? అసలు నువ్వు తనకు కాఫీ చేసి ఇవ్వటం పొరపాటు. వంట మనిషికి మనం చాకిరీ చేస్తే లోకువ కట్టియ్యదూ?— ఏ నాడయినా తను మంచి కాఫీ తాగితే కదా, దాని రంగూ, రుచీ తెలియడానికి? ఆ నీళ్ళ కాఫీ చేసుకుని దానం తటది తాగితే తగువే లేకపోను కదా!......"

"నాకు ఎంచి పెడుతున్నావా ?...అంటూ" ఇంకేదో అరవబోయింది వెంకటమ్మ.

కనుగుడ్లు పెద్దవి చేసి కఠినంగా అంది నీల. "నోర్ముయ్ నీకు మామీద సవారి చేసే అధికారంలేదు. ఇప్పటికైనా బుద్ధి తెచ్చుకున్నావూ అంటే సరే, లేకపోతే ఇప్పుడేం చేస్తానో నాకే తెలియదు. ఇల్లిటరేట్ ఫెలో! మామీద అథారిటీ చెలాయిస్తుందా? దమ్మిడీ విలువ చేయదు. కంట్రీరోగ్!"

బుసలు కొడుతూ అక్కడి నుండి వెళ్ళిపోయింది వెంకటమ్మ. నీల తిట్టిన వాటిల్లోని ఇంగ్లీషు పదాలు ఆమెకర్థం కాలేదు. కానీ, అవేవో చాలా పెద్ద తిట్లు అయి ఉంటాయని, రాఘవయ్యగారు రాగానే, ఈ విషయం చెప్పాలనీ, ఎదురు చూస్తూ కూర్చుంది.

పీట తెచ్చి ఎదురుగా వాల్చుకుని కూర్చుంటూ అంది నీల. "నేను లేచి టిఫీను చేసి ఇవ్వ వలసిందిపోయి నువ్వు నాకు ఇస్తున్నావా? అయితే ఈ డెవిల్ ఇలాగే గంతులు వేస్తూ ఉండేదా ఏమిటే?"

కుదుట పడిన మనసుతో కూర్చొని ఉంది విజయ. పకోడీల ప్లేటును ముందుకు తోసి, తానొక ముక్క తుంపి నోట్లో

పెట్టుకుంటూ అంది. "ఆఁ—నువ్వున్నావు కాబట్టి నోరు మూసుకు వెళ్ళి పోయింది కానీ...అసలు చెప్పలేము. దాని నోటికి హద్దూ, పద్దూ ఏమీలేదు. అసలిప్పటి దెబ్బలాటకు కాఫీ ఒక కారణం కానేకాదు. నువ్వూ, అనూరాధాసరదాగా మాట్లాడుకోడం చూసింది. నేను మనకోసం టిఫిను తయారు చేస్తూ ఉండటం చూస్తూ ఉంది. మనం అలా ఉంటే తన కళ్ళతో చూడలేదు. తను కూడ మనలా ఉండాలని తన కోరిక. ఆ అసూయను దాచుకోలేక, ఈ రూపంలో కక్కేసిందన్నమాట. నయమే. ఉత్తుత్తినే ఇలా ఈర్ష్యను దాచుకోలేక నాతో ఎంతగా మాట్లాడేదనుకున్నావు?"

"అయితే మరి నువ్వు నాలుగు మాటలని దాని నోరు మూయించలేక పోయావా? లేకపోతే నాన్నగారితో చెప్తే తనే ఇచ్చుకొనే వారు కదా!"

బాధగా నవ్వింది విజయ. నువ్వు బాధ పడతావని నీకేమీ వ్రాసేదాన్ని కాదక్కా. నువ్వు వచ్చాక అంతా చెబుదామని వూరుకున్నాను. నేను దాన్ని యెదిరిస్తే ఇంకేమైనా ఉందా నా కంటే పదింతల నోరుపెట్టి నానా శాపనార్థాలూ పెట్టేది. దాని నోటికి జడిసి సిగ్గువేసి వూరుకునే దాన్ని. నాన్నగారు ఇంటికి రాగానే నేను వెళ్లనక్కర లేకుండా తనే ముందు వెళ్ళి బుడి, బుడి దీర్ఘాలు తీసేసి ఏమి చెప్పేదో మరి! నాన్నగారొచ్చి నన్ను నానా చివాట్లు వేసి, దాన్ని బుజ్జగించి అలక తీర్చే వారు. అసలు ఇప్పుడు చూడు, జరిగే తంతు ఏమిటో. అంతా అలాగే జరుగుతుంది. ఏ వశీకరణౌషధం పెట్టిందో ఏమోకాని మనం ఇప్పుడు నాన్నగారికి కనిపించం."

తింటున్న పకోడీలు రుచి హీనంగా తోచాయి నీలకు. "ఇంతగా బరితెగించారా ఇద్దరూ? నాకెందు కవన్నీ వ్రాయ లేదు? సరే నాన్నగారి సుఖంకోసమని వాళ్ళిద్దరెలా పోయినా ఫరవాలేదని ఉపేక్షించి వూరుకున్నాము ఇన్నాళ్ళూ, ఈ దరి ద్రపు ఘటం మనమీద ఎప్పుడు అథారిటీ చెలాయిఃస్తుందో? ఇక ఎక్కువ కాలం దీన్ని వుంచడం మంచిది కాదు. ఎలా భరిస్తున్నావే ఇన్నాళ్లూ.

అలవాటయి పోయిందక్కా, నాన్నగారు కూడా దాని పక్షం వచ్చి నన్ను తిట్టినపుడెల్లా అమ్మ గుర్తుకువచ్చి ఏడుస్తుండే దాన్ని. అయినా నన్ను ఓదార్చేవాళ్లెవరు?" అన్నది విజయ.

నీల మనసంతా ఆర్ద్రమైపోయింది. తండ్రి తాలూకు అల్పబుద్ధి వలన సంసారమంతా ఎంతగా తారుమారయి పోయిందో స్పష్టంగా కనిపిస్తూ ఉంది.

"అయితే అలా వెళ్లిపోయింది. వంట చెయ్యదా ఏమిటి?"

"అబ్బే, మనం చేసుకోవలసిందీ. రాణీగారు అలక పాన్పు ఎక్కారు. రాజుగారొచ్చి తీర్చేదాకా అంతే."

"అయితే మనం వండితే తను తింటుందా?"

"మరేమిటనుకున్నావు?"

"ఆఁ—వండిపెడతాము! చూస్తాను. దీని దర్జా ఏమిటో. మనిద్దరికోసమే వండుతాను. అడిగినప్పుడు నేను చెబుతాలే. అయితే నాన్నగారింతగా మారిపోయారన్నమాట. కలలో కూడా అనుకోలేదు సుమా!"

"అంతా వెంకటమ్మగారి ప్రభావమక్కా! వారు దేవతగారు!"

నీల మరేమీ మాట్లాడకుండా లేచి వంట కుపక్ర మించింది. తల్లిలేని ఈ ఇంట్లో జరిగే ఈ విపరీతాలన్నీ ఆమె మెదడుకు పిచ్చెత్తించసాగాయి. ఇక ఈ విషవృక్షాన్ని పెరగ నిస్తేలాభం లేదు. ఈ శనిఘటాన్ని ఇంటినుండి గెంటెయ్యాలి. అది తన ఒక్కదాని చేతనయ్యే పనికాదు. పెద్దక్కకు పరిస్థితులన్నీ వివరించి వ్రాయాలి. అందరూ కలసి పూనుకో వలసిన కార్యం ఇది. వెంకటమ్మ స్థానం ఈ ఇంట్లో ఎంత బలవత్తరంగా ఉందో, తండ్రిలో ఎంతటి విపరీత పరిణామం వచ్చిందో తలుచుకుంటూఉంటే ఒళ్లు మండిపోతూ ఉందామెకు.

ఇంకా వంటవుతూనే ఉంది. విజయ మెల్లిగా వచ్చింది. "అక్కా! నాన్నగారు వచ్చారు. ఆవిడగారు రిపోర్టు చేస్తూంది."

"నువ్వూరుకో. అదంతా నేను చూసుకుంటాను" పొంగివచ్చే కోపావేశాన్ని అదుపులో పెట్టుకుంటూ అందినీల.

ఇంతలో రాఘవయ్యగారు పిలవనే పిలిచారు.

"విజయా!"—కఠినంగా ఉందా స్వరం. "అమ్మా!" అని ఆప్యాయంగా పిలిచే తండ్రి ఎలామారిపోయాడు!

పమిట చెంగుకు చేతులు తుడుచుకుంటూ వెళ్ళి తండ్రి యెదుట నిలబడింది నీల. "ఎందుకు?" నీల ముఖంలోని భావాలు దాచుకుందామన్నా దాగలేదు. నీల ముఖంలోని కఠినత్వం చూడగానే రాఘవయ్యగారి జోరు కొంచెం తగ్గింది.

"విజయేదీ?"

"వంటగదిలో ఉంది. ఎందుకూ?" మళ్ళీ రెట్టించింది నీల.

"అదికాదుగానీ, తను మంచికాఫీ చేసుకుని వెంకటమ్మకు నీళ్ళుపోసి, ఇంకా ఏదో వాగిందటగా !"

"ఆ కాఫీనీ, విజయ తాగడాన్నీ నువ్వు చూశావా ?"

"వెంకటమ్మ చెబుతూంది కదా !"

"అయితే అదే నిజమన్న మాట !"

"తనబద్ధాలెందుకు చెబుతుంది ? అయితే పోట్లాట కొచ్చావేమిటి ?"

రోషం ఎగిసిపడింది నీలలో. "పోట్లాటకెవరు బయలు దేరారో తెలుస్తూనే ఉంది. వంట మనిషి వంట చెయ్యకుండా అలిగి కూర్చుంటే, దాని అలక తీర్చడానికి, మమ్మల్ని తిట్ట డానికీ సిద్ధపడ్డావా నాన్నా, నువ్వు ?"

రాఘవయ్యగారు పెద్ద గొంతుక పెట్టి అరిచారు. "అయినా ఆ విజయకు దురుసుతనం ఎక్కువయిందీ మధ్య. ప్రతీదానికి తగువే !"

"నా కళ్లతో అంతా చూశాను. నన్ను మభ్యపెట్ట గలదా ఈ వెంకటమ్మ ? అసలా కాఫీ చేసుకొని మేం తాగే యాల్సింది. దానికివ్వడం పొరపాటు. అయినా నిజనిజాలు తెలుసుకొని వంట మనిషిని కసరడంపోయి, మమ్మల్ని మందలించబోతున్నావు నువ్వు."

"నిన్నెవరన్నారని అలా అయిపోతావు, విజయను అన్నాను గాని."

"విజయెవరు ? అంత భేదాన్ని చూపించే స్థితిలోకి వచ్చావా నాన్నా, నువ్వు ?" పాతాళురాలపోయింది నీల.

చాలా సేపు రాఘవయ్యగారికేం తోచలేదు.

"చూశారా? నేను వంట మనిషినట!"

వెంకటమ్మ అందించింది.

"ఆఁ! తనని వంటమనిషని ఎందుకంటున్నారు?"

"అయితే, వంటకు కాక ఇక దేనికోసం వచ్చినట్లు? ఇక ఎక్కువ కాలం దీన్నుంచడానికి వీల్లేదు."

"ఆహాఁ— వీల్లేదూ? ఎందుకు వీల్లెదూ? నా ఇష్టం! నా కోసం తనని వుంచుకుంటాను. నువ్వేడవకు వెంకటీ? పిల్లలు అజ్ఞానులు. వీళ్లేదయినా అంటే నువ్వు క్షమించాలి గానీ...."

అసహ్యం, దుఃఖావేశం హద్దులు దాటిపోయాయి నీలకు. "ఛీ, ఈ ఘటం ఇక్కడి నుండి కదిలేరోజు రాకపోదు. శునకాన్ని తెచ్చి సింహాసనం ఎక్కించితే ఏమవుతుంది?"— అంటూ చీదరించుకుని ఒక్క వూపున వచ్చేసింది నీల.

భోజనాలయ్యాక వంటింటిలోకి వెళ్లి చూసింది వెంకటమ్మ. గిన్నెలన్నీ ఖాళీగా వున్నాయి. కూరలు మాత్రం కొంచెం మిగిలి వున్నాయి. ఏం చెయ్యలేక, ఎవరినీ అనలేక గొణుక్కుంటూ పస్తు పడుకుంది.

ఈ పదిహేను రోజులు వెంకటమ్మ కారణాన చీకాకుగా గడిచినా, నీల రావటం వలన, అనూరాధ ఉండటం మూలాన విజయకు కొంచెం తేలికగా ఉంది. రాఘవయ్యగారు మాత్రం మామూలుగానే ఉన్నారు. జరిగిన పోట్లాట జరిగినా, కూతుళ్లేమీ చేయలేరనీ, వాళ్ళతో మంచిగానే పోవాలని రాఘవయ్య

వయ్యగారి ఉద్దేశం. నీల విశాఖపట్టణం వెళ్ళిపోయే ముందు రోజు బెంగపడింది విజయ.

"ఇన్నాళ్ళూ ఎంతో ధైర్యంగా ఉన్నానక్కా! నువ్వెళ్లి పోతున్నావు. కష్టపెట్టుకొని ఏం సాధిస్తారో, ఏమిటో?" అంది దిగులుగా.

నీల నవ్వి చెల్లెలికి ధైర్యం చెప్పింది: "దాని మెడలో పుస్తె అయితే కట్టలేదు గానీ— ఒక మంచిచేసే ముందు నిదానం అవసరం. దాన్నెలాగయినా పంపించేస్తాను. కాక పోతే ఉండనీ, మనకేం పోయిందీ? నువ్వేం జోక్యం కలుగ జేసుకోకు. ఎవరేం తిట్టినా నాకు వ్రాయి. దానికి పనిమనిషి కన్నా ఎక్కువ విలువ నివ్వడం మంచిది కాదు. నాన్నగారు గానీ, ఆ పిశాచం గానీ ఏం తిట్టినా నిర్లక్ష్యం చేసి వూరుకో. నీ చదువేదో నీది. ఫ్రెండ్స్‌ని ఇంటికి పిలుచుకొని సరదాగా గడుపుతూండు. నేనున్నానుగా? నాలుగు మాట లంటా రేమో గాని ఎవ్వరేం చెయ్యరే పిచ్చిదానా!" అంటూ తండ్రి తన కిచ్చిన డబ్బులో ఒక పది రూపాయల నోటు తీసి విజయ కిచ్చింది ఖర్చుకోసమని. ఆ మార్నాడే నీలా, అనూరాధా కలిసి రైలెక్కారు.

## 19

మళ్ళీ కాలేజీ రొటీన్ మొదలయింది. వైజాగు వచ్చిం దన్న మాటేగాని, నీల ధ్యానమంతా విజయమీదే ఉంది. ఎప్పటికప్పుడు ధైర్యం కలిగిస్తూ ఉత్తరాలు రాస్తూంది. తండ్రికి వ్రాసే ఉత్తరాలలో నాలుగు సూటీపోటీ మాటలు పెడుతూంది.

చెల్లెలు చెప్పినదంతా విన్నది ఛాయ. తల్లి జ్ఞాపకాలతో ఇద్దరూ దుఃఖించారు కాసేపు.

"నేను పురిటికి కూడా వెళ్ళనే నీలా! అక్క ఎప్పుడు వస్తుందో అప్పుడు వెళతాను."

"మరి నాన్నగారికేం వ్రాస్తావు?"

"అక్కడకు వస్తే చేసే దిక్కు లేదనీ, ఇక్కడ హాస్పిటల్‌లో జాయినయిపోతాననీ వ్రాస్తాను."

"సరే. నీ ఇష్టం" అనేసింది నీల.

ఇంటి గురించి విషయాలన్నీ వివరిస్తూ భారతికి కూడా వ్రాసింది. "ఎలా అయినా వంటమనిషి విషయం పరిష్కారం అయిపోవాలి. దానికి నీవే పూనుకోవాలి. ఎప్పుడు వస్తావో వ్రాయి." అని వ్రాస్తూ ముగించింది ఉత్తరాన్ని. దానికి భారతి దగ్గరనుండి వేగమే జవాబు వచ్చింది. తండ్రి నడత విషయంలో ఆశ్చర్యాన్నీ, ఆగ్రహాన్నీ ప్రకటిస్తూ, వీలు చూసుకొని వస్తానని వ్రాసిందామె. రోజులు గడుస్తున్నాయి. ఎన్ని పనులలో మునిగి ఉన్నా, తాను భారవికి సన్నిహితంగా ఉండకూడదనే ఆలోచనను మాత్రం మరచిపోలేదు నీల.

ఒకరోజు భోజనాల దగ్గర అంది: "నేను హాస్టల్లో చేరిపోవాలనుకుంటున్నానక్కా!" అని.

చరాలున తలెత్తి అర్థంకానట్లు చూశాడు భారవి. ఛాయ అతన్ని గమనించ లేదు.

"మా ఇల్లంటే విసుగుపుట్టిందా, ఏమిటే? ఉరమని పిడుగులాగ ఒక్కసారి అనేశావు" అంది చెల్లితో.

"అదేం కాదక్కా, హాస్టలు లైఫ్ ఎంజాయ్ చెయ్యాలని ఉంది కొన్నాళ్ళు."

"ఓ, దానికేం? ఒక రెండు రోజులు చేరిపో. నువ్వే చెప్పావుగా, బొద్దెంకలూ, ఈగలూ... వాటిమీద కూడా మోజుందేమో. మరి పిచ్చివేషాలెయ్యక. ఊరికే డబ్బు ఖర్చు."

నీల నోరెత్తలేకపోయింది. తాను గట్టిగా చెప్పి మర్నాడే వెళ్ళిపోవాలనుకుంది. కాని, ఛాయలోని నిష్కల్మషత ఆమెను కట్టిపడేసింది. ఛాయ మాటలు విని నీల ఊరుకోవడం చూసి స్థిమితపడ్డాడు భారవి.

భోజనాలయ్యాక నీల గదిలోనికి వెళ్లి పుస్తకం ముందేసుకుని కూర్చుంది. కానీ ఆలోచనలన్నీ ఎటో పరిగెడుతున్నాయి. ఆ ఇంట్లో ఉండి తానెంతవరకు నిగ్రహంగా ఉండగలదనేదే సమస్య. "ఛా, ఇంతగా ఆత్మవిశ్వాసం అన్నది లేకుండా పోతూంది" అని తన మనసు తానే విసుక్కుంది నీల.

"పుస్తకం ఎదుట పడేసుకొని ఏమిటాలోచిస్తున్నావు?"

తలెత్తి చూసింది. ద్వారం దగ్గర ఉన్న భారవి లోపలికి వచ్చి, నీల కెదురుగా కుర్చీపై కూర్చున్నాడు.

"నన్ను చూస్తూంటే అసహ్యం పుట్టి ఎటయినా పారిపోవాలనిపిస్తూందా, నీలా?"

"ఎవరన్నారు అలాగని?"

"మరెందుకు హాస్టలుకు పోతానన్నావు?"

"వెళ్ళిపో, బావా. అక్క వింటుంది."

"వినసీ. వంటింటిలో ఉందిలే."

మరేమీ మాట్లాడలేక పోయింది నీల.

"నేను పశువులాంటివాణ్ని మాత్రం కాను నీలా నీ కిష్టంలేనిదే నీతో మాట్లాడడం కూడా మానేస్తాను. చూడ వద్దంటే కన్నెత్తి చూడను కూడా. నీవు నా సన్నిధిలో ఉన్నావనే తృప్తిచాలు నాకు. నా యెదుట ఉండటం కష్ట మయితే హాస్టలుకే వెళ్ళిపో, పోనీ......"

ద్రవించిన మనసుతో "లేదుబావా, నేనెక్కడికీ వెళ్ళను." అంది నీల.

విషాదంనిండి ఉన్న భారవి వదనంలో ఆనందరేఖ మెరసింది.

"నా మీద ఆ మాత్రం దయఉంచినందుకు ధన్యుణ్ని." అన్నాడు కుర్చీనుండి లేస్తూ.

"కానీ, బావా! ఒక్క మాట......"

"ఏమిటది?"

నీల సంకోచిస్తూ "నాతో ఇకనుండీ సన్నిహితంగా ప్రవర్తించనని మాట ఇయ్యి" అంది.

భారవి హృదయాన్ని ఎవరో ముక్కలుగా నరుకు తున్నట్లనిపించింది. బాధను అణచుకుంటూ "అలాగే, నీలా. నువ్వు ఆ విషయంలో బెంగపడకు" అనేసి గుమ్మం దాటి వెళ్ళి పోయాడు. అతను వెళ్ళి పోగానే తలుపు గడియ పెట్టుకొని పడక మీద వాలి వెక్కి, వెక్కి నిశ్శబ్దంగా ఏడ్చింది నీల.

పురుష సాన్నిహిత్య ఎరుగని కన్నెపిల్ల తను. అతని ప్రేమతో తనని బంధించివేశాడు బావ. ఏ నాడూ కలుసుకోక

పోయినా, ఎక్కువ సంభాషించుకోక పోయినా, ఆ రెండు హృదయాలలోనూ నిక్షిప్తమై ఉండే ఒకరిపై ఒకరి........ దాన్ని ప్రేమ అనలేము....దానికో పదం లేదేమో; అన్నిటికీ అతీతమై ఇద్దరినీ మానసికంగా ఏకం చేసి వేసిన ఆ భావం ఆ రెండు హృదయాలకు తెలుసు. వియోగంతో, ఆవేదనతో మరింత వన్నె, విలువ వచ్చాయి. కానీ ఆ తపన తీరుతుందా? ఆ రెండు తప్తహృదయా లేనాటికైనా శాంతిస్తాయా? అన్నదే చిక్కు ప్రశ్న.

తలుపు కొట్టడం విని ముఖం తుడుచుకొని లేచి వెళ్ళి తలుపు తీసింది నీల. ఛాయ లోపలికి వచ్చింది. చెల్లెలి వంక ఆశ్చర్యంగా చూస్తూ "అదేమిటీ? ఎందుకేడ్చావు?" అన్నది.

నీల జవాబు చెప్పలేదు. సిగ్గుగా కిందకి చూస్తూ వూరుకుంది.

"నువ్విలా అమ్మ మీద బెంగపెట్టుకుంటే చదువు ఎలా సాగుతుంది? పద, మొహం కడుక్కుందువు గాని." అంటూ చెల్లెల్ని చెయ్యి పట్టుకొని బాత్‌రూమ్‌కు తీసుకొని వెళ్ళి పోయింది ఛాయ.

"ఇలాంటి సోదరికి ద్రోహం చెయ్యకుండా వరమియ్యి భగవాన్! అనుకుంది నీల ఆ రాత్రి నిద్ర పట్టక ఆలోచిస్తున్నప్పుడు.

ఆ మర్నాటి నుండీ, నీలా భారవి సాధ్యమైనంతగా ఒకరి నొకరు తప్పించుకు తిరుగుతున్నారు. నీల ముభావంగా వచ్చి భోజనం చేసేయడం, ఛాయకేదో సాయంచేసేసి, వెళ్ళి

చదువుకోవడం చేస్తూంది. భారవి ఏవేళకు ఇంటికి వస్తున్నాడో తెలియడం లేదు. ఇలా ఒక అయిదు రోజులు గడిచాయి.

ఆ వేళ—ఛాయకు కడుపునొప్పి వచ్చింది. మంచం మీది నుంచి దిగలేక పోయింది

"నేను లేవలేనే నీలా! నా తల్లివికావూ, ఈ ఒక్క రోజుకి సెలవు పెట్టేయి."

"నువ్వేం బ్రతిమాలనక్కర్లేదక్కా!" అంది నీల. వంటంతా ముగించింది. తాను భోజనం చేసేసింది. కడుపు నొప్పితో ఉండగా ఛాయ ఎప్పుడూ అన్నం తినదు. భారవి కోసం యెదురు చూడ సాగింది.

మధ్యాహ్నం రెండయింది. అయినా భారవి జాడలేదు.

"ఏమిటక్కా బావ ఇంకా భోజనానికి రాలేదు?" అన్నది నీల ఛాయ దగ్గరకు వచ్చి.

"ఈవేళా? ఇదేం కొత్త కాదు. వారం రోజుల్నుండే జరుగుతున్న వ్యవహారమే. మళ్లా ఏం తిక్కరేగిందో వేళకు ఇంటికి రావడం లేదు. వచ్చినా ఏదో కెలికేసి లేచి పోతు న్నారు కంచం ముందునుండి. డబ్బాలకొలదీ సిగరెట్లు మాత్రం అయిపోతున్నాయి. దగ్గుకూడా పట్టుకుంది, ఆ పాడు సిగరెట్ల మూలాన. నా బ్రతుకు ఇలా పోవలసిందేనే నీలా! ఆయనిక బాగుపడేది లేదు. మనసులో వున్నది చెప్పుకుంటేనే కదా!" అంటూ కన్నీళ్లు పెట్టుకుంది ఛాయ.

స్తబ్ధురాలై ఛాయ మాటలు వింటూ నించుండి పోయింది నీల. 'దీనికి కారణం నీవే' అంటూ మనసు ఘోషించ

సాగింది. తన ముఖం ఛాయకు కనుపించకుండా తన గదిలోనికి వెళ్ళి పుస్తకం తెరిచింది. కానీ, అందులోని ఒక్క అక్షరం కూడా ఆమె తల కెక్కలేదు. భారవి బూట్లచప్పుడు మెట్ల మీద వినబడుతుందేమోనని చెవులు రిక్కించుకొని కూర్చుంది. సాయంత్రమయింది. భారవి రాలేదు. అన్ని పనులు అన్య మనస్కంగా చేసేసింది నీల. కళ్లు మాటిమాటికి వాకిలివైపు పరిగెడుతున్నాయి.

చివరికి ఆమె నిరీక్షణ ఫలించింది. రాత్రి ఏడుగంటలవు తుండగా భారవి వచ్చాడు. కోపంతోఉన్న ఛాయ భారవిని పలకరించలేదు. దేన్నీ పట్టించుకొనే స్థితిలో లేడతడు. డ్రెస్సు మార్చుకొని, అలసటగా వాలు కుర్చీలో చారబడి కళ్లు మూసు కున్న భారవిని దూరంనుంచే చూసింది నీల. అతని మొహం పీక్కుపోయి వుంది. పెదవులు వాడిపోయి ఉన్నాయి. ఏడ్చి, ఏడ్చి వచ్చినట్లున్నాయి కళ్లు. ఆ స్థితిలో అతనిని చూస్తుంటే దగ్గరకువెళ్ళి గుండె కదుముకొని ఓదార్చి అతని దుఃఖాన్నంత టిని పోగొట్టివేయాలని నీల మనసు కొట్టుకులాడింది. లోనుండి పొంగే భావతరంగాల నణచిపెడుతూ "స్నానానికి లేవమనక్కా!" అంది.

"నువ్వే చెబుదూ! నేనంటే ఖాతరున్న మనిషి ఇలా ఎందుకు ప్రవర్తిస్తారు? నన్ను గుర్తించితే కద! అన్నది ఛాయ కనుబొమలు చిట్లించి.

నీల ఇరుకున పడింది. కొంచెం ఆలోచించి ఏం మాట్లాడ కుండానే లోపలకు వెళ్ళిపోయింది.

చాలాసేపు చూసి, చూసి "లేవండీ ఇక. రోజంతా

ఎక్కడ తిరిగారో! స్నానం చెయ్యండి వెళ్ళి." అన్నది ఛాయ కోపాన్ని మాటల్లో వ్యక్తంచేస్తూ.

భారవి నెమ్మదిగా కళ్ళు తెరిచాడు. ఎర్రగా జ్వలిస్తున్నాయి కళ్ళు. మౌనంగా లేచి స్నానాల గదివంక నడిచాడు. స్నానం ముగించుకొని వచ్చాక "భోజనానికి రావా బావా?" అన్న మాట విని తలెత్తిచూసిన అతని ఆశ్చర్యాని కవధులు లేకపోయాయి. నీల నిలుచుని ఉంది గడపదగ్గర.

ఆతని ఆశ్చర్యంలో ఆనందంలేదు. భరించలేని విషాదం మాత్రం పేరుకొనివుంది. రోజూ అతనెలా భోజనం చేస్తున్నాడో నీల ఈ రోజు ప్రత్యక్షంగా చూడగలిగింది.

"ఇలాగేనా బావా, రోజూ తింటున్నావు? ఎవరిమీద ఈ అలక?"

"అబ్బే, లేదే" అర్థంలేని నవ్వొకటి నవ్వేసి లేచి చెయ్యి కడుక్కున్నాడు భారవి.

నీలకు నవనాడులూ క్రుంగినట్లనిపించింది. ఎలాగో పనులన్నీ పూర్తిచేసుకుని తన గదిలోనికి వచ్చిపడింది. ఆ అలోచనల వేడికికాబోలు, తలనొప్పి మొదలయింది. డైరీని ముందువేసుకొని పేజీలన్నీ తిప్పసాగింది. తన ఆవేదన, కలలు, ఊహాలు — అన్ని పేజీలు ఒకసారి తిరగవేసి డైరీని తలగడ క్రింద పెట్టేసింది.

* * *

"శంకర్! ఇక నన్ను నేను వంచించుకోలేను. నా జీవిత చిత్రాన్ని మీ ముందు పరచివేయాలనిఉంది. నన్ను నేను తెరమరుగున దాచుకొని నాకింకో పేరుపెట్టుకొని

అసహజంగా వ్రాసుకోలేను. ఒక కథలాగా వ్రాసి, నా గాథ మీకు తెలియపరచాలను కున్నాను. కానీ ఈ సమయంలో నా సంక్షోభాన్ని, మానసిక కల్లోలాన్ని భరించడానికి నాకు శక్తి చాలడంలేదు. మిమ్మల్ని తిరస్కరించానని బాధపడకండి. ఎక్కడఉన్నా మీరు నా హృదయంలో మెదులు తుంటారు. మిమ్మల్ని సోదర సమానులుగా చూశానని చెప్పలేను. ఒక బిడ్డ తన తల్లిని ప్రేమించినట్టు ఒక తల్లి తన బిడ్డలను ప్రేమించి నట్టు, గురువును శిష్యుడు గౌరవించినట్టు, ఇద్దరు స్నేహితులు పరస్పరం అభిమానించుకున్నట్టు మిమ్మల్ని చూశాను. ఇంకో దృష్టి మాత్రం లేదు. ఆ భావంతో ఈ నాడు నా చరిత్ర నంతా మీతో చెప్పగలుగుతున్నాను.

ఇప్పుడు మీకంటే ఆప్తులు, నా కెవరూ లేరంటే, అది కేవలం నా స్వార్థంతో చెప్పినమాటే అవుతుంది. నేను చాలా దురదృష్టవంతురాలిని. మీలాంటి మంచి వ్యక్తి దగ్గరనుండి పారిపోతూ ఉన్నందుకు నన్ను నేను నిందించుకుంటున్నాను.

నాపేరు పట్టి సుందరి కాదు· నీలాసుందరి. కథలోని నీల ఎవరో కాదు, నేనే! మీ యెదుట చలాకీగా గంతులువేసి మిమ్మల్ని ఆకర్షించిన నాలో ఇంత గాథ దాగి ఉంది. ఇక చదవండి.

ఆరోజు రాత్రి నా మనసెంతగా కొట్టుకుపోయిందో మాటల్లో వివరించి చెప్పలేను. ఇలా అన్నం మానేసి పిచ్చిగా తెగిన గాలిపటంలా తిరుగుతూ వున్న బావను చూస్తూంటే వెళ్లు. గుండె కదుముకుని ఓదార్చు' అని మనసు ఘోషించేది. కాని బలవంతాన అణచుకు నేదాన్ని ఉద్రేగాన్ని. ఎందుకని?

నాకోసం బావ పిచ్చివాడవుతున్నాడూ అంటే నాకు నమ్మకం కలగడంలేదు. ఆ భావం లోలోపల కదిలినా దాన్ని నొక్కివేసి నేనంటే ఉత్త వాత్సల్యం తప్ప పరితాపం లేదు తనకు. 'అనుకునే దాన్ని. అన్నిటికీమించి అహం అడ్డువచ్చేది. లాలించి ఓదార్చ వలసిన బాధ్యత ఛాయది. నేనోదార్చబోతే అది హాస్యాస్పద మయిపోతుందన్న పౌరుషం!

కాని.... కాని........ఎంతమార్పు కాలంలో! ఒక్క ఇంట్లోనే పెరిగాము నేనూ ఛాయా చిన్నప్పుడు కీచులాడు కున్నాము. అందరిలాగానే పెరిగి పెద్దవాళ్ళమయ్యాము. తన పెళ్లికూడ నా కళ్ళఎదుటే జరిగింది. తన పెళ్ళికి ముందుగానీ జరిగిన తర్వాతగానీ తన సంసారంలో ఇలాంటి కలతలు రేగుతాయనీ, నేనూ బావా ఒక్కటయిపోతామనీ కలలో కూడా ఊహించలేదు. అప్పటిసరికి నా ఊహా పురుషుడు వేరు.

నేనెలా వున్నా, ఊహించడం మాత్రం కలలలోని రాకుమారుణ్ణి, అందరికంటే సుందరుణ్ణి, సమర్థుణ్ణి తలచు కుని ఒక నాయికలాగా గర్వపడేదాన్ని. అలాంటప్పుడు నా ఊహల్లోకి ఎవరైనా ఎలా చొరబడ గలుగుతారు? చివరికి ఊహలు ఊహల్లా ఉండగానే పెళ్ళి చేసుకోకూడదని నిర్ణ యించుకున్నాను. కాని చివరికి ఏమవుతూవుంది? నా మనసలా పగ్గాలు లేకుండా తన ఇష్టం వచ్చినట్టు పరుగెడుతూాందెందుకని?

కానీ, వద్దు భగవాన్! నేనున్న కారణం చేత తను ఛాయను నిర్లక్ష్యం చేస్తే నేను భరించలేను. అలాంటప్పుడు నేనుండటమే వ్యర్థం. పచ్చని కాపురంలో నిప్పులుపోసి నా సుఖాన్ని నేను చూసుకోడానికి నేను రాక్షసిని కాను. భారవీ,

ఛాయా కలకాలం సుఖంగా వర్ధిల్లాలి. ఎప్పుడూ కళకళ లాడాలి. బావకు తెలియదా? ఎన్నిమాటలాడినా, ఎన్ని మార్గాలు మళ్లినా, ఎప్పటికయినా ఏనాటికయినా ఛాయా, భారవీ కలసి ఉండటమే నిజమవుతుంది. నేనే అబద్ధ మవు తాను. ఛాయ మీద ఉన్నఇష్టాన్ని తొలగించి, బావ హృదయంలో నేనేస్థాన మేర్పరుచుకోవాలంటే ఆ దేవుడు కూడా నన్ను క్షమించడు. ఏ ప్రాణీ సానుభూతిచూపి ఆదరించదు. పశువులాగా అయిపోవడానికి నే నెవరిని? నాలో లేదా మానవత్వం?

ఇలా మంచంపై వాలి ఆలోచనలతో మునిగిపోయాను. ఆ ఆలోచనా స్రవంతికి అర్థం లేదు; ఎడతెరిపి లేదు. ఉదయం నుండీ పనిచేస్తున్న మెదడు వేడెక్కిపోయింది. కణతలు పగిలి పోసాగాయి. కదలలేని నీరసం నన్నావరించింది. మందు తెచ్చుకోవడానికి లేవలేక, పైటకొంగును తలకు గట్టిగా కట్టుకుని, బలవంతంగా కళ్లు మూసుకున్నాను. ఎప్పుడు నిద్ర పట్టిందో నాకు తెలియదు, కానీ, ఆ మగతలో కూడా నా తలలో ఒకే ఒక్క నిర్ణయం గిర్రున తిరుగుతూంది. వెళ్ళి పోవాలి. ఇక్కడ ఉండకూడదు. వాళ్ల కాపురం నాశనం చెయ్యకూడదు. ఇప్పుడే వెళ్ళిపోవాలి.

మర్నాడు ఉదయం కలలోంచి మేల్కొంచినట్టుగా మెలకువ వచ్చింది. స్టౌ వెలిగించి టిఫినూ, కాఫీ చేశాను. అక్కకూ, బావకూ అందించాను. నా సహజమైన నిర్లక్ష్యం తోనూ, చిరునవ్వుతోనూ పని ముగించుకున్నాను. నా ముఖంలోని భావాలు సాధ్యమైనంతగా బయటికి వెల్లడి

కాకుండా ఉండటానికి ప్రయత్నించాను. గదిలోకి వచ్చి నా బట్టలూ, సామానూ పాక్ చేశాను. గదికి తాళం లేసుకుని తెచ్చిపెట్టుకున్న ఉల్లాసంతో కాలేజీకి వెళ్ళబోతున్నాను.

"ఏమిటే నీలా, వింత హుషారు కన్పిస్తూంది. నీలో ?" అన్నది ఛాయ వెళ్ళుతున్నప్పుడు.

"ఒక మంచి వింత విషయం చెప్పాలక్కా, నీకు. సాయంత్రం వచ్చి చెబుతాగా ?" అంటూ వెళ్ళిపోయాను.

"ఏమిటోయ్ ఆ ఉత్సహం ? వై ఆర్ యూ జంపింగ్ ఇన్ జాయ్ ?" నా బుజాల మీద చేతులువేస్తూ అడిగింది నర్మద కాలేజీలో.

నవ్వుతూ తన ముఖంలోకి చూశాను.

"చెప్పుకో చూదాం. నీకు సంతోషం కలిగించే విషయమే."

"చెబుదూ, సస్పెన్సుతో చంపక."

"రేపటినుండే మనం హాస్టలు స్టూడెంటుగా మారిపోతున్నాం !"

ఆశ్చర్యానందాలతో గట్టిగా నన్ను కుదిపేసింది నర్మద. "హాయ్ ! హాయ్ ! ఏమిటీ నిర్ణయం. ఇంత అకస్మాత్తుగా ?"

"కొన్నాళ్ళకు మా అక్క డెలివరీకి వెళ్ళిపోతుంది. అందుకని ముందునుండీ మన సన్నాహం !"

"మరి సిస్టర్ తో చెప్పవూ ?"

"పద."

వార్డెను సిస్టర్ దగ్గరికి వెళ్ళాము. విషయమంతా చెప్పాను. ఆవిడ నవ్వుతూ అంగీకరించింది. "నీ ఇష్టం! ఇప్పుడే వచ్చేయచ్చు."

"ఫీజు నాలు గయిదు రోజుల్లో కడతాను." అని చెప్పాను. కాలేజీలో ఆ రోజంతా ఉన్నానన్న మాటేగాని పరధ్యానంగానే వున్నాను.

నాన్నగారికొక ఉత్తరం వ్రాశాను. హాస్టల్లో చదువు నిరాటంకంగా సాగుతుంది కాబట్టి చేరిపోతున్నాననీ, డబ్బు పంపించ వలసిందనీ. మా నాన్నగారడ్డు చెప్పరనీ నాకు తెలుసు. మన అభిమతం కూడా ఆదే.

సాయంత్రం ఇంటికి వచ్చి కాఫీ తాగేసి, గది తాళం తీసి మంచం మీద చేరబడ్డాను. నా వెనకాలే వచ్చిన ఛాయక్క నిర్ఘాంతపోయి నుంచుండి పోయింది. నేను నవ్వి అదేమిటక్కా ఆశ్చర్యంగా ఉందా?" అన్నాను.

"ఏమిటీ సన్నాహం? ఎక్కడికి?"

"చెప్పానుగా?"

"హాస్టలుకా?"

"యస్." నాలో ఏదో ఉద్వేగం ఉబికి వస్తూంది. అక్క ముఖం చిన్నబోయింది,

"నా జాతకమే అలాంటిదే. కట్టుకున్న భర్తకు అక్కర్లేదు. తోడబుట్టిన వాళ్ళకీ అక్కర్లేదు, నాన్నగారు చూస్తే అలాగా, ఎందుకు వెళ్ళిపోతానంటున్నావు? నిన్ను నేననుమా నిస్తున్నానను కుంటున్నావా? లేవే నీలా. జరిగినదేదీ

మనసులో ఉంచుకోకు. నేనుకూడా అన్నీ మర్చిపోయాను. నీది వెన్నలాంటి హృదయమని అర్థం చేసుకున్నానని చెప్పాను కదూ ?" అన్నది,

ఆ సమయంలో నా చెవికేదీ ఎక్కడంలేదు. చిన్నప్పుడు వీళ్ళందరూ ఎంత నిరసించే వాళ్ళు నన్ను ! ఆ క్షణంలో నేనింకో లోకంలోకి వెళ్ళిపోయాను. "అక్కా నువ్వెంత చెప్పినా నా ప్రవర్తన సంగతి నాకు తెలియదూ ? నేనుత్త పోకిరీ పిల్ల నన్న విషయం నేనెరుగుదును కదా ? అక్కాయ్, నేను నా చుట్టూ ఒక వలయం గీసుకున్నాను. అది దాటి నా మనసు లోనికి ఎవరూ ప్రవేశించలేరు. అందర్నీ శత్రువులుగా భావించి నా వలయంలోపల నేనుంటాను."

"నన్నుకూడా ద్వేషిస్తున్నావా ?"

"దానికి నేనేం చెప్పగలనక్కా ! నేను నిజంగా మంచి దాన్ని కాను కాబట్టే నా హద్దుల్లో మసలు కోవాలను కుంటున్నాను."

"నేనుండి లాభంలేదే నీలా ! అందరికీ కంటకమయి పోతున్నాను."

"అలా ఎందుకనుకోవాలక్కా ? నీ భర్త నిన్నారాధి స్తుండగా, నీ సంసారం కళకళలాడుతూ వుడంగా ఒకరి లక్ష్యం నీకెందుకు ? నిన్నెవరయినా నిర్లక్ష్యం చేస్తే వాళ్లను విదిలించి పారేయి. దురుసుగా, దర్జాగా నీ సంసారం గడుపుకో. ఒకరి లక్ష్యం అన్నది ఎప్పుడూ ఉంచుకోకు."

"అలా ఉండలేని కాబట్టే, బాధ పడుతున్నాను. ఆ మనోనిగ్రహం, స్థైర్యం ఎప్పుడో......." అన్నది. ఛాయ

గొంతుక జీరవోయింది. కళ్లనీళ్ళు తెచ్చుకొంది. "ఎవరూ నన్నర్థం చేసుకోరు. ఇక ఎవరూ చేసుకోరేమో కూడా. పోనీ ఇలాగే గడిచిపోనీ. వెళ్ళిపోవే. నిన్నడ్డుపెట్టినా మరింత బాధ నీకు. కానీ నాపై నీచ భావాలు ఇలా కలకాలం ఉండిపోవు. ఏ నాటికయినా. ఏ రోజునయినా నా హృదయం ఏమిటో నీకు తెలిసి వస్తుంది. ఆ క్షణం రాక మానదు." అన్నది.

నేను లోలోపల నవ్వుకుంటూ, "ఆ క్షణం ఎలాంటిదో అదెప్పుడు వస్తుందని నువ్వను కుంటున్నావో నాకు తెలుసు. ఆ ఘడియ రాకపోవడానికే ప్రయత్నిస్తాను. దేవుణ్ని ప్రార్థి స్తాను కూడా. ఎప్పటికీ నా మనసు మారేది లేదక్కా—ఒక పరిధిలోనున్న ప్రత్యేక వ్యక్తిని నేను. నీకు తెలుసుగా. చాలా చెడ్డదాన్ని కూడా!" అన్నాను. ఆ రాత్రి సరిగ్గా నిద్ర పట్టనే లేదు. ఛాయ బావతో చెబుతూండటం విన్నాను. "నీల హాస్టలుకు వెళ్ళిపోతుందట రేపు." అని.

బావనుండి ఏమీ జవాబు రాలేదు.

"మాట్లాడరేం ?" ఛాయ రెట్టించింది.

"ఏం మాట్లాడను ? సరే. వెళ్ళిపోనీ."

"మీ లాంటి మనుష్యులు ఎవరికీ అర్థంకారు. అందరూ కలిసి నన్నెందుకు సందిగ్ధంలో పడేస్తారు ?" అంటూ విసుక్కొంది ఛాయ.

ఆ మర్నాడు హాస్టలుకి వెళ్ళిపోయాను. రెండు రోజు లకే నాన్నగారి నుండి సమ్మతి తెలియజేస్తూ, ఉత్తరమూ, డబ్బూ రెండూ వచ్చాయి. హాస్టలు జీవితం విసుగ్గా ఉన్నది

కొత్తలో. తమ ఇష్టానుసారం పనులు చేసుకొనే వాళ్ళకు క్రమ బద్ధంగా జీవితాన్ని గడపాలంటే కష్టమే.

శ్మశానం ఉడటం వలన కొంచెం భయంగా ఉన్నా, నేను కోరుకున్న వాతావరణంలోకి వచ్చేశాను కాబట్టి సంతృప్తి కరంగానే ఉంది. ప్రొద్దుటే చర్చి గంటలు వింటూ నిద్రలేవటం స్టడీ టైములో అందరూ నిశ్శబ్దంగా చదువుకోవడం, కాలేజీకి వెళ్ళిరావడం, రిక్రియేషన్ టైములో ఆటలూ! అన్నిటికీ ఒక నిర్ణీత కార్యక్రమం ఏర్పరచ బడిఉంటుంది. స్టడీహాల్లో పుస్తకం చేత పుచ్చుకొని కూర్చునే దాన్ని గానీ: ఆలోచనలన్నీ ఛాయా భారవుల చుట్టూ తిరుగుతూండేవి.

ఏ విషాదస్మృతులలో నేను విచారంగా ఉన్నా నర్మద వచ్చి "అమ్మాయి గారెందుకు చిన్నబుచ్చుకున్నారు ? హోం సిక్ గానీ, ఫీలవుతున్నారా ?" అంటూ కబుర్లలోకి దింపేసేది. రోజూ రాత్రిళ్ళు విద్యార్థినులందరూ చర్చికి వెళ్ళేవారు తప్పని సరిగా. నేను నర్మదా మాత్రం ఉండిపోయే వాళ్లం.

శని, ఆదివారాలలో సాయం సమయాలు చాలా మనోహరంగా ఉండేవి. ఏదో ఒకపుస్తకం చేతపుచ్చుకొని స్నేహితు లందరితో కలిసి అయినా ఇద్దరమైనా దూరంగా వాకింగ్‌కి వెళ్ళిపోయేవాళ్లం. లేకపోతే తోటలోకి వెళ్ళి పచ్చిక మీద కూర్చునే వాళ్లం. రెండువైపులా పూలభారంతో వంగిపోయిన మొక్కలు మమ్మల్ని స్పృశిస్తూండగా, తోటలో బాటలవెంట సాగిపోయే వాళ్లం. రంగురంగుల పిట్టలు గాలిలో పల్టీలు కొడుతూండేవి. ఆ ప్రశాంత వేళలో చర్చి గంటలు మధురంగా ప్రసార మవుతూ ఉంటే ఆ తోటలో కూర్చుని ఫ్రెండ్స్

కోరికపై నేను పాటలు పాడుతూంటే ఈ ప్రపంచానికే దూరంగా ఏ లోయల్లోనో మేమున్నట్లు మా మధుర గీతికలు గాలిలో తేలిపోయి బాహ్య ప్రపంచంలో వ్యాప్తమవుతున్నట్లు భావన కలిగేది. హృదయమంతా మధుర వేదనతో నిండి పోయేది.

ఒకవైపు ఇంతటి ప్రశాంతత ఉన్నా, కొన్ని విషయాల్లో చికాకు కలిగిస్తుంది హాస్టలు జీవితం. కాఫి దగ్గరా. భోజనం దగ్గరా మాత్రం ఇల్లు జ్ఞాపకం వచ్చి ఏడుపు వస్తూండేది. అంత అధ్వాన్నంగా ఉండేది తిండి.

ఆదివారం రాగానే హాస్టలు అమ్మాయిలందరూ తమ కోసం ఎవరొస్తారు అని వేయి కళ్ళతో ఎదురు చూస్తూండే వాళ్ళు. నెలకొక సారి అంటే నెలాఖరున శని, ఆదివారాలలో విద్యార్థినులు తమతమ ఇళ్ళకు గానీ, బంధువుల దగ్గరగానీ గడిపి రావచ్చు. హాస్టల్లో చేరి పదిహేను రోజులయినా నా కోసం ఛాయ గానీ, భారవి గానీ రాకపోవడం నాకు ఆశ్చర్యం గానే ఉంది. "నాకు కనిపించ వద్దన్నాను కాబట్టి భారవి రాలేదు; ఛాయ రావడం అంటే కష్టమైన పని" అని సరి పెట్టుకున్నాను నేను. కాలం బాగానే గడిచి పోతూంది.

హాస్టలుకు వచ్చాక జరిగిన విషయాలన్నీ వివరంగా అనూరాధకు వ్రాశాను.

"మనం చిన్నప్పటి నుండీ ఊహించుకున్న లోకం వేరు అనూ! ముచ్చటైన తోట మధ్య ఒక బ్లూహౌస్. అందులో మన మిద్దరం. ఎంత బాగా వుందీ వూహా చిత్రం. మన స్నేహి తులతో సరదాగా గడుపుతూ, ఆటపాటలతో కేరింతాలు

కొడుతూ గడిపే జీవితాన్ని వదిలి, మమతా బంధంలో ఇరుక్కోడం నాకిష్టంలేదు. అయినా భారవిది తొలి ప్రేమ కాదు గదా రాధా! ఛాయ పైన విరక్తితో, భారవి నాపై పెంపొందించుకున్న ప్రేమను స్వీకరించలేను. నీ అభిప్రాయం వ్రాయి." అని వ్రాశాను.

"మన కలను గుర్తుంచుకొని ఆ ఊబిలో దిగనందుకు నేనెంతో సంతోషిస్తున్నాను నీలూ! నువ్వు గనుక లొంగిపోయి నట్లయితే చాలా మోసగింప బడే దానివి. ఈ ప్రపంచంలో ఎవర్నీ నమ్మకు. అందులోనూ నిండు జీవితాన్ని స్వయంగా నిర్ణయించు కోవడంలో ఎంతైనా జాగరూకత అవసరం. భార్యా భర్తలకు మధ్య అడుగుపెట్టి నీవు సాధించే సుఖం ఏముంది?" అని వ్రాసింది అనూరాధ.

ఉత్తరం చదివాక మనసు తేట పడింది. ఏవో వూహల్లో విహరిస్తూ, డైరీ వ్రాయడానికి బుక్ షెల్ఫు తెరిచాను. అంతా వెతికాను. డైరీలు కనుపించ లేదు. గుండె ఝల్లుమన్నది. చటుక్కున జ్ఞాపకం వచ్చింది. హాస్టలుకు వచ్చేముందు ఆవేళ రాత్రి చదువుకుని, తలగడకింద పెట్టేశాను. మనసంతా పాడయిపోయింది. వాటిని ఛాయ చదివేసిందో ఏమోనన్న విషయం తలచుకుంటూ ఉంటే కాళ్ళు నిలవటంలేదు.

ఎంత ప్రమాదం జరిగిపోయింది! భారవికీ, నాకూ మధ్య జరిగిన సంభాషణలూ, తనపై నామదిలో దాగి వున్న ప్రేమ అన్నీ డైరీల్లో చిత్రించుకున్నాను. ఎన్నో విషయాలున్నాయి. ఎన్ని హృదయాలున్నాయి। ఎవరితోనూ చెప్పుకోలేని విషయాలు డైరీలలో చెప్పుకున్నాను. ఎవరి ఎదుటా వెల్లడించ

లేని బాధను డైరీలలో వెల్లడించు కున్నాను. ఎవరికీ చెప్పు కోని నిర్ణయాలు, ఎవరితోనూ పంచుకోని ఆనందం అన్నీ డైరీలో ఇముడ్చు కున్నాను. నాకంటే నాకు ప్రియమైనవి నా డైరీలు, ఛాయగాని చదివితే? తాను చచ్చి పోవాలను కుంటుంది. లేకపోతే నన్ను చంపేయాలను కుంటుంది.

చప్పున వెళ్ళి, వాటిని తెచ్చేసు కోవాలనుంది. కాని పర్మిషన్ దొరకదు. ఎలా? ఎలా? దడ దడ కొట్టుకొనే గుండెతో అలాగే కూర్చున్నాను చాలాసేపు. నర్మద వచ్చింది నవ్వుతూ.

"నీ హోమ్ సిక్‌నెస్ తీరిపోతుందమ్మాయీ! అదిగో మీ అక్క వచ్చారట. వెళ్ళు."

ఒక్క ఉదుటున లేచి నిలబడ్డాను. విజిటర్సు రూమ్‌లో ఉండే సర్వెంట్ మెయిడ్ ఇంకా దగ్గరకు రాకుండానే తడ బడుతూ నడిచి వెళ్ళాను. కుర్చీలో కూర్చుని ఉన్నది ఛాయ. ఎంత మార్పు ఆమెలో! ముఖమంతా నీరసించి నిస్తేజంగా ఉన్నది. ఇంటిలో వున్న చీరా జాకెట్‌తోనే వచ్చేసినట్టుంది,

నన్ను చూచి నవ్వలేదు కూడా తను. తను వచ్చి నందుకు లోలోపల సంతోషించినా, "ఇప్పుడేం వచ్చావక్కా! ఎల్లుండేగా ఆదివారం!" అన్నాను.

"నిన్ను తీసికెళదామని వచ్చానే."

"ఏం నేనెందుకిప్పుడు?"

"నీ అవసరం చాలా ఉంది. నువ్వు వచ్చి తీరాలి. మరె క్కువ మాట్లాడకు. నా కిప్పుడు ఓపిక లేదు అన్నీ చెప్పడానికి. వెళ్ళి సిస్టర్‌తో చెప్పిరా!"

"పర్మిషన్ దొరుకుతుందో లేదో ?"

"నేను తీసుకున్నానులేవే పర్మిషన్. నా తెలుగు ఆవిడకు అర్థమైందిలే. మళ్ళీ సోమవారం వచ్చేద్దువుగాని. వెళ్ళు వేగం! అన్నది.

ఏవో చెబుదామను కున్నాను. కానీ అసలు నా నోటంట మాట పెగలందే! బొమ్మలాగా నడుచుకొని గదికి వచ్చాను.

నా వెనకాలే వచ్చింది నర్మద. బట్టలు బాగులో కూరుతూండగా, "ఇంటి కెళుతున్నావా ?" అని అడిగింది. అవునన్నాను.

"ఏం ?"

"ఊరికే. మా అక్క రమ్మంటూంది."

"ఎంత అదృష్టం! వెళ్ళిరా. వచ్చేటప్పుడు ఎర్ర గులాబీలు తెస్తావుగా ? మరచిపోకు."

వార్డెను సిస్టరును వెతికి పట్టుకుని వెళ్లుతున్నానని చెప్పాను. ఛాయా, నేనూ కాలేజీ దాటివచ్చి రిక్షా ఎక్కాం.

"ఏం? ఎందుకక్కా ఇంతా హఠాత్తుగా పిలుస్తున్నావు? కారణం చెప్పకూడదా ?" అన్నాను. సమాధానంగా నిశ్శబ్దంగా వచ్చిందామె.

"నా సర్వస్వమని ఎవర్ని నమ్ముకున్నానో వారు పూర్తిగా నన్ను మోసం చేశారే నీలా! నాఅంత నికృష్టజన్మ ఇంకెవరిదీ ఉండబోదు. తను వేళాకోళంగా అనే మాటలు ఇంత నిజరూపాన్ని దాలుస్తాయని నేనెప్పుడూ అనుకోలేదు వారి

హృదయ సామ్రాజ్యాన్ని ఏకైక రాణిగా ఏలాననీ, వారికి నేనుంటే లోకమే అక్కర్లేదనీ, అనుకున్నాను. అయ్యో! కనీసం ఈ విషయం ముందు తెలిసినా నా దారి నేను చూసుకునే దాన్ని. ఇప్పుడు పుట్టబోయే శిశువు కోసమైనా బ్రతికి ఉండాలి." నాకు కొంత కొంత అర్థం అవుతూంది.

"సరే. వివరంగా చెప్పు."

"ఇంటికి పద. చెబుతాను."

* * *

రిక్షా ఇంటి ముందు ఆగింది. ఇంటిలో ప్రవేశించి ముందరి హాల్లో లైటు వేసింది ఛాయ. నేనా ఇంట్లో అడుగు పెట్టగానే, ఎప్పుడూ నేనుండే నా గదివైపు కళ్ళు పరుగెత్తాయి. గదిలో కనిపించిన దృశ్యాన్నలా చూస్తూ నించుండిపోయాను. నా మంచం ఖాళీగా లేదు. భారవి పడుకొని ఉన్నాడు. గాఢ నిద్రలో ఉన్నట్టుంది. అలా చూస్తూ నిలబడిపోయిన నన్ను లోపలికి రమ్మని సైగచేసింది ఛాయ. ఛాయ, నేను గదిలోకి ప్రవేశించాము.

ఛాయ మంచం మీద కూర్చుని నన్ను తన పక్కన కూర్చో బెట్టుకుంది. తన ముఖంలోకి చూశాను. అతినిశ్చలంగా, నిర్వికారంగా ఉంది తన వదనం!

"రెండు నిండు జీవితాలు నీ చేతుల్లో ఉన్నాయే నీలా! మమ్మల్ని విడిచిపెట్టి ఆ హాస్టలుకెందుకు వెళ్ళిపోయావు? నిన్ను నమ్ముకున్న వారికి అన్యాయం చెయ్యనని మాటియ్యి"

"ఏమిటక్కా ఇదంతా? బావ ఎందుకలా పడుకున్నాడు? తనకి ఒంట్లో ఏమయింది?"

"నీ దగ్గర కూర్చుని ఎప్పుడూ ఏదో ఒక కథనం చెప్పడం అలవాటయింది. ఇప్పుడూ అదే కాబోతూంది. నీ డైరీలన్నీ నేను చదివాను. పూర్తిగా కాదు; నాకు కావల్సిన విషయాలు మాత్రమే."

మొదటి నుండీ భయపడుతున్నదే అయినా నా వూహ నిజమైందని తెలియగానే దిమ్మెరపోయాను. తన మీద ఏవగింపు కలిగింది. ఎంత అసభ్యం! దాని మీద ప్రత్యేకంగా డైరీలో వ్రాసి వున్నా ఎందుకు చదివింది? వాటిని చదివేసిందే అన్న చింతకన్నా, ఎంత సంస్కారం లేని పని చేసిందీ అని బాధ కలిగింది.

తేరుకుంటూ, "ఎంతపనిచేశావక్కా! అందుకేనా ఇలా అయిపోయావు? అలా పరుల డైరీలు చదువ కూడదని నీకు తెలియదా?" అన్నాను.

నా కోపం, జుగుప్స హద్దులు దాటాయి. "డైరీలంటే ఏమిటక్కా! వ్యక్తిత్వాలుకు హృదయ ప్రతి బింబమే డైరీ. నీకు వాటి విలువ ఏం తెలుస్తుంది? నా విషయాలన్నీ నేనేం రాసుకుంటానో, అది నా ఇష్టాన్నిబట్టి ఉంటుంది. ఎవరో దొంగ చాటుగా తీసి చదువుతారని చెప్పి రాసుకోకుండా ఉండ లేము కదా! ఇతరుల డైరీలు చదవడం అన్నది సంస్కారులు చేసేపని". నేనేమంటున్నానో నాకే తెలియనంత ఆవేశంగా అన్నాను.

ఛాయ ఏమీ చలించలేదు. "నిజమేనే. ఎవరెలా ప్రవర్తిస్తే నాకేం? నన్నెంతగా ఎవరు విదిలించి పారేసినా ప్రాకులాడే గుణం ఇంకా నన్ను వదలలేదుకాబట్టే నీ విమర్శలు

నన్నేం చెయ్యలేకపోతున్నాయి. చదవడం తప్పే. ఒప్పుకుంటున్నానుగా? కానీ, అది జరిగిపోయిన విషయం. ఇప్పుడు నేనేం చెయ్యలేను" అంది.

నిశ్శబ్దంగా చాలాసేపు కూర్చుని నా ఆవేశాన్నంతటినీ తగ్గించుకున్నాను. చివరికి మెల్లిగా అన్నాను.

"వాటిని చదివాక నామీద నీకు చాలా అసత్యం పుట్టి వుంటుంది. నేను చేసింది చాలా తప్పుపనే. ఒప్పుకుంటున్నాను. అయినా నీకోమాట ఇవ్వగలనక్కా! నీ జీవితంలో ఎప్పుడూ చొరబడి నీ కాపురాన్ని నాశనం చెయ్యను. సాధ్యమైనంతగా మీకు దూరంగా పోవడానికే ప్రయత్నిస్తాను." నా కళ్లంట నీళ్లు జలజల రాలాయి. "నా అంతట నేను నీకేమీ అపకారం చెయ్యలేదక్కా. ఒకవేళ చేసివుంటే క్షమించు."

చటుక్కున నా చేతులు పట్టుకుంది ఛాయ.

"అలా అనకే నీలా! ఇప్పుడు మాలోనువ్వు ఒక దానివి. నువ్వు దూరం అయిపోతే రెండు నిండు జీవితాలను నాశనం చేసిన దాన వవుతావు. అలాంటి పనెప్పుడూ చెయ్యవు కదూ?"

"అలా అంటావెందుకని?"

మెరిసే కళ్లతో ప్రాధేయ పూర్వకంగా చూసిందిఛాయ.

"నీడైరీలు చదివిన తరువాత నేను దుఃఖంతో క్రోధంతో అలమటించి పోయిన మాట అబద్ధంకాదు. నువ్వే చెప్పు పోనీ. తానే సర్వస్వమని నమ్ముకున్న భర్తకి తానేమీ కానని తెలియగానే ఆ స్త్రీ ఏమయి పోతుందో చెప్పు."

సరిగ్గా ఇలాంటి ప్రశ్నే తన కన్వయించుకొని ఆ నాడు సముద్రతీరంలో భారవి నన్నడిగాడు. నాకు నవ్వొచ్చింది.

"నవ్వుతున్నా వెందుకే? నా పిచ్చి మాటలు విని కదా?"

"కాదక్కా!"

"సరేలే. ఆ డైరీలు చదివాక ఒక వారం రోజులు నాలో నేను కుమిలి పోయిన మాటమాత్రం నిజం! ఆయనను పరీక్షించి, పరీక్షించి చివరకు నిలవదీసి అడిగేశాను. మా ఇద్దరి మధ్యా జరిగిన కల్లోలాన్ని నేనిప్పుడు చెప్పలేనే నీలా! ఆయన నోటివెంట అన్నీ విందువుగాని. ఆయన దేన్ని కాదన లేదు. అన్ని ఒప్పుకున్నారు. నీపై తనకు గాఢానురక్తి ఉండటం నిజమేననీ, కానీ నువ్వు తిరస్కరించావు కాబట్టి దూరంగానే ఉంటున్నాననీ చెప్పారు. ఇటుపైన నేను ఆ విష యంలో అనుమానం పెట్టుకోనవసరం లేదనీ కూడా అన్నారు. తప్పంతా తనదేననీ, నిన్నేమీ అనవద్దనీ చెప్పారు. దానితో పరిస్థితులు కొంచెం శాంతించిన మాట నిజమే.

"తను అందరిలాంటి మనిషి కాదే నీలా! ఆయన మనసు నంతటినీ నువ్వు హరించి వేశావంటే అది సామాన్య విషయం కాదు. నేను లేకపోయినా, తనొక్క క్షణం ఉండలేరు. నన్ను వదులుకోలేకా, నిన్ను దరి చేర్చుకోలేకా ఆయన పడే బాధ చూస్తుంటే..." ఛాయ స్వరం గాద్గదికమై పోయింది. "మీ మనస్సులలోని ప్రేమ ఎలాంటిదో నా కిప్పుడర్థం అయింది. మీరు ఒకరి కొకరు ఎంత దూరంగా పోయినా ఆ మమత విరిగి పోదు. అయినా నా స్వార్థంకోసం రెండు నిండు మనసుల్ని నేను

బాధ పెట్టలేను. ఆయన సుఖం కంటే నాకు కావలసిందేదీ ఈ ప్రపంచంలో లేదు. నమ్మితే నమ్ము, లేకపోతే లేదు. మనః స్ఫూర్తిగా చెబుతున్నాను. నా మనసులో ఇప్పుడు ఏ ఈర్ష్యా ద్వేషాలు లేవు. ఈ క్షణం నుండీ ఆయన మీద నాకెటువంటి హక్కున్నదో, నీకూ అంత అధికారం ఉంటుంది." అని నవ్వుతూ నావైపు చూసింది ఛాయ. "నీవు ఆయన హృదయరాణివే యిప్పుడు. నువ్వు లేనిది తనొక్క క్షణ మయినా ఉండలేరని నాకు తెలిసి పోయింది."

నేను తలవంచు కున్నాను.

"అసలు చాలా రోజుల్నుండీ నాకనుమానంగానే ఉంది. ఇలా తను కృసించి పోయి పిచ్చెక్క పోవటం చూస్తుంటే. డాక్టరుకూ ఆశ్చర్యంగా ఉందిట, ఆ జ్వరం ఏ మందులకూ తగ్గక పోవటం చూసి. ఆ డాక్టరుకేం తెలుసులే ఈ జ్వరం సంగతి! నేను కూడా విఫలు రాలినయి పోయాను. రాత్రింబవళ్ళు ఒకటే కలవరింతలు. ఆ జ్వరం పోవడానికి తగిన ఔషధానివి నువ్వే. ఏ డాక్టరూ ఏమీ చెయ్యలేడు."

ఛాయ లేచి నిలబడింది. "ఇంకా వంట చెయ్యలేదు నేను. చాలా రోజుల్నుండి ఇద్దరికీ తిండీ తిప్పల్లేవు. నేను వెళ్ళి ఆ వంట పనేదో కాస్త చూస్తాను. ఇక నువ్వెళ్లు. బావని ఈ లోకంలో పడేయి." నా జవాబు కాసించ కుండానే ఛాయ వెళ్ళిపోయింది గదిలోంచి.

ఒక్క గంటలో జీవితం ఎలాంటి మలుపు తిరిగింది, ఏమిటిప్పుడు నా కర్తవ్యం? అనుకున్నాను. ఏమీ తోచడం లేదు. నా కోసమని బావ ఇంత పరితపించి పోతున్నాడంటే

నాకు ఆనందంగా ఉంది. నేను లేనిది తనొక్క క్షణమయినా జీవించ లేడనుకుంటే మహా సంతృప్తిగా ఉంది. ఎంత క్రూరమయిన దాన్ని! తన సున్నిత హృదయాన్నెంత గాయ పరిచాను! కానీ, ఆ బాధలో ఎంత మధురిమఉంది! ఆలోచిస్తూనే భారవి ఉన్న గదిలో అడుగు పెట్టాను.

చంద్రుడు బాగా పైకి వచ్చాడు గాబోలు, వెన్నెల కిరణాలు కిటికీ గుండా వచ్చి భారవి ముఖంపై పడుతున్నాయి. చల్లటి గాలికి భారవి కప్పుకొన్న దుప్పటి కొసలు కొద్దిగా రెపరెప లాడాయి. లైటు వేశాను. గదంతా వెలుగు పరుచుకుంది.

భారవి కొద్దిగా కదిలాడు. తన ముఖం వంక పరీక్షగా చూశాను. జ్వర తీవ్రతలో ముఖం కమిలి పోయి ఉంది. జుత్తు చిందర వందరగా ముఖంమీద పడుతూంది. ఒక ఉన్మత్తుడులా ఉన్నాడు! ఒక్కసారి వెలుగు కళ్ళమీద పడటం వలన అనుకుంటాను, భారవి కొద్దిగా కనుబొమలు చిట్లించి, "లైటార్పేయి ఛాయా! ఈ వెలుగు.........వద్దు." అన్నాడు మెల్లిగా.

నాకు దుఃఖం ముంచుకు వచ్చింది. తమాయించుకుంటూ "ఎందుకొద్దు? చీకటి పడింది." అన్నాను. భారవి లోతుకు పోయిన కళ్ళను తెరిచి చూశాడు నావైపు. అ చూపులలో సంభ్రమం కదలాడింది.

"నీలా నువ్వా!"

నా గొంతునుండి మాట పెగల్లేదు. అలా తల వంచుకునే నుంచున్నాను. కన్నీరు ధారాపాతంగా ప్రవహించింది.

"ఏడుస్తున్నావా నీలా! ఎందుకు?"

భారవి గొంతుక గాద్గదికంగా ధ్వనించింది.

"ఛాయ వచ్చిందా నీ దగ్గరకు?"

కన్నీరు తుడుచు కున్నాను. "ఆ వచ్చింది......... అందుకే వచ్చానిక్కడకు."

తనకంతా అర్థమయి పోయినట్లుంది. కొద్ది క్షణాలు ఎవరం మాట్లాడుకోలేదు. నేను తల అటు తిప్పి తన వంక చూశాను. తదేకంగా నావంకే చూస్తున్నాడు బావ.

"లేచి నిన్ను తెచ్చుకోవడానికి శక్తి లేదు నీలా! ఇలా వచ్చి కూర్చో."

ఒకరి మనసొకరు చెప్పుకోలేకా, చెప్పుకోకుండా ఉండ లేకా బాధ పడ్డాము ఇన్నాళ్లూ. ఇప్పుడంతా తేటతెల్లమయి పోయింది. మా మధ్యనుండే అడ్డుతెర తొలగి పోయింది.

పక్కమీద కొద్దిగా జరిగి చోటిచ్చాడు బావ. కూర్చు న్నాను. నా చేతిని తన చేతులలోకి తీసుకుంటూ "ఇక ఈ చేతిని విడిచి పోవు కదూ!" అన్నాడు.

తల అడ్డంగా తిప్పాను. తన స్పర్శ చురుక్కు మంటూంది.

"నీలూ! నా నీలూ!" తన కాలే గుండెలపై చేర్చు కున్నాడు. కను రెప్పలపై మాటిమాటికీ పెదవులతో స్పృశిం చాడు. "ఆ వేళ చెప్పానుగా ఏకాంతంలో నీకేదో చెబుతానని? ఇదిగో!" నా అధరాలు ఆ వేడికి మాడి పోయాయి.

"ఎన్నాళ్ళకు నీలూ! ఇలా నిన్ను నా హృదయంపై చేర్చుకోవాలని ఎంత ఆరాట పడ్డానో నీకెలా తెలుస్తుంది?

నువ్వు ఆ నాడు చెప్పినట్టు చెట్టులూ, పుట్టలతోనే నా వేదన చెప్పుకొని ఏడిచాను. మరెప్పుడూ ఏడిపించవు కదూ? ఇలా నా చేతుల్లో ఎప్పుడూ నిన్నుంచుకోవచ్చునని చెప్పు."

"ఇంత నీరసంలో ఎక్కువ మాట్లాడకు బావా! ఇక వెళ్ళనుగా? ఎక్కడకీ వెళ్ళను నిన్ను విడిచిపెట్టి. మరి పడుకో. ఏదన్నా తాగుతావా?"

"వద్దు. నీ ఒడిలో పడుకుంటా నీలూ. కొన్ని యుగాల తపన తీరుతుంది."

నవ్వుతూ లేచి తన తలవైపు కూర్చున్నాను. తన తలను నా ఒడిలో ఉంచుకున్నాను. తన నుదుటిపైపడే క్రాపును సర్ది, నుదుటిపై చేయివేసి కూర్చున్నాను.

"అబ్బ, ఎంత శాంతి నీలూ! ఇన్నాళ్ళెందుకు మురిపించావు? నువ్వికనాకు లభించవని ఎంతగా పిచ్చెత్తిపోయాను. ఇప్పుడు నా హృదయం నా దగ్గరుంది"

"ఎక్కువ మాట్లాడవద్దు బావా! జ్వరం తగ్గాక ఇష్టం వచ్చినంత సేపు కబుర్లు చెబుదువుగాని. అప్పుడు వింటాను."

"ఇంకేదీ జ్వరం? నిన్ను చూడగానే అది పారిపోయిందప్పుడే; పోనీలే మరిమాట్లాడను. నన్నొదిలి వెళ్ళిపోవుగా?"

"లేదు. వెళ్ళను."

అతులేని తృప్తితో కళ్ళు మూసుకున్నాడు బావ. తన తలను నిమురుతూ, తన గుండెపై చెయ్యి వేసి అలా వుండిపోయాను.

* * *

అది చాలా మధురమైన రాత్రి. మాధుర్యం కన్నా మధుర మయినది. భారవితో విడిపోని బంధాన్ని కలిపిన రాత్రి. ఆ రేయితో నా జీవితం ఒక మలుపు తిరిగి పోయింది. నాలోని ప్రేమనంతటినీ భారవికి ధారపోసి తనను నా వాణ్ణిగా చేసుకున్నాను. ఒక మనిషిగా చెయ్యి గలిగాను.

దగ్గు వస్తూందని చెప్పి, సిగరెట్లు మానేయక పోతే ఇక మాట్లాడనని చిన్న పిల్లలను బెదరించి నట్లు బెదిరించాను. అప్పుడా సిగరెట్ డబ్బా నా చేతుల్లో పెడుతూ "ఈ వాళ్టి నుండీ త్రాగను. ఈ రోజు జ్ఞాపకం ఉండే టట్లుగా ఈ డబ్బా ఉంచు." అన్నాడు భారవి. దాన్ని పదిలంగా దాచాను.

ఈ సంగతులన్నీ అనూరాధకు వ్రాయడానికి జంకాను. హాస్టలుకు వచ్చాక నాకు మైకం వదిలి పోయి నట్లనిపించింది. "ఏం చేశాను ? ఎటువంటి జీవితంలో అడుగు పెట్టాను ?" అని ప్రశ్నించుకుంటే ఒక్కొక్క రాత్రి నిద్ర పట్టేది కాదు. చాలా చెడ్డ పని చేశానని అంతరంగం గోల పెడుతూ ఉండేది.

ఏమిటో ! ఈ మానవులకు మనసు నివ్వడంలో చాలా పొరబాటు చేశాడు. మనసిచ్చి పుచ్చుకోవడం, ప్రేమాంకురాలు మొలకెత్తడం, మనకోసం తపించే వాళ్లులేరని బాధ పడడం, దూరమయి పోయామని బాధ పడడం ! అంతా విచిత్రం !

అన్ని దుర్వ్యసనాలలోనూ ఈ ప్రేమను కూడా ఎవరైనా చేర్చితే బాగుండును. పట్టుకుంటే ఇక వదలదని అందరికీ తెలుసు. సరే దీని గురించి కొత్తగా ఆలోచించేదేముంది! ప్రేమ లేనిది సృష్టే లేదు.

కాని...మనిషిగా పుట్టాక ప్రేమకోసం వెతుక్కోడం సహజం. మనకోసం ఒక వ్యక్తి తపించనిదే ఇక సార్థకత ఏముంది? మనం లేకపోతే మనలను ప్రాణసమానంగా ప్రేమించే వ్యక్తి ఒకరు జీవించలేని స్థితికి వస్తారని అనుకుంటే మనసుకు ఏదో తెలియని ధైర్యమూ, సంతృప్తీ కలుగుతాయి. ఈ భావ పరివర్తన మానవులకు సహజం. ఇటువంటి అలౌకిక ప్రేమను భగవంతుడు కూడా సంతోషంగా దీవిస్తాడని నాకు నమ్మకం ఉంది.

చూచీ చూడగానే నన్ను తన దానిగా చేసుకోవాలనే గాఢ వాంఛను హృదయంలో పదిలంగా గుప్త పర్చుకున్నాడు భారవి. కొన్నాళ్ళ పరిచయం తర్వాత భారవి లాంటి వ్యక్తి నాకు తోడయితే బాగుండుననే భావాన్ని వెలువరచక దాచుకున్నాను నేను. ఎవరం తొందర పడలేదు మొదట, మేమిద్దరం ఒకరి నొకరు ఆశించుకోడం వ్యర్థ మని ఇద్దరికీ తెలుసు.

అయితే యిద్దరిలోనూ కలిగిన ఈ భావ బీజాలే మా కలయికకు కారణమా? చెప్పలేను. ప్రప్రథమంగా మా ఇద్దరికీ ఒకరిమీద ఒకరికి ఉన్న గుప్త ప్రేమచేత గాఢ విశ్వాసం అంకురించింది. నామీద తనకున్న ప్రేమే నన్ను తోడు తీసుకోమని ప్రోత్సాహ పరిచిందేమో! బావపై నాకు గల ఆప్యాయత తనను ఒదార్చడానికీ, సంతోషంగా ఉంచడానికీ పురికొల్పిందేమో! అయినా మా బంధం శాశ్వతమా! ఎంతవరకు అందరి మన్ననలను పొందుతుంది ఇది?

ఎందుకో నా మనసు కీడునే శంకిస్తూంది. స్త్రీ హృదయం లోతు ఎవరూ కనుక్కోలేరు. ఛాయలో ఈ

నాడున్న సద్భావమే రేపూ ఉంటుందని నమ్మక మేమిటి? ఒక యింటి కోడలుగా, ఒక గృహస్తుకు ఇల్లాలుగా లేని నన్ను ఎవరు గౌరవిస్తారు? కేవలం ప్రేమ తప్ప హక్కూ, చనువూ నా కెక్కడి నుండి వస్తాయి? అధికారానిదే ప్రథమస్థానం. దాని కున్న విలువ అభిమానానికి లేదు.

ఇంకెన్నాళ్ళు? నా చదువు పూర్తయి పోగానే ఇంకో చోటికి పోతాను, ఇంకెవరి ప్రమేయమూ నాకు ఉండదు. ఏ విపరీతాలూ జరుగకుండానే వాళ్ళ జీవితంలోంచి తప్పించుకోడం మంచిది. ఆ భావాన్ని వెల్లడి చెయ్య కూడదు బావ బాధ పడితే నేను చూడలేను అప్పుడు మా బంధం మరింత పటిష్టం అయిపోగలదు. ఇలా సాగిపోయేవి నా ఆలోచనలు.

చదివానే కానీ, ప్రేమికుల విహారాలు అంత మధురంగా ఉంటాయని నాకు తెలియదు. సాంద్ర తీరాలలోనూ, కొండ లోయలలోనూ, తోటల లోనూ మేము గడిపిన క్షణాలు మరువలేనివి. వాటికి విలువ కట్టలేము.

అయితే ఈ తీయని ఘడియల వెనుక అంతులేని దుఃఖం దాగి ఉంది. నా సన్నిధిలో ప్రపంచాన్నే మరిచే వాడు భారవి. మేము ఈ లోకానికి వచ్చి తుళ్ళుకుంటూ ఇల్లు చేరుకొనే వేళకు ఛాయ తలుపులు తెరిచేది.

తన ముఖం చూడ్డానికి భయం వేసేది నాకు. తన ముఖం జేవురించి ఉండేది. ధుమధుమలాడేది. పిల్లిలా వెళ్ళి పడుకొనేదాన్ని గుట్టుచప్పుడుగా. భారవి ఏ అర్ధరాత్రో వచ్చి తన చేతులతో చుట్టేసేదాకా మెలుకువ వచ్చేది కాదు. కానీ—ఇలా చెప్తున్నందుకు నాకు సిగ్గేమీ లేదు. ఆ

సమయంలో తన చేతుల్లోంచి తప్పించుకుని ఎటయినా పారి పోదామన్నంత ఏవగింపు కలిగేది నాకు. ఇందులో నేననుభవించే ఆనందం ఏమిటి? అనిపించేది.

బావకు దూరంగా పారిపోదామని కఠోర నిర్ణయం చేసుకున్నాను! కాని భగవాన్! నేను చేస్తున్నదేమిటి? ఎంత శక్తి విహీనురాలినయిపోయాను! ఎంత దుర్బలత్వం వచ్చేసింది! స్త్రీసహజమయిన ప్రేమాభిమానాలు నాలో ఎందుకు? ఆ స్నేహానురాగాలే నన్నాఖరికి బలిగొంటాయా?

రోజులు గడుస్తున్నకొద్దీ నాలో అశాంతి అధికమై పోతున్నది. భారవి ప్రేమ ఎలాంటిది?

ఒక్కరికీ సంపూర్ణంగా ఇవ్వలేక, తన హృదయాన్ని రెండు ముక్కలుచేసి పంచుతున్నాడన్నమాట. అది చాలా క్రూరమయినది. ఒక వ్యక్తికి ఒక్క హృదయమే అంకితం కావాలి.

నేను సాధించాలనుకున్నది నెరవేరకపోదు. భారవి ప్రేమలోని భాగాన్ని నేను పంచుకోకూడదు. ఎవరిదో ఒక్కరిదే ఆ అధికారం. నాకులేదు. ముమ్మాటికీలేదు. నేను ప్రేమించిన వ్యక్తి మరొక హృదయానికి నాధుడనే సత్యాన్ని నేను భరించలేను. నాలో అంత విశాలత లేదు. నన్ను పువ్వుల్లోపెట్టి ఆరాధించాలి, నేను పూలతో పూజించుకోవాలి. నన్ను నవ్వించాలి, నేను నవ్వించాలి. నన్ను తనలో ఇముడ్చు కొని. నాలో లీనమయ్యే వ్యక్తి నాకు కావాలి. అలాలేని ఈ జీవితం నాకు వద్దు. నేనే ఇంత అసూయతో కుమిలి పోతుంటే ఛాయ ఎంత బాధపడాలి!

నిజమే, ఛాయ బాధపడుతూంది. ఒక్కో సమయంలో బాగా ఏడిచేదని తన ముఖమే చెబుతూ ఉండేది. నేను హాస్టల్లో ఉన్నప్పుడు నాకేం తెలిసేదికాదు. కానీ ఇంటికివచ్చాక వారిద్దరిమధ్య జరిగే వాక్కలహాలు చెవులపడుతూండేవి. ఛాయను భారవి సమాధాన పర్చడానికి చూడడం, ఛాయ అప్పుడప్పుడూ మాపై విసిరే సూటీపోటీ మాటలూ, ఒకరు తింటూన్న ఆకులో చెయ్యిపెట్టాననే భావనా నాలోని అసహ్యాన్నీ, అసహనాన్నీ రోజురోజుకు మరింత పెంపొందిస్తూన్నాయి.

రోజురోజుకూ పరిస్థితులన్నీ అశాంతికరంగా తయారవుతున్నాయి. ఎవరమూ పైకీ పోట్లాడుకోము. మనసులో ఉన్న ద్వేషాలూ, కక్కలేము. ఇలాగే బాధపడుతూండగా రోజులు గడిచి పోతున్నాయి.

ఛాయ ఎప్పుడయినా పోట్లాట వేసుకున్నప్పుడు, నేను చిన్న బుచ్చుకుంటే భారవి ఓదార్చేవాడు – "తను ఉత్త అమాయకురాలు నీలూ! మనసులో ఏదీ ఉంచుకోలేదు. పైకి అనేస్తుంది నువ్వు బాధపడకు. నిజానికి ఆ దేవత ఋణం నా చర్మంతో చెప్పులు కుట్టిచ్చినా నేను తీర్చుకోలేను." అని. నేనేమీ మాట్లాడే దాన్నికాదు.

వీళ్లతో మెలుగుతూ ఇలా నాజీవితాన్ని కొనసాగించానంటే కొనవరకూ యీ మాటలే వినవలసి వస్తుంది. ఎవరైనా కానీ, ఒకరి దయాదాక్షిణ్యాల క్రింద బ్రతికే అవసరం నాకు లేదు. ఒకరికి తలవంచి బ్రతుకలేను. నా అహంకారం దానికి అడ్డం చెబుతుంది. కేవలం ప్రేమతో బ్రతికిపోలేను. సంఘం

లోనూ, గృహంలోనూ నాకు ఒక ఇంటి కోడలుగా, గృహిణిగా ఉన్నప్పుడే నిండుతనం. ఏదీ లేకపోతే పూచీలేదు. కానీ ఈ విధమయిన మురికి జీవితంతో నేను తృప్తిపడలేను. కాని, ఇన్ని చికాకులలోనూ ఒక ధైర్య మెదులుతూండేది. అనూ రాధ నన్నాదుకుంటుంది. పెద్దక్క ప్రేమగా చూసుకుంటుంది. అందరూ అభిమానిస్తారు. ఛాయా భారవీ లేకపోయినా నేను బ్రతకగలను అని ధైర్యంగా ఉండేది.

ఛాయ వెటకారం మాటలు నా హృదయాన్ని మరింత పాషాణంగా మార్చాయి.

"మీ ఇద్దరిదీ గాంధర్వ వివాహం గాబోలు. నువ్వంటే బావకు ప్రాణం అటకదా! మీ ఇద్దరికీ పెళ్ళిచెయ్యడమే నా ముఖ్య లక్ష్యం. ఆ కాస్తా జరిగిపోయాక హాయిగా చచ్చి పోతాను."

ఎంత సహజత్వం ఉంది దానిలో! మా ఇద్దరి వివాహం ఒక వ్యక్తికి మరణ కారణమన్న మాట!

"నేను దూరం చేసినప్పుడు నీ మూలంగా బావకు ప్రేమలభిస్తూంటే మరి నా బాధ తెలిసేదెలా? ఒక వ్యక్తిని ఎవరూ ప్రేమించనప్పుడు ఆ వ్యక్తి అనుభవించే యాతన ఎటువంటిదో బావకు తెలిసిరావాలి. నువ్వెప్పుడు తనను దూరం చేస్తావో ఆ నాడే ఆయన నన్నర్థం చేసుకో గలరు.

"నువ్వంటే పవిత్రురాలివనుకున్నాను గానీ, నా చెల్లెలే ఇలాంటి పని చేస్తుందని అనుకోలేక పోయానే నీలా! తనకా నాడు అంత బాధగా ఉంటే, నన్నుచంపేసి తనూ చచ్చి

పోవాల్సింది. అంతేగాని మమ్మల్ని ప్రేమించుకోమన్నానా ఏమిటి ?"

ఏదైనా పడనివస్తువు తింటూంటే ఛాయకు అడ్డువచ్చే దాన్ని తినవద్దంటూ.

"నా కోర్కెలన్నిటినీ విఫలంచేసి, నా జీవితాన్నే నువ్వేలాక్కున్నావు. కనీసం ఈ జిహ్వా చాపల్యాన్నయినా తీర్చుకోనియ్యి" అనేది.

"నీకూ బాధలేదు. ఆయనకూ బాధలేదు. మీరిద్దరూ ఏనాటికయినా ఒకటి. ఇక నామాట అంటావూ, నన్ను ప్రేమించేవాళ్లు ఎవరూలేరు. నేను చచ్చిపోతే ఆయనకూ, నీకూ అందరికీ సుఖమే. అయినా వివాహితులయిన పురుషులను ఈ స్త్రీలెలా ప్రేమిస్తారో నాకాశ్చర్యంగా ఉంటుంది సుమా!"

ఏం చెప్పను ? ఒక్కొక్కమాట గుండెల్లో బల్లెంలాగా దూసుకొనేది. నాకు తగిన శాస్తి అదేనని సంతృప్తిపడేదాన్ని. భావిజీవితం గురించి కలలుకనే ఏ కన్నెపిల్లకూ ఇటువంటి జీవితం వద్దు. ఇలాంటి జీవితం ఒక ముళ్ళడొంక. దానిలో అడుగుపెట్టాక ఎటు తప్పించుకోజూచినా గాయలుకాక మానవు.

ఒక్కొక్కసారి భారవి దగ్గర వ్యక్తం చేసేదాన్ని నా భావాలు.

"ఏ నాటి కయినా దూరం అయిపోవలసిన దాన్నే బావా! మధ్యలో వచ్చిన దాన్ని మధ్యలోనే పోతాను. ఇలా నాతో గడిపిన రోజులేనాడయినా గుర్తుకి తెచ్చుకుంటావా ?" అన్నాను ఒక రోజు.

మరు క్షణంలో ఆందోళనతో నా వైపు చూచే భారవిని గుండెలకు హత్తుకుంటూ, "ఛ, లేదు బావా! ఊరికే అన్నాను. నిన్ను విడిచి నేనెక్కడికి పోగలను?" అన్నాను.

"నీ మనసులో ఏదో ఉంది నీలూ! నాకు చెప్పవా అది? ఏదో నీ హృదయంలో దాచుకుంటున్నావు. నాకు దూరం అయిపోవాలనే కోరుకుంటున్నావా? నిజంగా? నా దగ్గర ఉండటం నీకిష్టం లేదా? నీలూ! నిజం చెప్పు." అని భారవి అంటే నాకు దుఃఖం పొంగి వచ్చేది ఆ సమయంలో.

"నాకింకెవరున్నారు? ఏ ఆశతో జీవిస్తున్నానో నీకు తెలియదా? నాకు దూరం అయిపోతే ఎలా ఉంటాను." అంటూ ఉంటే ఉబికే దుఃఖాన్ని అణుచుకుంటూ తల అడ్డంగా తిప్పి "లేదు. అలా అనుకోడం లేదు." అన్నాను.

"నన్నెప్పుడూ విడిచి పోవుకదూ!"

"విడవను."

"నేను చని పోయేటప్పుడయినా ఒక్కసారి నా దగ్గరకు వచ్చి నీ గుండెలకు హత్తుకో నీలూ! నా ఆత్మ శాంతిస్తుంది."

కన్నీటితో తన నోరు మూసేశాను. "నన్ను నమ్మ బావా! నిన్నెలా నమ్మించేది?"

"నమ్ముతాను. ఏ శక్తీ మనను వేరు చేయలేదుకదూ? మరింత దగ్గరగా లాక్కొని గాఢంగా నిట్టూర్చాడు భారవి.

ఒక్కోసారి అనేదాన్ని. "నేను నీకు దూరమైపోయినా బ్రతగ్గలను బావా! కానీ, ఛాయ అలా కాదు. తనకి నువ్వే

ఆధారం. ఆ బంధాన్ని విడిచి పెట్టుకొని నువ్వు నన్ను చేర లేవు. నేనెక్కడున్నా నాకు సంతృప్తి ఉంటుంది. నా బావని ఎవరో ఒకరు ప్రాణంగా చూసుకొని సుఖ పెడుతున్నారు కదా అని నాకు ధైర్యం ఉంటుంది. ఆ ధైర్యంతో సంతోషంగా చనిపోగలను కూడా."

సెలెక్షన్ పరీక్షలయ్యాయి, సెలవులకు ఇంటికి వెళ్ళి వచ్చాను. హాస్టల్లో ఉండబట్టి ఆ మాత్రం మనశ్శాంతిగా ఉంది. కానీ, లేకపోతే ఏమయ్యేదాన్నో! ఛాయకు నెలలు నిండాయి ఇద్దరి బలవంతంపై కాలేజీకి ఒక వారంరోజులు సెలవు పెట్టి ఇంటి దగ్గర ఉండిపోయాను. తనవైపు వాళ్ళుగాని, మా వైపు వాళ్ళుగాని రాలేదు సాయ పడేందుకు.

ప్రసవం కొంచెం కష్టమయింది. ఛాయ నొప్పులు పడుతున్నప్పుడు భారవి ముఖంలోని ఆందోళనను వర్ణించలేను. "ఏం చెయ్యను నీలూ?" అంటూ నా దగ్గర ఏడిచేశాడు.

ఛాయ పండంటి పిల్లవాణ్ని ఎత్తుకుంది. ఇద్దరి ముఖాలూ గర్వంతో వెలిగి పోసాగాయి. బాబు నెత్తుకుంటూ తండ్రిగా మురిసి పోయాడు భారవి.

"చూసుకున్నారా మీ కొడుకుని" అన్నది ఛాయ.

"చూడూ, అప్పుడే అమ్మా అంటున్నాడూ? వారి ముఖంలోని ఆనందం నేను వర్ణించలేను. తొలిసారిగా తమ నోముల పంట నెత్తుకున్నప్పటి ఆనందం వారి జీవితంలో మళ్ళి అనుభవించ గలరా?

"నీవులేకపోతే ఏమయి పోయే వాళ్ళమో నీలా! బహుమానం కోరుకో!"

"ఇస్తావు కదా మరి? మాటతప్ప కూడదు."

"ఓ"

"బాబు నిచ్చేయ్ బావా."

"ఎంతాశ! అది తప్ప ఇంకోటేదయినా అడుగు."

నవ్వుతూనే అన్నాను. "ఎందుకూ, అడిగిందే ఇవ్వలేక పోయాక?"

కానీ ఆ వేళ రాత్రి కూర్చొని అంతా తల్చుకున్నాను. ఎంత భేద భావం! తన సంతానమంటే ఎంత లోభం! అది సహజం. అందులో వింతలేదు. ఒకనాడు ఈ వైవాహిక జీవితం నిరసించిన నాకు, ఈ నాడు అందులోని మధురిమలు, ఒక్కొక్కటీ అర్థమవుతున్నాయి. తీరా అందుకో బోయేటప్ప టికి అందని పండయి పోయింది జీవితం.

బావతో వైవాహిక జీవితాన్ని నేను భరించలేను. నా తోటి అనుభవాలేవీ తనకు కొత్తకాదు. నాకే కొత్త గానీ. తన పిల్లకు తల్లిగా ఛాయనూహించు కున్నాడు. "నాన్నా!" అన్న పిలుపులోని మాధుర్యాన్ని తన బాబు ద్వారా అనుభవిస్తాడు. వేవిళ్ళతో సిగ్గు, సిగ్గుగా భారంగా తిరిగే ప్రేయసిలి చూస్తూ మైమరచే అనుభూతి భావకి కొత్త కాదు, ఆ అనుభూతి మరిరాదు. అదంతే.

జీవితాన్ని రుచి చూస్తున్న తనకూ, ఇంకా బంగారు కలలు కనే నాకూ పోలిక ఎక్కడ? నాకలలు ఏనాటి కయినా తీరేవి కావని నాకు తెలుసు. ఆ తీరని మధుర దృశ్యాలన్నిం టినీ కళ్ళముందు పరుచుకుంటాను. కొంచెం సేపు వాటిలో– ఆ కలల అలలలో తేలియాడుతాను. కాసేపు పోయాక వాస్త

వానికి దిగివస్తాను. నేను కనేకలలన్నీ నాకందని నక్షత్రాలని తెలుసుకుంటాను. నిస్సహాయంగా విరక్తి చెంది వున్న భావాలన్నీ కన్నీటి రూపంలో కరిగిపోతాయి.

అప్పుడు బరువెక్కిన గుండె తేలిక పడుతుంది. ప్రతి స్త్రీ తన జీవితంలో వేటినయితే మధురంగా భావించు కుంటుందో అవన్నీ నాకీనాడు జుగుప్సాపూరితా లయ్యాయి. ఏవైతే సర్వ సాధారణంగా ఉంటాయో ఆ విషయాలన్నీ నాకు గొంతెమ్మ కోరికలయ్యాయి.

అమ్మ ఉంటే నన్నొక నవ వధువుగా చూసి నేను గృహిణిగా కాపురం చేస్తుంటే చూడాలని కోరుకొనేదేమో! ఈ నాడు అలా ఆత్రుత చెందే వాళ్ళులేరు. నాలో ఆ కోరిక లున్నాయనుకుంటే నాకు సిగ్గువేసి నవ్వు వస్తుంది కూడా. అన్నీ అనుభవించి మళ్ళీ వెనక్కు వెళ్ళాలను కోవడం చాలా పిచ్చి పని. నేను కలలోనైనా తలచుకోని 'వివాహం' అన్న పదంపై మాటి మాటికీ నా ఆలోచనలు పరుగిడుతున్నాయి,

ఎవరికీ చెప్పుకోలేను. గుంభనగా దాచుకొని కాలం గడుపుతున్నాను.

* * *

పబ్లిక్ పరిక్షలయిపోయాయి. బాగానే వ్రాశాను. సెలవులకు ఇంటికి వెళ్ళిపోతాననుకుంటే సంతోషంగా వుంది. భారవిని విడిచి వెళ్ళాలనుకుంటే బాధగానూ వుంది.

"ఏమిటి వచ్చేసంవత్సరం ప్రోగ్రాం?" అన్నాడు భారవి.

"వచ్చే యేడు రాయవేలూరులో "ఎమ్. ఎ. చదవాలని ఉంది బావా, క్లాసువస్తే" అన్నాను.

"ఛ, నన్ను విడిచిపెట్టి వెళ్తావా? ఇక్కడే చదవాలి. నా నీలూని నేను చదివించుకుంటాను. ఎవరి ప్రమేయమూ అక్కరలేదు." ఈమాట చాలాసార్లు విన్నాను. అదో ధైర్యం.

విజయ చాలా చిక్కిపోయింది. అనూరాధా, నేనూ కలుసుకున్నాము తిరిగి. అనూరాధ ఒక కొత్త అందంతో వెలిగిపోతున్నది.

"ఏమిటి నీలూ, ఇలా అయిపోయావు?" అన్నది. నేను పేలవంగా నవ్వాను.

"బాగానే ఉన్నానే!"

"ఎలా వున్నాయి పరిస్థితులు?

"కొద్ది రోజులాగు. అంతా సావకాశంగా చెబుతాను." అన్నాను." "నీకు కాకినాడ నీరు బాగా పడిందికదూ! ఇంత అందంగా తయారయ్యావేమిటి?

"నీకు ఒక సంతోషవార్త చెబుతాను నీలూ!" అంది అనూరాధ. "పెళ్లి. పెళ్లి అంటే మనం చాలా డిస్‌లైక్ చేసే వాళ్ళం! కానీ, నీ అనూరాధ, పెళ్లిచేసుకోబోతూంది, నీలూ!"

నా ఆశ్చర్యానికి అవధులులేవు. ఎవరా అదృష్టవంతుడు?"

"డాక్టర్ కృష్ణానంద్." సిగ్గుపడుతూ చెప్పింది రాధ.

"చెప్పు, చెప్పు అంతా వివరంగా."

"ఉండుమరీ. అక్కడ ఉండగా ఒకసారి టైఫాయిడ్ పడ్డానని వ్రాశాను, జ్ఞాపకం ఉందా? అప్పుడు మా పిన్ని ఆ డాక్టరుగారి చేత ట్రీట్‌మెంట్ చేయించింది. ఇందులో

చెప్పడానికేమీలేదు. ఒకరోజు నీరసంగా పడుకుంటే మందు ఇస్తూ నా వంక చూశారు. అసలారోజునుండే నేను కూడా ఆయన్ను ప్రేమిస్తున్నానని నాకే తెలియదు. ఆ తరువాత నయమయ్యాక హాస్పటలుకు వెళ్లుతుండేదాన్ని. ఆ చనువును పురస్కరించుకొని ఓ నాడు తన మనస్సు విప్పిచెప్పారు. మనం అంగీకరించాం. రేపోమాపో పెద్దవాళ్లచేత అడిగిస్తారు. మనం ఏవో పిచ్చి ఆశయాలు పెట్టుకుంటాంగానీ, అందరూ పోతున్న దారిలోనే మాధుర్యం వుంది నీలా."

"అవును రాధా! అవును" నిట్టూర్చాను నేను.

"నీ అదృష్టానికి అభినందించకుండా ఉండలేక పోతున్నాను. నాకే పెళ్లవుతున్నదన్నంత ఆనందంగా వుంది."

"అది సరే. మరి నీ మాటో?"

"నా మాట కూడా నీకు తెలుస్తుందిగా త్వరలో" అన్నాను. అనూరాధ వెళ్లిపోయింది. ఎంత ఆనందం తనలో! నా రాధకు జతగాడు దొరికాడు. ఇటుపై నా స్నేహం తనకక్కరలేదు. నేను లేకపోయినా తనకు ఫర్వాలేదు. నా ఆశయాలు – ముచ్చటయిన తోటా, మధ్యను బ్లూ హౌస్! దానిలో చివికిపోయిన హృదయంతో ఒంటరిగా నేనూ!

"నే నొంటరినయిపోయాను భగవాన్! నా కెవరూ లేరు." కనిపించని దేవునితో నా గుండెల్లోని బాధ ఒక్క మాటలో చెప్పుకొని వెక్కివెక్కి ఏడ్చాను.

వెంకటమ్మ చేష్టలు రోజు రోజుకూ మితిమీరుతున్నాయి. నాన్నగారంటే అసహ్యం అయిపోయింది. మంచిగా ఉంటున్నా

అ మంచిని నిలవనియ్యడం లేదు. పెద్దక్కకు చాలా ఉత్తరాలు వ్రాశాను రమ్మని. తన దగ్గరనుండి జవాబే లేదు.

ఇంట్లోని భాగోతం భరించడం కష్టంగా వుంది. ఆలోచించి ఆలోచించి చివరికి వెంకటమ్మను పంపించేయకపోతే అన్నం తిననని నిరాహారదీక్ష పూనాను. అప్పటికే వూళ్లోని బంధువులంతా నాన్నగారి వ్యవహారంపట్ల అయిష్టంగా ఉన్నారు. నలుగురూ వచ్చి మందలించి ఎలాగయినా వెంకటమ్మను పంపించవేయవలసిందనే తీర్మానానికి వచ్చారు.

చివరికి ఒకనాడు మమ్మల్ని తిట్టుకుంటూ నాన్నగారిని పట్టుకుపడ్చి డబ్బు దస్కం దండిగా పట్టుకుని మా ఇంటినుండి నిష్క్రమించింది వెంకటమ్మ. ఎవరూ సాధించలేని కార్యాన్ని నేను సాధించాననే తృప్తి మిగిలిందినాకు. కానీ తత్ఫలితంగా నాకూ, నాన్నగార్కి బద్ధవైరం ఏర్పడింది. నాపేరు వింటూనే మండిపడుతున్నారాయన.

"నా సుఖం పోగొట్టావు. వెంకటిని పంపించినందుకు తగినశాస్తి అనుభవిస్తావువే. చూస్తూండు."

"ఏంచేస్తావేమిటి?"

"నీ చదువూ గిదువూ బుగ్గిలో కలుపుతాను."

"నువ్వు చేసేదిమీ లేదు. నువ్వూ కాకపోతే అక్కయ్యా చదివించుకుంటారు."

"చూస్తానుగా అదీ! ఎంతదానివయ్యావే! నన్నెదిరించేటంతదానవా?

పరీక్షా ఫలితాలు తెలిశాయి. నేను సెకండ్ క్లాసులో పాసయ్యాను. అనూరాధకు ఫస్ట్‌క్లాస్ విజయ హెచ్.ఎస్.సి.

పాసయింది. అనూరాధ పెళ్ళి దగ్గరపడుతూంం. నా సెలవు లయిపోవచ్చాయి. నా మనసులోని ఆందోళన అధికమైంది.

జరిగిన విషయాలన్నీ వ్రాస్తూ, కర్తవ్యం తోచడం లేదని పెద్దక్కకూ, భారవికీ, ఛాయకూ రెండుత్తరాలు వ్రాసి పడేశాను. బాలికను! ఏంచెయ్యగలను, నావాళ్లున్నారనే ధైర్యంతప్ప? ఆందోళనగా ఎదురుచూస్తున్నాను వాళ్లు వస్తారని దేనికయినా ఒక హద్దు ఉంటుంది. నాకు ఓర్మి నశించింది. కాలేజీలు తెరిచి నెలకావస్తూంది. అక్కగానీ, ఛాయగానీ, కనీసం భారవి ఐనా ఒక్క ఉత్తరం వ్రాయలేదు. ఎలా వున్నావని అడగలేదు.

నా కళ్లల్లో రోజూ కాలేజీయే మెదులుతూంది. నర్మదతో, స్నేహితులతో సరదగా ఆ తోటలలో, హాస్టల్లో నేను గడిపిన దినాలు జ్ఞాపకం వచ్చి తనివితీరా ఏడ్చేదాన్ని. అందరినీ నమ్మాను. వంచింపబడ్డాను. నాన్నగారి ఆగ్రహానికి గురికావడం ఇష్టంలేకనో, లేక డబ్బు ఖర్చయి పోతుందనో, ఆఖరికి భారవికి కూడా 'నువ్వేనా జీవనసర్వస్వం' అని బాసలు చేసిన భారవికి కూడా నా యోగక్షేమాలు అవసరం లేక పోయాయి.

ప్రపంచం అంతా చీకటీ, కుళ్లుగానూ అందరూ వంచకులుగానూ తోచేవాళ్లు నా కంటికి నిస్సహాయంగా రోజులో చాలా భాగం కన్నీటితోనే గడిపేదాన్ని. నా రూపాన్ని నేనే పోల్చుకోలేక నంతగా మారిపోయాను.

కాటుక లేక తెల్లగా కదిలే కనురెప్పలూ బొట్టు లేకుండా కళాహీనంగా ఉండే నుదురూ చింపిరి జుత్తూ జిడ్డు

కరే చెక్కిళ్లు బయటపడిన ఎముకలతో వికృతంగా వున్నాను నా కంటికి నేనే. డైరీలు వ్రాసుకోవడం మాని వేశాను. గడిచిన రోజుల్లో అమ్మ ఉన్నప్పటి దినాలనూ, నా బాల్యాన్ని గుర్తుకు తెచ్చుకుంటూ మనసారా ఏడ్చేదాన్ని, ఇంకా ఏదో బ్రతుకు మీద ఆశ మిగిలి ఉందేమో అంతరాల్లో ఏ కోశంలోనయినా!

నన్నూ విజయనూ వేగం అత్తవారింటికి పంపించి వేయాలని నాన్నగారి సంకల్పం. వచ్చిన సంబంధాలను కొన్నిటిని నేనే తిరస్కరించాను. కొందరు నాకు శ్రమ కలిగించకుండా వాళ్లే తోకముడిచేవారు. నా రూపం అలా మారి పోయింది మరి!

నా ప్రణయ దినాలు తలచుకుంటూ ఉంటే, ఏడుపూ, నవ్వూ రెండూ వచ్చేవి. ఆలోచనలతో తలపగిలి పోయేది.

ఎంత పిరికివాడయ్యాడు భారవి! ఇకనాకు ఎవరి లెక్కా లేదు. ఎవరిపైనా ప్రేమాలేదు. కరిగి, కరిగి, ఈ నా గుండె ఘనీభవించి పాషాణ మయిపోయింది. మోసపోయాను. పచ్చి మోసం! దగా! వంచన! అంతే. తన మనసుకి కష్టం గలిగినప్పుడు నేను పనికి వచ్చాను. మనసునిండా గాయాలతో ఈ నాడు నేను కుమిలి, కుమిలి కృశించిపోతూ ఉంటే మొహం చూపించడానికి ధైర్యంలేక పోయింది.

నేనొక సారాయిలాంటిదాన్ని. బావకు భ్రమ కలిగించాను, నిషా ఎక్కించాను. ఆ మత్తు దిగిపోయి, వాస్తవ లోకానికివచ్చి ఉంటాడీవేళకు. ఛాయ బాగా అర్థమయి ఉంటుందిప్పుడు. నా నిషాకూడా దిగిపోయింది. ఒక్కొక్కళ్ల

నిజరూపాలు బయటపడుతున్నాయి. ఛీ! తప్పంత నాదే. పసిపిల్లనా ఏమిటి? తెలిసి తెలిసి అందర్నీ నమ్మి మోస పోయాను. ఆ దంపతులిద్దరినీ విడదీసిన పాపం నన్నిలా ఏడిపిస్తూంది. ఆ పాపఫలితమే నన్నిలా గడించి హింసిసూంది. అక్కకుకూడా అక్కర్లేకపోయాను. నిజమే. ఎవరిజీవితం వారిది. ఎవరి స్వార్ధం వాళ్లది!

నా గడిచిన జీవితం ఒక పీడకల అనుకుంటాను. నా ప్రణయ స్మృతులన్నీ మిధ్యాజనితాలకుంటాను. నా జ్ఞాప కాలన్నీ స్వప్న దృశ్యాలనుకుంటాను. నేనే మీ తెలియని ఒక కన్నెపిల్లననుకుంటాను. ఇక ఎవరికోసం బ్రతకను ప్రభూ! ఏ ప్రేను అయితే నావి అనుకున్నానో దాన్ని పొందలేక పోయాను. కోరుకున్న ఆశయాలలో ఒక్కటయినా నెర వేర్చుకోలేక, జీవితంలో దేనినీ అనుభవించకుండానే విరక్తి చెందిన ఈ హృదయంతో ఒంటరిగా ఈ లోకంలో ఎలా గడపను?

శిరోవేదన భరించలేక తల బాదుకొనేదాన్ని. నా స్థితి చూస్తూ విజయ బెంగటిల్లిపోయేది.

అనూరాధ పెళ్ళి అయి వెళ్ళిపోయింది.

"పెళ్లి చేసుకో నీలూ. స్త్రీకి జీవితంలో అంతంవరకూ అండగా నిల్చేది భర్త ఒక్కడే. నీ మనసు మార్చుకో" అని వ్రాసేది అక్కడినుండి.

నేను జీవరహితంగా నవ్వుకునేదాన్ని. నా సంగతులేవీ అనూరాధకు చెప్పలేదు. చెప్పి లాభంలేదని. నిజమే తను చెప్పినట్లు స్త్రీ జీవితానికి అండ పురుషుడొక్కడే. తన భార్యను

కాదు కాబట్టే భారవి ఇంత నిర్వికారుడయిపోయాడు నా విషయంలో. పెళ్లి చేసుకుని ఒక అమాయకుణ్ని మోస గించాలని లేదు, తాను పెళ్లాడిన కన్య స్వచ్ఛంగా ఉండాలని ప్రతి యువకుడూ కోరుకుంటాడు. నేను నటించలేనిక. ఈ జీవిత నాటకంలో. జీవన పోరాటంలో పూర్తిగా పరాజితురాలనయి పోయాను. పెళ్లి చేసుకుని ఒక అమాయకుణ్ని నాశనం చేసే పాపాన్ని కూడ భరించలేనిక.

ఎక్కడో ఒక కథ చదివాను. అందులో భర్త తన భార్యతాలుకు పూర్వ ప్రణయగాథ వినికూడా సహృదయంతో ఆదరిస్తాడు. అలాంటి పురుషులెక్కడ లభిస్తారురునాకు ? అంతా కల్ల! పురుషాంకారం అంత త్వరగా లొంగదు. ఎప్పటికయినా అతనిలోని అహంపడగవిప్పి బుసకొడుతూంది. కాటువేస్తే! వద్దు. ఏ జీవితమూ వద్దు!

నాన్నగారికి వెంకటమ్మ నుండి ఉత్తరాలు వస్తున్నాయి ఇక ఏ విషయంలో నేను పోట్లాడ దల్చుకోలేదు. ఇలా ఒక్క ఎనిమిది నెలలు గడిచాయి. ఒకనాడు :

ఏనాడు లేనిది నాన్నగారు ప్రేమగా పిలిచారు. ఆ వేళ!

"అమ్మా నీలా! ఓసారిలారా!"

"ప్రేమగా పిలిచే పిలుపుకోసం మొహం వాచిఉన్నాను. అలాంటి పిలుపు విని చాలా రోజులయింది. కన్నీరు తుడుచు కుని నాన్నగారి దగ్గరకు వెళ్లాను. కూర్చోమన్నారు. కూర్చున్నాను.

"నేను చూస్తే కాలం మళ్ళినవాణ్నియ్యాను. నా తర్వాత మీకు వివాహం చేసే వాళ్ళుండరు. మరి పెళ్లి చేసుకోవా ?" అన్నారు.

"చేసుకోను నాన్నా ! విజయకు చేసెయ్." తలవంచు కొనే అన్నాను.

"మరి నువ్వేం చేస్తావు ?"

"చదువుకుని ఉద్యోగం చేస్తాను."

"ఆధైర్యం నీకుందా ?"

తల ఊపాను.

"ఒకవేళ హఠాత్తుగా చనిపోయినా విజయ సంగతి నువ్వు చూసుకోగలవా ?"

"చూసుకోగలను."

"సరే, వెళ్లు"

నాకేమీ అర్థం కాలేదు. అయోమయంగానే లేచి వచ్చేశాను. వారం రోజులు గడిచాయి. ఆవేళ ఏదో పనిమీద ఊరికి వెళ్తున్నారు. నాన్నగారు. రెండురోజుల్లో వస్తానని చెప్పారు. రెండురోజు లయ్యాక పోష్టులో ఒక కవరు వచ్చింది. నాన్నాగారి నుండి.

"ప్రియమైన కుమార్తె నీలాసుందరికి,

నీ తండ్రి వ్రాయునది. నాకు వయసుచెల్లి పోయినది. కేవలం మీ ఇద్దరి కోసమే నేను బ్రతికి వున్నాను. నీవు వివాహం వద్దన్నావు. నీ శక్తి సామర్థ్యములు నాకు తెలుసును. కాబట్టి

మిమ్మల్ని విడిచిపెట్టి తీర్థ యాత్రలకి వెళ్ళిపోతున్నాను. ఎక్కడ రాలిపోతానో తెలియదు. నా కోసం వెతికి వృథా ప్రయాసపడవద్దు. నా ఆస్తి నంతటినీ అమ్మివేసి నగదును మీ నలుగురికి పంచి ఇస్తూ వీలునామా వ్రాసి రిజిష్టరు చేయించాను. ప్లీడరు విశ్వనాథంగారి నడిగినచో ఆ విషయ ములు తెలుపుతారు. నీకూ, విజయకు ఎక్కువ వ్రాసి ఇచ్చాను. విజయకు మంచి సంబంధం చూసి ఘనంగా వివాహం జరిపించవలసింది. ఇంటినేమి చేస్తారో మీ ఇష్టమే. నీ అక్కయ్య లిద్దరికీ ఈ విషయమై వ్రాశాను. వాళ్లు కొద్ది రోజుల్లో రాగలరు. అన్నీ పరిష్కరించు కోవలెను. ఆశీర్వచనములుతో........."

రాఘవయ్య

చదివి పిచ్చిదానిలాగా నిలబడిపోయిన నా చేతిలోనుంచి ఉత్తరం తీసుకొని చదివి బావురుమన్నది విజయ.

విషయం తెలుసుకొని ఊళ్లోవాళ్లు నలుగురూ వచ్చి ఓదార్చి వెళ్లారు, బంధువులువచ్చి వండిపెట్టి, ఊరడించి వెళ్ళి పోతున్నారు. బిక్కుబిక్కుమనే ఇంట్లో ఉండడం దుర్భరంగా వుంది. విజయకు ధైర్యం చెబుతున్నానేగానీ, నాకూ గుండెలు పగిలిపోతున్నాయి.

చాలా రోజులైంది డైరీలుతీసి. వాటినింక ఉంచకూడదు. ఇతరులు చదవడంతో అదికూడా నాలాగే మలినమైపోయాయి. అన్ని స్మృతులతోపాటు అవికూడా దగ్ధమైపోనీ! ఒక్కొక్క డైరీ తీసి చదువుతూంటే కన్నీరు కాలువలు కట్టింది. అమ్మ ఉన్నప్పుడెంత ఆనందం! బాల్యం ఎంత మధురంగా గడిచింది!

పిచ్చిగా అందర్నీ ద్వేషించాను. అంతే! అమ్మపోయి ఎన్ని యుగాలో గడిచిపోయినట్లనిపిస్తూంది. రెండేళ్లలో లోకమే తారుమారయినట్లయినట్టుంది.

ఎక్కడున్నారు చిన్నప్పటి స్నేహితులూ, వ్యక్తులూ! ఆ మధురదృశ్యాలన్నిటినీ ఎవరు చెరిపివేయరు? ఆ స్మృతులన్నీ దేనిలో లీనమైపోయాయి?

శ్రీనివాసరావు ఎక్కడున్నాడో! విజయ ప్రపంచంతో ప్రపంచంతో సంబంధంలేకుండా గడిపానీ ఎనిమిది నెలలూ! విషాదంగా గడిచిన ఆస్పత్రి జీవితం, తీయని చల్లని కాలేజీ హాస్టలూ, ప్రేమ మత్తులో భారవీ, నేనూ కేరింతాలుకొట్టిన విహారస్థలాలూ!

డైరీలోని పేజీలు తిరిగిపోతున్నాయి. నాకు నేనొక ముసలిదాన్నిగా కనుపిస్తున్నాను. శుష్కించిపోయి, శ్వేత వస్త్రాలతో; జీవన సంధ్యలో కూర్చొని మృత్యువు కెదురు చూస్తున్నట్టున్నది. డైరీలన్నీ చదివేసి నిప్పంటించాను. గుండెలనెవరో రంపంపెట్టి కోస్తున్నట్టూ, వేయి కత్తులతో పొడుస్తున్నట్టూ వుంది. కాలిపోతున్నవి నా డైరీలుకావు. గడిచిన నా జీవన స్మృతులు. కాలిపోయాయి; కాలి నుసి అయిపోయాయి.

భారంగా తూలిపోతూ, తలను రెండు చేతులతోనూ నొక్కుకొని లోపలికెలా వచ్చానో నాకే తెలియదు. వచ్చి మంచంపై వాలిపోయాను అంతే; నాకు బాహ్య చైతన్యమె తప్పిపోయింది.

నేను కళ్లు తెరిచేసరికి నా కెదురుగా కన్పించింది విజయ. కన్నీళ్లు మెరుస్తున్నాయి కళ్లల్లో. దిగులుగా నవ్వింది.

"చాలా గాబారా పెట్టావమ్మా ఈ మూడు రోజులూ" అన్నారు డాక్టరుగారు నవ్వుతూ. మూడు రోజులు స్మారకం లేకుండా పడివున్నానా ?

"ఎలా ఉందే నీలా ?" పెద్దక్క వంగుతూ అడిగింది. పక్కనే ఛాయ. ప్రకాశ్, భారవీ డాక్టరును సాగనంపి గాబోలు లోపలికి వచ్చారు. అందరినీ చూచి చిన్న నవ్వు నవ్వాను. లేవబోయను. నా అవయవాలు నా స్వాధినంలో లేవు. చాలా బలహీనంగా వుంది. అలాగే పడుకున్నాను.

కొద్దిరోజుల్లో లేచి తిరగగల శక్తి వచ్చింది. అందరం ఒక రోజు సమావేశమయ్యాము.

"ఏమిటే నీలా, నిర్ణయం ?"

"ఏముందక్కా ! చదువుకోవడమే."

"మరి పెళ్లి చేసుకోవా ?"

"ఎందుకు చేసుకోనూ ?" ఇష్టమైప్పుడు నీకు చెబుతాలే." కావాలని నొక్కి చెప్పాను. ఈ మాటలు బహుళ భారవీ ఛాయల గుండె బరువును తగ్గించాయను కుంటాను. పోనీ; అదే పదివేలు !

"మరి విజయెక్కడుంటుంది ?"

"తననే అడగండి."

"నీలక్క ఇష్టమే" అంది విజయ.

అందరూ నావైపు చూశారు.

విజయ నెక్కడా ఉంచడం నాకిష్టంలేదు. శాంతినికే తనంలో చేర్పిస్తాను. సంబంధం కుదిరాక పెళ్ళి చేసేద్దాం."

విజయ సంతోషంగా అంగీకరించింది.

"ఇంటి నేం చెయ్యడం ?" అన్న ప్రశ్న వచ్చింది.

"అద్దె కివ్వండి. అద్దెను నీవూ. ఛాయా తీసుకోవచ్చు" అన్నాను పెద్దక్కతో.

విజయను శాంతినికేతన్‌లో చేర్చే బాధ్యత పెద్దక్కపై పెట్టాను. నా వాటా 20 వేలూ తీసుకున్నాను. విజయ డబ్బు బ్యాంకులో వెయ్యడానికి నిశ్చయమైంది.

ఆవేళ చాటుగా నన్ను కలుసుకున్నాడు భారవి.

"ఏం బావా, చెప్పాల్సినదేదయినా వుందా ? రేపే వెళ్ళిపోతున్నాను." అన్నాను నవ్వుతూ. ఇలాగే వెళ్ళిపో తున్నానని చెప్పడానికి ఆవేళ డాబామీదికి వచ్చాడు భారవి. ఇప్పుడన్ని అనుభవాలూ గడిచిపోయాయి.

"ఇక నీ నిర్ణయం మారదా నీలా ?"

"మారదు."

"నన్ను మోసగాణ్నిగా లెక్కించుకున్నావా ?"

ఆఁ – ఒకప్పుడు. కానీ ఇప్పుడదంతా లేదు. నువ్వు కేవలం నా అక్క భర్తవి. ఇప్పుడెవరి మీదా ద్వేషం లేదు నాకు. అందరూ మంచి వాళ్లుగానే కన్పిస్తున్నారు. ఈ ప్రేమా, గీమా అన్న పదాలు కూడా చాలా వరకు మరచి పోయాను. నాటి కర్థం తెలిసినవాళ్లు జ్ఞాపకం పెట్టుకోవడం మంచిది. అంతా గాస్ అని అనుకునే నాలాంటి వాళ్లకు

దానితో పనిలేదు బావా. మునుపటి నీలను కాను. తను చచ్చిపోయింది.

"మాటలతో గాయాలు చేస్తున్నావా, నీలా? నా గురించి ఆలోచించావా?"

"ఆ ప్రశ్న నేను వేయాలి. కానీ, నే నిచ్చే జవాబు వలన నీ కేమీ ఉపయోగం ఉండదనుకుంటాను."

"ఎంత మారిపోయావు నీలా!" నవ్వు వచ్చింది ఆ మాటలకు. మారిందెవరో, మార్చిందెవరో!

"నేను చెప్పబోయేది కుతూహలంగా ఉండకపోయినా చెబుతున్నాను. ఈ ఎనిమిది నెలల్లోనూ ఛాయ కారణంగా మరింత బాధ అనుభవించాను. తనకి హిస్టీరియా వచ్చింది. ఆ ఆవేశంలో సముద్రంలో పడిపోతానని చాలా సార్లు వెళ్లిందీ. నేను నీ గురించి యెలా ఫీలయ్యానో ఇప్పుడు చెబితే ఏమీ ప్రయోజనం లేదు."

"ఆ మాట నిజమే."

"ఆ తరువాత ఛాయను బాగుచేసుకోవడం, తనకి బాగయ్యాక ఇక నీ పేరెత్తనని ప్రమాణాలు చెయ్యడం వరకూ వచ్చింది."

"మంచిదే కదూ! నవ్వాను.

"అదృష్టవంతురాలివి నీలా! తేలికగా నవ్వగలుగుతున్నావు. నీకు నా సహాయం ఇటుపైన అక్కర్లేదుగా!"

"కృతజ్ఞురాలిని. ఎవరి సహాయం అనవసరం ఉండదనే అనుకుంటున్నాను. మా నాన్నగారు ఆ ఉపకారం ఒక్కటిచేసి వెళ్ళిపోయారు."

మా సంభాషణ ఆ విధంగా ముగిసిపోయింది. ఆ మర్నాడు రైలెక్కాను వంటరిగా! నన్ను దిగబెడతానన్న వారిని వారించాను. విజయ ఏడ్చింది. దాన్ని ఓదార్చాను. ధైర్యం చెప్పాను.

ఒకనాడు వైజాగు వెళ్లే రైల్లో కూర్చుని ఉండగా అనూరాధ అన్నది—"మనం ప్రయాణించేది ఆశయాల రైలు పెట్టె" అని. ఆ భ్రమతోనే వెళ్ళి జీవితాన్ని సర్వనాశనం చేసుకున్నాను. ఇప్పుడు కేవలం శూన్యంగా ప్రయాణిస్తున్నాను నాకోసం నేను బ్రతకడానికి దూరతీరాలకు మారిపోతున్నాను. శంకర్ గారూ!

అక్కడినుండి వచ్చి ఈ బెనారసీ యూనివర్సటీ చేరాను. పైకి మనిషిగా కనిపించాలని సరదాగా ఉండేదాన్ని. మీలో శాంతమూ, ఔన్నత్యమూ నన్నాకర్షించి, మీతో చనువు, నేర్పరిచాయి. అంతకండే వేరే ఉద్దేశంలేదు. ఇంతగా వేడి లాగెంతువేసే నాలో ఇన్ని అగ్నిపర్వతాలు రగులుతున్నాయంటే నమ్ముతారా? నా వెనుక ఇంత గాథ దాగిఉందంటే మీకు "కలా!" అనిపించడంలేదూ? ఇరవయిరెండేళ్ళకే వృద్ధురాలినయిపోయాను.

నన్నెవరూ ప్రేమించేవారు లేరు కాబట్టే హాయిగా ఉంటున్నాను. లెక్చెరర్‌గా చూశానే కానీ, మీరు నన్ను ఇలా అడుగుతారని ఊహించలేదు. సెలవు పెట్టేసి వెళ్ళిపోతున్నాను. నలుగురు స్నేహితులనూ చూసి, ఏనాడయినా తిరిగి వస్తాను.

చివరిసారి ఒక్క కోరిక. నేను కాదన్నానని చెప్పి మీరు జీవితాంతం ఇలా ఉండిపోలేరు. మీరేనాటికైనా ఒక గృహస్థుగా బాధ్యతలను నిర్వర్తించ వలసి ఉంటుంది. మీ గృహంలో గృహిణిగా మీ శాంత ప్రవర్తనకు విజయ తగినది.

తనకు ఇవాళే ఉత్తరం వ్రాస్తున్నాను. మీరు వెళ్ళి శాంతిని కేతన్‌లో తనను కలుసుకోండి. ఇద్దరూ ఒకటి అవండి. మీరు దీన్ని కాదనలేరు. మీ స్నేహితురాలిగా మనః స్ఫూర్తిగా వేడుకుంటున్నాను. మీరు ఇంకెవరి అభిప్రాయమూ తీసుకో నవసరం లేదు.

ఇన్నాళ్ళకు — నన్ను నిస్వార్థంగా అభిమానించే వాళ్ళున్నారంటే ఆనందం కలుగుతున్నది. ఆ ఆనందమే ఈ జన్మకు చాలు. అందరి హృదయాలనే తీగలతో నా జీవన రాగాన్ని విశ్వవిపంచిలో మ్రోయించాలనుకున్నాను. అమ్మ వెళ్ళిపోయింది. బంధం తెంచుకుని నాన్నగారు మాతో సంబంధాన్ని తెంచుకున్నారు. నేను అందరినుంచీ విడిపోయాను. ఆ విపంచిక భగ్నవీణ అయ్యింది. ఈ విషాదవిపంచిపై మీరు మధురరాగాన్ని ఆలపించలేరు. ఉంటాను......

నమస్కృతులతో,
నీలాసుందరి."

చదవడం పూర్తిచేసి కన్నులు తుడుచుకున్నాడు శంకర్ ఏమీ ఎరుగని శిష్యురాలులా ఉండే నీలాసుందరి హృదిలోని గాథ అతని హృదయపు లోతులను స్పృశించి కదిలించిది.

సమాప్తం